The Largest Circulated Telugu Monthly

# చతుర



ఏప్రిల్ 1988

రూ. 3/-

# పాఠకులకు మనవి

## చతుర

**వేటికి అవే తమ ప్రత్యేకతను సాటిలేని విధంగా రూపొందించుకుని, నిలబెట్టుకున్న జంట పత్రికలు చతుర - విపుల**

పత్రికా ప్రపంచంలో, రచనా ధోరణులలో ఎన్ని విపరీత పరిణామాలు సంభవించినా ఒక స్థాయికి, పాఠకుల శ్రేయస్సుకు కట్టుబడి కష్టనష్టాలకు తట్టుకున్న పత్రికలు విపుల - చతుర.

నెలనెలా విశ్వసాహిత్యంలోని ఆణిముత్యాల్లాంటి కథల్ని వ్యయప్రయాసల్తో సేకరించి, అచ్చతెనుగు కథల్లా అనువదింపజేసి పాఠకులను అలరింపజేస్తున్నది విశ్వకథా విపంచి విపుల.

మార్కెట్‌లో కనీసం పాతిక రూపాయలకుగానీ లభ్యంగాని నవలను కేవలం రు: **2-50** కే అందజేస్తున్న నవనవలా వేదిక చతుర.

ఉత్తమ రచనల కోసం మరే పత్రికా సాహసించనిరీతిలో లక్షరూపాయల బహుమతులతో భారీయెత్తున నవలలు - కథల పోటీలు అఖిలభారత స్థాయిలో నిర్వహించాం.

పాఠకుల, రచనల స్థాయిని పెంచటమే, ధ్యేయంగా ఏనాడూ వెనకడుగు వేయని ఉత్తమశ్రేణి పత్రికలుగా విపుల - చతుర ప్రశంసలను పొందాయి.

వారపత్రికలు సైతం రు. **3/-** కు తప్ప లభ్యంగాని రోజుల్లో కూడా విపుల - చతురల ధరను పెంచకుండా ఇన్నాళ్లూ అందించగలిగాం.

అయితే, ఇటీవలికాలంలో న్యూస్‌ప్రింట్ ధర, ముద్రణా వ్యయం మరోసారి విపరీతంగా పెరిగిపోయాయి. పత్రికా నిర్వహణ భరించలేని భారంగా తయారవుతున్న పరిస్థితుల్లో విపుల - చతురల వెల కూడా పెంచటం తప్పనిసరి అవుతున్నది.

ఏప్రిల్ 1988 సంచిక నుండి విపుల విడి ప్రతి రు: 3/- గానూ, సంవత్సర చందా రు: 36/- గానూ మార్చుతున్నాం.

అలాగే చతుర విడిప్రతి రు: 3/- గానూ, సంవత్సర చందా రు: 36/- గానూ గమనించగోరుతున్నాం.

ఈ మార్పు పాఠకులకు పెద్దగా భారం కాదుగాబట్టి సహృదయంతో ఎప్పటివలెనే ఆదరించగలరని విశ్వసిస్తున్నాం.

— బిజినెస్ మేనేజర్

## విపుల



# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. పాఠకులు 'చతుర' నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో లేదా ఎందువల్ల ఆ నవల తమకు నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ వమీక్షలు రాయటం మంచిది.

1. "సమీక్ష" అరఠావుకి మించకుండా, కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింద కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై 'చతుర' సమీక్షకు అని పేర్కొని, ఎడిటర్ 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టు చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపిక చేసి, ప్రచురించినవాటిలో తొలి మూడింటికి రు. 100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

పాఠకులు నవలతోబాటు 'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతుర ప్రపంచం, చతుర కథలు, ఫీచర్లు వంటి ఇతర అంశాలవల్ల కూడా తమ తమ అభిప్రాయాలు, సలహాలు, సూచనలు కూడా విడిగా వేరే కాగితంపై రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలచాం.

## కూపన్

ఏప్రిల్ 'చతుర' నవల : సంహారం

సమీక్షకుని పేరు: ..............................

చిరునామా: ..............................

..............................

..............................

..............................

# ఉచితం!

ఒక అపూర్వమైన

# దొర్లుతు వెళ్ళే గిలక



త్వరపడండి ! స్టాకులు పరిమితం

## ప్రతి సెరిలాక్ ప్రమోషనల్ డబ్బాతో బాటు

అందమైన ఈ రంగు రంగుల గిలకతో మీ పాపాయి ఆడుకుంటుంటే చూసి ఆనందించండి. కాస్త తోస్తే చాలు ఈ గిలక అన్ని వైపులా నేలంతా దొర్లుకుంటు పోతుంది. అది చూచి మీ పాపాయి కేరింతలు కొడతాడు. మీరు కొనుగోలు చేసే ప్రతి సెరిలాక్ ప్రమోషనల్ డబ్బాతోబాటు ఈ అందమైన గిలకని ఉచితంగా తెచ్చుకోండి.

4 నెలల నుంచి మీ పాపాయికి పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. టీన్ని సెరిలాక్ లాభంతో ప్రారంభించేందుకు ఇది సరైన సమయం.

పోషకాహార లాభం :
సెరిలాక్ ప్రతి మోతాదులోను (ప్రతిసారి మీ పాపకు తినిపించే సెరిలాక్ లోను) మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బొహైడ్రేట్లు, ఖనిజ పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలు అన్నీ ఉన్నాయి. మీ పాపాయి ప్రత్యేక అవసరాలకు తగినట్లుగా సరైన పాళ్ళల్లో అన్నీ సమతూకంలో ఉన్నాయి.

రుచి లాభం :
సెరిలాక్ మంచి పోషక పదార్థాలకు మంచి రుచిని కలిపింది. పాపాయిలకు సెరిలాక్ రుచి లోకి ఇష్టం.

సమయం ఆదా లాభం :
సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలు పంచదార ఉన్నాయి. దానిని వెచ్చటి నీటిలో కలిపితే చాలు. క్షణంలో ఆహారం తయారు.

ఎంపిక లాభం :
పాపాయికి ఆహారం తినిపించడం మరింత ఆహ్లాదకరంగా చేసేందుకు, యిప్పుడు ఎంచుకునేందుకు రెండు రకాల సెరిలాక్ దొరుకుతోంది. 4 నెలల నుంచి సెరిలాక్ వీట్. 6 నెలల తరువాత కొత్త సెరిలాక్ ఆపిల్

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకు తయారు చేయడంలో పరిశుభ్రతను పాటించేందుకు డబ్బా మీద సూచనలను జాగ్రత్తగా పాటించండి.







## మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం

R K SWAMY/FSU/5015-TE

# చతుర కతలు

## బేరం

"హలో... రండి రండి... ఎవరి కోసమండీ? ఏం పని మీద వచ్చారు?"

"ఆ... ఇల్లు ఎలా ఉందో చూద్దామని వచ్చామండీ! మీరు ఈ ఇంటి యజమానేగదూ?"

"ఆ... ఆ నేనే- నా పేరు సూర్యారావ్! ఇలా లోపలికి రండి"

"తర్వాత తీరికగా కూర్చుని మాట్లాడుకుందాంగానీ, ముందు ఇల్లు చూపించండి"

"అలాగే! మీ ఇష్టం - అలా పదండి"

"ఇది డ్రాయింగ్ కమ్ డైనింగ్ రూమ్ అనుకుంటాను. మొజాయిక్ బాగానే ఉంది గాని షైనింగ్ ఏమిలేదుకదరా అబ్బాయి?"

"అవున్నాన్నా! ఈ బెడ్‌రూమ్‌లో అసలు కప్‌బోర్డ్స్ లేవు నాన్నా!"

"అన్నట్లు కిచెన్‌లో ఉన్న పైపులోకి నీళ్ళు వస్తాయా? అసలే నీళ్ళ కరువు, ప్రెషర్ తక్కువ కూడానూ"

"నీళ్ళకేం కరువులేదు. కిచెన్‌దాక వస్తాయండి"

"బాత్‌రూమ్ చూద్దాం పదండి"

"ఇదేనండీ బాత్‌రూమ్!"

"బాత్‌రూమ్‌కి ఇటువంటి ఫ్లోర్‌వేశారేమిటయ్యా! లోపలకి అడుగుపెట్టానో లేదో కాలు జారింది. కాస్త అజాగ్రత్తగా ఉంటే చచ్చేవాడినే"!

"ఖరీదైన ఫ్లోరింగ్ కదండీ, అదంతే! అదీ గాక గొప్పవాళ్లే బాత్రూంలో కాలుజారిపడుతుంటారు"

"సరే... ఇపుడు చెప్పండి - ఎన్ని గజాల స్థలంలో ఈ ఇల్లు కట్టారు? ఎన్ని సంవత్సరాలైంది కట్టి. గోడలు ఎంత మందంతో కట్టించారు? ఆ ఇసుకలో సిమెంట్ ఎన్నిపాళ్ళు కలిపారు? ఏ కంపెనీ సిమెంట్ వాడారు?"

"అన్ని కంపెనీల సిమెంటూ- ఏది దొరికితే అది వాడామండీ!"



"ధర చెప్పారు కాదు!"

"ఐదులక్షలకన్న తక్కువ ఒప్పుకోమండీ!"

"నాలుగు లక్షలకు కనుక మీరు ఈ.... అంటే రిజిస్ట్రేషన్ రేపు 25వ తేదీకల్లా చేయించేద్దాం! ఏమంటావ్‌రా అబ్బాయ్?"

"నిజమే నాన్నా! 20వ తేదీకల్లా మనకు డబ్బు వచ్చేస్తుంది"

"నాకొక నెల టైమ్ ఇవ్వండి - ఇల్లు ఖాళీచేయాలికదా!"

"ఈ నెల 25వ తేదీకల్లా రిజిస్ట్రేషన్ అయిపోవల్సిందేనండి! అంత డబ్బు మా చేతిలో ఉంచుకోవాలంటే కష్టం. అసలే బందిపోట్లు"...

"అయితే రేపే చేయించుకుందామా?"

"అబ్బే... అంత త్వరగా అయితే ఎలా అండీ? ఇవుడేగా కొని ఇట్లా వస్తున్నాం. ఆ సంగతి తేలాలిగా మరి, ఏంరా అబ్బాయ్?"

"అవునవును... అలా కొని ఇలా ఇంటికెల్తుంటే 'ఫర్‌సేల్' బోర్డ్ కనిపించి ఇలా వచ్చాం"

"ఏం కొన్నారు? ఏ సంగతి తేలాలండి?"

అదేనండి- లాటరీ ఫలితాలు తెలిసేది 20వ తేదీనే! ఇవిగో టిక్కెట్లు".

**-యమ్. రాజేశ్వరి**

## రాంగ్ నంబర్

ట్రింగ్... ట్రింగ్... ట్రింగ్... ఫోన్‌మోగింది.

విసుగ్గా ఎత్తాడు విశ్వనాధం. అప్పటికే అరడజను రాంగ్ నెంబర్లొచ్చి అలసిపోయి ఉన్నాడతను. "హలో! రేపు యం.యల్.ఏగారింట్లో పార్టీకి 50 ప్లేట్‌వడ, 50 కాఫీ, 100 స్వీట్లు, చెప్పుకుపోతున్నాడు ఫోన్‌లో ఎవరో పెద్దమనిషి.

"రాంగ్‌నంబర్ ... ఇది హొటల్‌కాదండీ బట్టలదుకాణం."

"పరాచకాలాడకండి గుర్నాధంగారూ! యంయల్.ఏ.గారి కూతురు పుట్టిన రోజుపార్టీ, సరైన టైంకు అందకపోతే ఆయన మండిపడతారు. ఆపైన మీ ఇష్టం"

అవతల ఫోన్ పెట్టేసిన చప్పుడు. విసుగ్గా క్రెడిల్ చేశాడు విశ్వనాధం. దుకాణం మూసేసి ఇంటికివెళ్ళగానే నవ్వులు చిందిస్తూ ఎదురైంది సుబ్బులక్ష్మి.

విశ్వనాధానికి పెళ్ళై రెండేళ్ళయింది. అంతకుముందు బాగానే సాగింది వ్యాపారం. ఏడాదినుండి నష్టం రావడం మొదలయింది. ఎంత మెలుకువగా వ్యవహరించినా ఏదో ఒక

కారణంవల్ల నష్టంవస్తోంది. ఆర్నెల్లనుండి అది మరీ ఎక్కువయింది. దానికితోడు ఈ ఫోన్ డిస్టర్బెన్స్‌తో మరింత విసిగిపోయాడు. మంచి బిజినెస్ అవర్సులో ఒకటే రాంగ్ నంబర్స్ రావడం ఒకడు 50 వడలనీ, మరొక డు 80 ఇడ్లీ, 80 ఇడ్లీకి చట్నీ అని, మరొకడు చెట్నీ లేకుండా ఇడ్లీ అని, ఇంకొకడు వడలు లేకుండా చెట్నీ అనీ ఇలా... ఇది హొటల్ కాదయ్యా అంటే వినరు వాళ్ళు సాదవాళ్ళు చెప్పేసి ఫోన్‌పెట్టేస్తారు. మళ్లీ మాట్లాడితే "నంబర్ కరెక్టేనే" అని డబాయిస్తారు. దానితో వచ్చిన కష్టమర్లుతో సరిగా ప్రవర్తించలేక విస్తు క్కోవడం, వాళ్ళు కొనకుండా వెళ్ళిపోవడం ఇలా సాగుతోంది వ్యాపారం.

"ఏమిటలా ఉన్నారు?" ప్రశ్నించింది భార్య సుబ్బలక్ష్మి.

"ఏముంది మనషాప్ ఫోన్ నంబర్ కూ గాంధీనగర్‌లో ఉన్న ద్వారకా హొటల్ ఫోన్ నంబర్‌కు ఒక అంకే తేడా. ఆ హొటల్ వంటలు ప్రసిద్ధివే. పార్టీలకు సప్లై చెయ్యా టంలో స్పెషలిస్టుకూడాను. ఇంకేం ఫోన్ పె ట్టించాడు. అప్పట్నుంచీ ఇదొక సంత అయింది.

ఇది హొటల్‌కాదంటే వినరు. పోనీ నంబర్ మార్చమని ఆ హొటల్ గుర్నాథంతో చెబితే తన నంబర్ లక్కీ నంబరట మార్చ డట." విషయం వివరించాడు భార్యకు.

సుబ్బలక్ష్మి మెరుపులాంటి ఆలోచన భర్త చెవిలో వేసింది. అప్పటిదాకా నిరుత్సాహంగా ఉన్న విశ్వనాథం ఒక్కసారి ఎగిరి గంతేసి, అంతలావు ఉన్న సుబ్బలక్ష్మిని అమాంతం ఎత్తేశాడు.

సుబ్బలక్ష్మి సలహా ప్రకారం తన షాప్ పక్కనే ఉన్న మరొక ఖాళీగదిని అద్దెకు తీసు కొని దాంట్లో తనూ ఓ హొటల్ ప్రారంభించా డు. కేవలం పార్టీలకు సప్లై చెయ్యడం వరకే పెట్టాడు. ఫోన్ దగ్గర ఒక కుర్రాణ్ని కూర్చోబెట్టి వచ్చిన ఆర్డర్లన్నీ సప్లై చెయ్యటం మొదలెట్టా డు. బయటతిరిగి ఆర్డర్లు తేగల కుర్రాడినొక డిని నియమించాడు. వంటకాలు తీసుకెళ్ళాక ఎవరేనా "అయ్యో మేం ఆర్డరు చేసింది ద్వారకాకాదా" అంటే "పర్లేదుసార్ ఆ ద్వారక కంటే మా అయోధ్యలోనే బాగుంటుంది తినిచూడండి" అనేవారు.

అయినా పార్టీ ప్రారంభమయ్యాక వాళ్లు మాత్రం ఏంచేస్తారు దాంతో వ్యాపారం అభి వృద్ధయి పోయింది. మరో రెండు నెలల్లో బట్టలదుకాణంలో కూడా నష్టం పూడిలాభం రావడం మొదలెట్టింది. అటు బట్టల దుకా ణంమీద ఏకాగ్రత నిల్పగలిగాడు విశ్వనాథం ఇది తెలిసి తన నెంబర్ మార్పించేసుకున్నా డు ద్వారకాధీశుడు. కానీ ద్వారకది పాతనంబ రే అనుకొని రాంగ్‌నంబర్‌లు చేస్తూనే ఉన్నారు కష్టమర్లు. విశ్వనాథం సప్లై చేస్తూనే ఉన్నాడు. అటు గుర్నాథం తిట్టుకుంటూనే ఉన్నాడు.

—జాగృతీకిరణ్

## అలవాటు

**ప**దహారేళ్ల పంకజం భయంభయంగా, ఎటూ చూడకుండా నడుస్తోంది. రోడ్డు మీద ఎండ మండిపోతోంది. చెమటకు చేతిలోని గొడుగు జారిజారిపోతోంది. వేసుకున్న షిఫాన్ ఓణీ భుజంపై నిలువనంటోంది. కాళ్లు తడబడుతు న్నాయ్. అసలే ఆ ఏరియాకి పంకజం కొత్త. ఈ మధ్య ఇల్లు మారారు. ఎవరింట్లోనన్నా దూరదామన్నా ఎవరితోనూ పరిచయంలేదు.

ఆమె వెనక కాస్త దూరంలో పోకిరీ కుర్రాళ్లెవ రో వస్తున్నారు. పంకజాన్ని పేరుపెట్టి మరీ పిలుస్తున్నారు. తన పేరు వాళ్లకెలా తెలుసో అర్థం కాలేదు. వాళ్లు తన కాలేజీ కుర్రాళ్లు కూడా కాదు. తను అమ్మాయిల కాలేజీలోనే చదువుతోంది. వాళ్లింటికి చుట్టుపక్కల కూడా ఆ వయసు అబ్బాయిలు ఎవరూ లేనట్టు వాళ్లమ్మ,నాన్న ఈ ఏరియాకి వచ్చిన మరునాడే అనుకుంటూండగా విని ఉంది కూడా.

బుర్ర ఎంతగా బద్దలుకొట్టుకున్నా వాళ్లకి తనపేరు ఎలా తెలుసో అంతుపట్టలేదామెకి.

మొత్తానికి ఎలాగో ఇంట్లోకొచ్చి పడింది పంకజం. వరుసగా నాలుగైదు రోజుల్నుంచి ఇదే అనుభవం ఎదురౌతోందేమో, బాగా భయ పడింది. అందుకే ఒగరుస్తూ వచ్చిన పంకజా న్ని ఆమె గాభరాను పసిగట్టింది వాళ్లమ్మ.

"ఏమిటీ అమ్మాయ్! ఏం జరిగిందీ" అని







అడిగింది. దానికి పంకజం, ''అమ్మా! ఈ మధ్య ఎవరో రౌడీ వెధవలు నా వెంట పడుతున్నారే. పేరు పెట్టి మరీ పిలుస్తున్నారే. వాళ్లకి నా పేరెలా తెలుసో ఏమో'' అంది ఏడుస్తూ.

కంగారు పడిన తల్లి సాయంకాలం పంకజం వాళ్ల నాన్న ఆఫీసునుంచి రాగానే విషయం చెప్పింది

పంకజం తండ్రి వెంకట్రామయ్యకి కోపం కట్టలు తెచ్చుకొంది. నిజానికి పంకజం చాలా అమాయకురాలు. నోట్లో వేలు పెడితే కొరకడం కూడా చేతకాని పిల్ల. అలాంటి పంకజం వెంట పడుతున్న ఆ వెధవల్ని నరికి పారేయాలనిపించింది వెంకట్రామయ్యకి. ''రేపు వాళ్లకి కనిపించకుండా నేను నీ వెనకే వస్తాను. ఆ వెధవల్ని ఓ పట్టుపట్టిచూద్దాం'' అన్నాడు ఆయన కూతురితో మీసాలు మెలేస్తూ.

ఆ మరునాడు కూడా గొడుగు పట్టుకొని వస్తున్న పంకజాన్ని చూసి ఆ అబ్బాయిలు రంగంలోకి దిగారు. నాలుగడుగులు వేసారో లేదో ఎదురుగా బుగ్గమీసాల్తో, భారీ శరీరంతో పంకజం తండ్రి ప్రత్యక్షమయ్యాడు.

ఊహించనిది ఎదురయ్యేసరికీ హడలిపోయారంతా.

''ఏంట్రా? మా అమ్మాయిని అల్లరిపెడుతున్నారట. ఒళ్లెలా వుంది'' అని అడిగాడు వెంకట్రామయ్య.

''అబ్బే అదేం లేదండీ'' అన్నాడు వాళ్లల్లో ఒకడు, వణికిపోతూ!

''పేరుపెట్టి పిలుస్తూ వెంటపెడుతున్నారట, నిజమేనా?'' అన్నాడు మళ్లీ.

''వెంటపడటం ఏమిటి? మాదీ ఇదే దారి సార్! ఏదో ఓ పేరు చెప్పుకున్నామే కానీ మాకు మీ అమ్మాయి గురించి ఎలాంటి చెడుద్దేశ్యమూ లేదండీ'' అన్నాడు మరొకడు.

''ఇంతకీ మీకు మా అమ్మాయి పేరెలా తెలుసు?'' అని అడిగాడు వెంకట్రామయ్య వాళ్లపైకి కళ్లెర్రజేస్తూ.

''మీ అమ్మాయి పేరేమిటండీ?'' వినయంగానే అడిగాడొకతను.

''ఊ! చెప్పరేం ఆ మాత్రం తెలీదూ?'' గద్దిస్తూ వాళ్ళల్లో ఒకడి కాలర్‌పట్టుకున్నాడు పంకజం తండ్రి.

''క్షమించండి సార్! మీ అమ్మాయి పేరు మాకెవరికీ తెలీదు. ఆవిడ గొడుగుపైన ''పంకజం'' అని రాసి ఉంటే గొడుగుల కంపెనీ పేరు బాగుందనుకున్నాం అంతే, సార్. అంతేనండీ'' అన్నారు వాళ్లంతా ఏకగ్రీవంగా. గొడుగు విప్పిచూశాడు వెంకట్రామయ్య. ''పంకజ్ అంబ్రెల్లాస్'' అని ఉంది.

ఇదా సంగతనుకొని వాళ్లను వదిలేసి, ఇంటిదారి పట్టాడాయన.

బుద్ధొచ్చిందన్నట్టు బుద్ధిగా తలొంచుకుని కాలేజీకి నడిచింది పంకజం.

—వీణ

---

కవరు పేజీ ఫోటోగ్రాఫరు: జగ్‌మోహన్

# చతుర ప్రపంచం

## పూజకు పనికిరాని పూలు

మనమంతా ఇష్టపడే గులాబీ స్వదేశీయేనా, విదేశీ రకమా అని ప్రశ్నించుకుంటే విదేశీ పుష్పమేనని చెప్పక తప్పదు. పూర్వకాలంలో ఈ మొక్కలను మన దేశంలో పెంచేవారు కాదు.

పంజాబు, సింధు రాష్ట్రాలను ముస్లిములు పరిపాలించేకాలంలో వారు పర్షియా దేశంనుండి గులాబీ మొక్కల్ని తెచ్చినాటారు. మణిపూర్, షిల్లాంగ్, సిక్కిం, లడఖ్, కాశ్మీర్ కుమావూం, నీలగిరి పర్వత ప్రాంతాల్లో విరివిగా మొక్కల్ని పెంచారు. మొగలుల పాలనలోని ఢిల్లీ, ఆగ్రా పరిసరప్రాంతాల్లో గులాబీ మొక్కలు విరివిగా నాటారు. రాజస్థాన్‌లోకి మాత్రం గులాబీలు అడుగు పెట్టలేకపోయాయి. రాజపుత్రులు ఇస్లాం పెత్తనాన్ని సహించనూలేదు; పఠాన్లనూ, మొగలులనూ ఏ విషయంలోనూ అనుకరించనూ లేదు.

మన ప్రాచీన శిల్పకళల్లోగానీ, పెయింటిగుల్లోగానీ, కుడ్య చిత్రాల్లోగానీ, గులాబీని ఏ కళాకారుడూ చిత్రించలేదు. అంటే అప్పటిక ఈ పుష్పం మనదేశంలో లేదనే భావించవచ్చు. పంధొమ్మిదవ శతాబ్దంలో ప్రారంభించిన కాంగ్రా పెయింటింగుల్లో కూడా కమలం, మందారం వంటి పుష్పాల్ని గోడలపైన చిత్రించారే తప్ప గులాబీ పూవుల్ని చిత్రించలేదు. కొన్ని ప్రత్యేక సందర్భాల్లో రాజపుత్రులు మొగల్ పాలకులతో వియ్యమందినా, వారి ఇళ్లలో విందులు చేసుకున్నా, గులాబీ పూలని మాత్రం దరిజేరనీయలేదు. జానపద సంగీత సాహిత్యాల్లో కూడా గులాబీ ప్రస్తావన ఎక్కడా రాలేదు. 18వ శతాబ్దపు భారతీయ సాహిత్యంలో కూడా గులాబీ స్థానం సంపాదించుకోలేకపోయింది.

గులాబీ మొక్కల్ని మొగలులకంటే ముందుగా పర్షియన్లు తెచ్చారనే వాదన ఒకటుంది. మొక్క సంగతెలావున్నా గులాబీల పన్నీరుని మాత్రం పర్షియన్లే తెచ్చారనేందుకు నిదర్శనంగా ఓ కథ ప్రచారంలో వుంది. ఒక నావలో వస్తూ గులాబీ పన్నీరుని బస్రానుండి తెస్తున్న పఠాన్ బెంగాల్ సుల్తాన్ మహమ్మద్ షా పయనిస్తున్న నావపై పోర్చుగీసువారు దాడి చేసి అతని సంపదల్ని లూటీ చేశారు. ఆ పోర్చుగీసులే తీరానికి చేరాక బెంగాల్ సుల్తానును సందర్శించి ఎన్నో విలువైన బహుమ

తులు సమర్పించుకున్నారు. ఆ కానుకల్లో వారు తాము సుల్తాను దగ్గర దోపిడీ చేసిన గులాబీ పన్నీరుని కూడా ఉంచారు. అది పరికించి గుర్తించిన సుల్తాను వెంటనే వారిని బంధించాడు.

మొగల్ పాదుషా బాబరు తన ఆత్మకథా రచనలో గులాబీల్ని వర్ణించాడు గానీ భారతదేశంలో గులాబీ తోటలున్నట్లు ఎక్కడా రాయలేదు. పర్షియాలో 15 సంవత్సరాలు గడిపిన హుమయున్ మనదేశానికి వస్తూ ప్రముఖ కళాకారుల్నీ ఎన్నో గ్రంథాల్నీ అత్తరునీ, గులాబీ అంట్లనీ, పన్నీటినీ తెచ్చాడు. మొగలువారిచే ప్రభావితులైనా మన దేశీయులు చాలామంది మొగలులు తెచ్చిన గులాబీ మొక్కల్ని మాత్రం తమ తోటల్లో పెంచలేదు.

గులాబీల పెంపకం ముందునుండే ఉందనీ, 'రోజ్ బెంగలెన్సిస్', 'రోజ్ఇండికా సెంపర్ ఫ్లోరెన్స్' అనే వృక్ష శాస్త్రీయ నామంతో పిలిచేవారనీ కొందరి వాదన. రోజ్ చినెన్సెస్ అనే మొక్క చైనానుండి యూరప్‌కి పంపబడినందున ఈ రకం గులాబీల్ని చైనా రోజ్‌లంటారు.

మన సంస్కృత గ్రంథాల్లో 'అతి మంజుల', 'తరుణీ పుష్ప', 'సేమంతిక', 'పాటలి', 'శతపత్రి', 'శేయుటి' మొదలైన పుష్పాల ప్రస్తావనలు విస్తృతంగా వున్నాయి. సువాసన, రంగు, ఆకారం, ముళ్లు మొదలైన వర్ణనల్నిబట్టి గులాబీలుగా కొందరు భ్రమపడ్డారు. కాని వెంటనే మరోవర్గంవారు అవి గులాబులు కావనీ, వారి అభిప్రాయం నిరాధారమైనదనీ నిరూపించారు.

'శతపత్ర' పుష్పాలని 'శివపూజ' పూలని కూడా అంటారు. ఇవి శివునికి అత్యంతప్రీతికరమైన పూలని చెబుతారు. పైగా ఇవి ఎన్నో వ్యాధుల్ని నివారించగల ఔషధి కూడా. కానీ గులాబీకి అలాంటి ధర్మమేదీలేదు. శివార్చనకి గులాబీలని వాడరు. దీనినిబట్టి 'శతపత్ర', గులాబీ రెండూ ఒకటే కాదని తెలుస్తోంది. అలాగే 'పాటలీ' పుష్ప ధర్మాలు కూడా గులాబీలకి విభిన్నంగా వున్నాయి. ఆరోజుల్లోనే ఇక్కడ గులాబీలుంటే కాళిదాసు తన కావ్యాల్లో వర్ణించకుండా వుండేవాడా? తన 'కుమార సంభవం'లో పార్వతి నునుసిగ్గును పద్మపత్రాలతో పోల్చాడే తప్ప ఆమె చెక్కిళ్లని గులాబీలతో పోల్చలేదు. అందుకే కాళిదాసు కాలంనాటికి గులాబీలు మనదేశంలో లేవని చెప్పవ



చ్చు.

గులాబీ మొక్కల్ని పెంచే అన్ని దేశాల సాహిత్య ప్రయోగాల్లోనూ గులాబీ పూలు సముచిత స్థానం సంపాదించుకున్నాయి. కవులకీ, రచయితలకీ ప్రేరణనిచ్చాయి. మన దేశంలో ఇతర దేశాలకంటే గులాబీలు తక్కువగానే పూస్తాయి. గులాబీలు కొన్ని దేశాల్లో సామాజిక, మతాచార వ్యవహారాల్లో కీలకమైన పాత్ర నిర్వహిస్తున్నాయి. గ్రీసులో జరుపుకునే డిస్నిసిన్స్ పండగలో గులాబీలని వాడతారు. రోమనులు తమ ఆప్తుల జ్ఞాపకార్థం వారి సమాధులపై గులాబీలని ఉంచుతారు. మన దేశంలో అన్ని పూలూ శివార్చనకి పనికొస్తాయేగాని గులాబీలు పనికిరావు.

20వ దశాబ్దపు చివరిరోజుల్లో అంటే బ్రిటిష్ పాలనలో మన దేశంలో గులాబీ మొక్కలని నాటారు. యూరప్‌నుండి గులాబీ అంట్లని తెప్పించి రెండవ ప్రపంచ యుద్ధానంతరం వీటిని తోటల్లో పెంచసాగారు. ప్రస్తుతం మన దేశంలోనూ ఇవి విరివిగానే పూస్తున్నాయి. మంచు కురిసే శీతాకాలంలో యూరప్‌లో గులాబీలు పూయవు. కాబట్టి మన దేశం నుండి యూరోపియన్లు వీటిని తెప్పించుకుంటారు. వృక్ష శాస్త్రీయపరమైన క్రోమోజోములు, జీనులతో వివిధ ప్రక్రియలు జరిపి మరింత అందమైన గులాబీల్ని విరబూయించాలని ప్రయత్నిస్తున్న దేశాల్లో మన దేశం కూడా ఒకటి.

## రైళ్ళెక్కిన తాబేళ్ళు

వ్యక్తుల అవసరాల్ని గమనించి ఆయావస్తువుల్ని పరిమితి మేరకు అందించి, లేదా అదీ అందకుండా చేస్తే ఆ వస్తువుపై మోజు మరింత హెచ్చుతుంది. చెల్లించవలసిన ధర కంటే ఎక్కువైనా చెల్లించి దాన్ని స్వంతం చేసుకోవాలనుకుంటాడు మనిషి. మనిషిలోని ఆ బలహీనతని సొమ్ముచేసుకుంటారు కొందరు స్వార్థపరులు. దొంగరవాణాల్ని చేసి హెచ్చు మొత్తాల్ని సంపాదిస్తుంటారు.

స్మగ్లింగ్ చేయడానికి ఏదీ అనర్హం కాదని నిరూపిస్తున్నాయి మన అవసరాలు. ప్రస్తుతం తాబేళ్ళ స్మగ్లింగ్ మహాజోరుగా సాగుతోంది. రాజస్థాన్‌లోని భరత్‌పూర్‌లో, ఉత్తరప్రదేశ్‌లోని మధురలో తాబేళ్ళ దొంగరవాణా విచ్చలవిడిగా జరుగుతూ ఉంది. పశ్చిమబెంగాల్ మార్కెట్లకు చేరుకుని అవి అక్కడ విపరీతంగా అమ్ముడవుతున్నాయి. బంగ్లాదేశ్‌కి కూడా రవా



ణా అవుతున్నాయి. బంగ్లాదేశ్‌లో ఒక కిలో తాబేలు మాంసం వంద రూపాయలధర పలుకుతుంది. తాబేళ్ళ డిప్పలు కూడా మంచి వెలనే సంపాదించిపెడతాయి.

తాబేళ్ళ స్మగ్లర్లు తాబేళ్ళను స్థానిక చేపల వ్యాపారస్థుల వద్ద చవగ్గా కొంటారు. వాటిని రైల్వే పార్సెల్స్‌గా బుట్టల్లో అందంగా ప్యాక్‌చేసి భరత్‌పూర్, మధురల నుండి బెంగాల్‌కీ, బంగ్లాదేశ్‌కీ పంపిస్తుంటారు.

చేపల అమ్మకాలపై నిషేధాలు లేకున్నా తాబేళ్ళ వ్యాపారంపై నిషేధపుటుత్తరువులున్నాయి. కాబట్టే హౌరాస్టేషన్‌లో ఈ తాబేళ్ళ బుట్టల్ని చేపల బుట్టలుగా నమోదుచేస్తారు. రైల్వే ఉద్యోగులకీ, స్మగ్లర్లకీగల సత్సంబంధాల ఫలితంగా అవి గమ్యానికి సురక్షితంగా చేరుతాయి.

ఈ ఎగుమతికై తాబేళ్ళను ప్యాక్‌చేసేటప్పుడు వాటి మూతుల్ని కుట్టేస్తారు. కదలకుండా వాటిని బుట్ట అడుగుభాగంలో వుంచుతారు. తిండీ, నీళ్ళు లేకుండా నాలుగైదు రోజుల్లుంటే వీటిలో కొన్ని రైలు ప్రయాణంలో దార్లోనే చనిపోతాయి. అయితే చనిపోయిన తాబేలు అమ్ముడవదు. బతికివున్న తాబేలు మాంసంమాత్రమే చాలా రుచికరంగా వుంటుంది. అందుకే తాబేళ్ళు చనిపోకుండా వీలయినంతవరకూ జాగ్రత్తపడతారు. ఒక్కొక్క తాబేలు బరువు సుమారు 40 కిలోగ్రాములదాకా ఉంటుంది.

కొన్ని మాసాల క్రితం మధురస్టేషన్ నుంచీ హౌరాకి పంపించాలని బుట్టల్లో తాబేళ్ళని ప్యాక్‌చేశారు. అయితే బుట్టల పైని మూతల్ని గట్టిగా పెట్టనందున మధుర రైల్వే ప్లాట్ ఫాం మీదవుండగా బుట్టలోని ఓ తాబేలు చక్రవర్తి బయటి ప్రపంచాన్ని చూద్దామని కళ్ళు నులుముకుంది. బుట్టకున్న సందులోంచి తలని బయటికిపెట్టి ప్లాట్‌ఫాం మీది జనసందోహాన్ని విచిత్రంగా చూడ్డం ప్రారంభించింది. ఓ దుకాణాదారు ఈ దృశ్యాన్ని చూసి వెంటనే పదిమందినీ పోగేసి ఆ బుట్టలన్నీ తెరిపించాడు. కొద్ది నిముషాల్లో ప్లాట్‌ఫాంపై ఎన్నో తాబేళ్ళు గునగునమంటూ పాకటం ప్రారంభించాయి. పోలీసులు రంగంలోకి దిగి వాటిని అదుపులోకి తీసుకున్నారు. కోర్టువారు వాటిని యమునా నదిలో విడిచిపెట్టాలని తీర్పిచ్చారు.



## తాడి తన్ను వాడుంటే

నేరస్తుల్ని పట్టివ్వటంలో కుక్కలు పోలీసులకి సాయపడటం మనకి తెలుసు. అందుకు వాటి ఘ్రాణశక్తి అధికమూ, సూక్ష్మమూ అవటమే కారణం. అయితే కుక్కలకు మించిన ఘ్రాణ శక్తి ముంగిసలకుందని తేలింది. అందుకనే శ్రీలంకలోని కొలంబో విమానాశ్రయంలో ముంగిసలని ప్రవేశపెట్టబోతున్నారు అధికారులు. అంతర్జాతీయ విమానాశ్రయాల్లో అక్రమంగా రవాణా అవుతున్న మాదకద్రవ్యాల్ని క్షణంలో పసిగట్టి పట్టివ్వగలవీ ముంగిసలు. ముందుగా వీటిని మచ్చికచేసుకుని తగుశిక్షణ ఇస్తున్నారు. ఇందుకు కావలసిన నిధులని అమెరికన్ స్టేట్ డిపార్ట్‌మెంటువారు సమకూరుస్తున్నారు. కొలంబోలో ఈ ముంగిసల వలన మంచి ప్రయోజనాలు కనిపిస్తే ప్రపంచంలోని అన్ని విమానాశ్రయాల్లోనూ వీటిని ప్రవేశపెట్టే ఆలోచన కూడా ఉందట. ★

చతుర
సంపుటి: 11 సంచిక:3 ఏప్రిల్: 1988

# ఈ నెల సమగ్ర నవల

సమాజం ఆరోగ్యంగా, ఆనందంగా ఉండటానికి రచయితకూడా దోహదపడతాడు. వ్యక్తి వికాసాన్ని పెంపొందించే ఉన్నత విలువలుగల రచనలుచేసి తద్వారా పాఠకుల్ని మంచిమార్గంవైపు నడిపించటం రచయితల కనీస బాధ్యత.

అయితే నేటి రచయితలంతా ఈ బాధ్యతను గుర్తించి నెరవేరుస్తున్నారా అంటే లేదని నిష్కర్షగా చెప్పవచ్చు. తీరని కాంక్షలకు అక్షరరూపం కల్పించి, దానిని తమ రచనాసామర్థ్యంతో ఆకర్షణీయంగా తీర్చిదిద్ది పాఠకుల్లోకి బాధ్యతారహితంగా వదులుతున్నారు. అవెంతగా పాఠకులపై దుష్ప్రభావం చూపుతాయో వారికి అర్థంకాదు. పాఠకుల మంచిచెడ్డలతో వారికి నిమిత్తంలేదు. తమ రచనలు అచ్చుకావాలి- తమపేరు మార్మోగాలి- తమకు డబ్బురావాలి... అంతే! అదే ఆశయంగా కొనసాగుతోంది ఈనాటి సాహిత్యకృషిలో అధికశాతం. అలాంటి కోవకి చెందిన ఓ రచయిత కథే ఈ 'సంహారం'.

పుంఖానుపుంఖాలుగా కథలురాసి పత్రికలకు పంపిస్తుంటాడతను. అవి చదివిన పాఠకుల సంగతలావుంచి సంపాదకులకే ఎందరికో విరేచనాలయ్యాయి, వాంతులువచ్చాయి, వికారాలు కలిగాయి. గుండె ఆగి మరణించినవారు కొందరైతే ఆత్మహత్యల్ని చేసుకున్నవారు ఇంకొందరు. ఉద్యోగాలకు తిలోదకాలిచ్చి పారిపోయిన తపాలా ఉద్యోగులూ, ఆఫీసులు మూసేసుకుని పత్రికల్ని ఎత్తేసిన పబ్లిషర్లూ ఉన్నారు.

కడుపుబ్బ నవ్విస్తూనే ఆలోచింపచేసే సారె రామమోహనరావు సందేశాత్మక హాస్యనవల 'సంహారం' ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.



చేతివేళ్ళు బిగించి

నుదురు మీద అర్ధనామాలు పెట్టినట్టుగా చర్మం చిట్లించి...

మరీ రాస్తున్నాడు, రాంబాబు.

రాస్తూ రాస్తూ మధ్యలో ఆగిపోయాడు.

"ఇక్కడ ఏమాట వాడాలి, ఏ మాట వాడితే తనలోని భావప్రకటనకి పూర్తి న్యాయం చేకూరుతుంది?" అని ఆలోచించాడు.

రెండుసార్లు ముక్కుపుటాలెగరేశాడు. మూడుసార్లు కళ్ళు చిట్లించాడు.

నోటిని పొడవుగా సాగదీసి ఆ చివర, ఈ చివర పెదిమలు రుద్దుకున్నాడు.

అతడి కుడిచేతిలో కలం వుంది.

అతడు పెదిమలు రుద్దుకునే ప్రయత్నంలో కలం కాస్తా చెక్కిళ్ళని వరామర్శించింది.

రాంబాబు తీవ్రమైన ఆలోచనలో లేకపోయి వుంటే అతని చెక్కిలి మీద సిరా చేస్తున్న చల్లటి గుర్తు స్పృహలోకి వచ్చివుండేదే!

కాని, అతడు స్పృహలో లేడు.

ప్రస్తుతం రాంబాబు అంత దీర్ఘంగా ఆలోచిస్తూ కథ రాయడానికి చాలా పెద్ద కారణమే వుంది.

అదేమిటంటే-

ఆరోజు ఉదయం రాంబాబు మార్కెట్‌కి వెళ్ళాడు.

మార్కెట్టుకి ఎదురుగా రోడ్డు మీద ఓ ఆవు, ఎద్దు సృష్టికార్యం జరుపుకుంటున్నాయి.

ఆ దృశ్యం రాంబాబు కంటబడింది.

అంతే... అతడి మూడ్ మారిపోయింది. హృదయం బాధగా మూల్గింది.

మానవాళి మీదే కోపం పొంగుకొచ్చింది.

ఏమిటీ మనుషులు? అసలు ఈ సమాజంలో మనిషికి బుద్ధిలేదు. తను ఖరీదైన బట్టలేసుకుంటాడు! ఈ నోరులేని జీవాలనేమో దిగంబరంగా రోడ్డు మీద వదిలేస్తాడు. వాటిని తన ఇష్టం వచ్చినట్టుగా వుపయోగించుకుంటాడే మరి వాటివల్ల వుపయోగం వుండి కూడా ఈ మనిషి ఎద్దులకు, ఆవులకు బట్టలెందుకు కుట్టించడు!? వాటికి ఏదో వచ్చుగడ్డో, ఎండుగడ్డో పడేస్తాడే తప్ప చికెన్ బిర్యానీ ఎందుకు తినిపించడు?! పైగా అవి జోడుకట్టుకోవడానికి పబ్లిక్ రోడ్లు, మైదానాలు తప్ప. బెడ్‌రూమ్‌ల వసతి ఎందుకు కల్పించడు!? అసలీ మనిషికి బుద్ధిలేదు... లేదుగాక లేదు!!

ఆలోచనలతోను, ఆవేశంతోను అతని మెదడు వేడెక్కింది.

"హే భగవాన్! ఏమిటీ సృష్టి! సమాజంలో ఇన్ని తేడాలెందుకు ఏర్పాటు చేశావు?" మనసులోనే కనిపించని దేవుడిని ప్రశ్నించుకున్నాడు.

ఆ వెంటనే రాంబాబుకి ఆ రెండు మూగజీవాల యజమానుల మీద పట్టరాని ఆగ్రహం కలిగింది.

మదిలో ఓ థీమ్ మెదిలింది. సదరు ఆవు మీద, ఎద్దుమీద ఓ కథ రాయాలని సంకల్పించుకున్నాడు.

రాంబాబు చూసిన ఆ సంఘటన ఫలితమే ఇప్పుడు అతడిచేత కథ రాయిస్తోంది.

టూకీగా రాంబాబు రాస్తున్న ఆ కథ సారాంశమేమిటంటే-

ఓ ఎద్దు, ఆవు చాలాకాలంనుండి ప్రేమించుకుంటాయి. పెళ్ళి చేసుకోవాలనుకుంటాయి. తమ ప్రేమ విషయం వాటి యజమానులకు తెలుపుతాయి. యజమానులు సంతోషించి, ఆ రెండింటినీ పక్కపక్కన నిలిపి పెళ్ళిచేయిస్తారు. పసుపు, బొట్లు పెట్టి పూజలు చేస్తారు. ఆ తరువాత వాటిని జోడుకట్టుకోమని ఓ పబ్లిక్ మైదానంలో వదిలిపెడతారు. కాని ఎద్దు, ఆవు శోభనం గది కావాలని పేచీ పెడతాయి. యజమానులు అందుకు అంగీకరించరు. వెంటనే ఆ ఆవు, ఎద్దు తమ తమ సహవాసగాళ్ళతో కలిసి పెద్దస్ట్రయిక్‌చేస్తాయి. ఆవులు పాలివ్వవు. ఎద్దులు బళ్ళు లాగవు. దాంతో యజమానులు కాళ్ళబేరానికి వచ్చి ఎద్దులకు, ఆవులకు చక్కటి పెద్దపెద్ద మంచాలతో పడగ్గదులు ఏర్పాటుచేయిస్తారు. ఆవులు, ఎద్దులు సంతోషించి పెద్ద యెత్తున పండగచేసుకుంటాయి.

...ఇదీ టూకీగా ఆ కథ థీమ్!




వుంది. చక్కగా వివరించి చెప్పనూగలడు! "మనిషీ రెండుకాళ్ళ జంతువే! మరి సృష్టికా ర్యానికి అతడు పడగ్గదులు వుపయోగించుకో వడంలేదా?" అని ఎదురు ప్రశ్నవేసి నోరు మూయించగలడు.

రాంబాబు ఆ కథముగించి, దానికి 'ఆవు, ఎద్దుల తిరుగుబాటు'' అని టైటిల్ పెట్టి ఓ ప్రముఖ పత్రికకే పంపాడు.

అది మూడో రోజుకే తిరిగొచ్చేసింది.

అతడు నిరుత్సాహపడలేదు.

మరో రచన చేశాడు.

ఇంకో రచన...

ఇంకో రచన...

-అలా వందలాది రచనలకి పాకిపోయింద తడి రచనా సామర్థ్యం.

కానీ

వేనుకునే నాథుడులేక అవి వెనక్కి తిరిగొ చ్చేస్తున్నాయి.

* * *

అసలు రాంబాబు ఈ భూమ్మీద ఎప్పుడు ఎక్కడ ఎలా పుట్టాడో ఎవరికీ తెలీదు. గుట్టుచ ప్పుడు కాకుండా గవర్నమెంటు వుద్యోగం ఎలా సంపాదించుకున్నాడో అంతకన్నా తెలీ దు.

పాతికేళ్ళుంటాయి. ఒంటరివాడు.

కోడిజుత్తు క్రాఫింగుతో, సన్నగా రివటలా వుంటాడు రాంబాబు. తీక్షణమైన కళ్ళు, సూది ముక్కు రాంబాబు గట్టి పట్టుదలకు నిదర్శనా ల్లా సాక్ష్యమిస్తూంటాయి.

ఉన్నట్టుండి హఠాత్తుగా ఓరోజు రచయిత కావాలనే ఆలోచన కలిగింది.

అంతే! వెంటనే తన ఆలోచనని కార్యరూ పంలో పెట్టాడు.

"ఆవేశంకావాలి, ఆవేదన రావాలి'' అని ఎవరో అంటే- వాటికోసం వుక్కిరిబిక్కిరయి- ఆ రెండింటినీ సంపాదించాడు. ఆ వెంటనే రాయడం ప్రారంభించాడు.

"కుక్కపిల్ల, అగ్గిపుల్ల, సబ్బుబిళ్ళ కాదేదీ కవితకనర్హం'' అన్నాడు ఓ మహాకవి. ఆ కవితని రాంబాబు చదవడం తటస్థించింది. వెంటనే అప్పటికప్పుడు తనలో తను ఓ కవిత

...సీసామూత కాదేదీ కథకనర్హం' అని.

ఆ వాక్యాలనే అతడు ఆచరణలో పెట్టి కథలు రాయడం ప్రారంభించాడు.

మనుషులందరిలోనూ తానొక విలక్షణ జీవి నని రాంబాబు గాఢనమ్మకం.

'రచయిత అంటే ఎవర'ని అడిగితే 'అత డు డిటెక్టివ్‌లాంటివాడ'ని సమాధానం చెబుతా డు రాంబాబు.

రాంబాబు తన కాల్పనిక శక్తితో సమాజాన్ని సి.బి.ఐ. ఏజంటులా ఒళ్ళంతా కళ్ళుచేసుకుని పరిశీలించసాగాడు.

ఓ రోజు-

వీధికొళాయి పక్కన బురద గుంటలో పంది ఒకటి జలకాలాడుతోంది.

అదే సమయంలో ఆ పక్కనేవున్న ఓ చెట్టు మీదనుంచి కాకి ఒకటి దిగివచ్చి పందిమీద వాలింది.

ఆ దృశ్యం రాంబాబు కంటబడింది.

అంతే!

కాకికి పందిమీద మనసయిందని అతడి లోని రచయిత గుర్తించేశాడు.

వెంటనే ఆ రెండింటి మీద ఓ కథ రాశాడు.

కాకి, పంది ప్రేమించుకున్నాయి. అవి రెండూ పెళ్ళిచేసుకుని కాపురం పెట్టాయి. అప్పుడు పందికి కాకిపిల్ల పుట్టింది- కాకికి పందిపిల్ల పుట్టింది. ఇదీ ఆ కథ థీమ్! దానికి 'పక్షి-ప్రేమ' అని టైటిల్ పెట్టాడు. కాకి, పంది మనసులు మార్చుకున్నట్టే, వాటి శరీరంలోని జెనెటిక్స్ కూడా ప్రేమగా మారిపోయి- కాకికి పంది, పందికి కాకి పుట్టాయని గొప్ప ప్రేమ సందేశం ఇచ్చాడు రాంబాబు.

మరోరోజు-

రాంబాబుకి ఓ ఇంటి పెరటిలో ఓ ములగ చెట్టు, జామచెట్టు పక్కపక్కనే దర్శనమి చ్చాయి.

జామచెట్టు ఆకులు ఎండకి అక్కడక్కడ ఎండిపోయి వున్నాయి. అయితే ములగచెట్టు ఆకులు మాత్రం చాలా పచ్చగా కళకళలాడు



ఉన్నాయి.

ఆ రెండు చెట్ల దృశ్యాలు రాంబాబుకి వేరువేరు అర్థాలని స్ఫురింపజేశాయి.

అంతే...

అతడు వాటిని విషాదంగా చూసి, ఆ చెట్ల మీద ఓ దీనమైన ప్రేమగాథ రాశాడు.

ములగచెట్టు, జామచెట్టు ప్రేమించుకుంటాయి. అవి రెండూ ఓరోజు షికారుగా బీచ్‌కి వెళతాయి. ఆ బీచ్‌లో ములగచెట్టు జామ చెట్టుని పెళ్ళిచేసుకుంటానని చెప్పి దాని శీలాన్ని దోచుకుంటుంది. ఆ తరువాత జామ చెట్టుకి కడుపు వస్తుంది. ఇది తెలిసి జామచెట్టు ములగచెట్టుని పెళ్ళిచేసుకోమని అడుగుతుంది. కాని ములగచెట్టు జామచెట్ల శీలాల్ని దోచుకోవడం తన హాబీ అని చెప్పి-జామ చెట్టుని పెళ్ళిచేసుకోవడానికి నిరాకరిస్తుంది. అప్పుడు జామచెట్టు కన్నీరుమున్నీరుగా విలపిస్తుంది. 'హే భగవాన్...! ఈ లోకంలో నాలాంటి ఏ జామ చెట్టుకూ ములగ చెట్టువల్ల మోసపోయే అవకాశం కల్పించకు తండ్రీ!' అని దేవుడిని ప్రార్థిస్తూ సముద్రంలో దూకి ఆత్మహత్యా చేసుకుంటుంది.

జామచెట్టు ఆకులు ఎండిపోయి వుండి, ములగచెట్టు ఆకులు పచ్చగా ఉండటం వల్లనే-జామచెట్టు మీద ఆ జాలి కథ రాశాడు రాంబాబు. ఆ కథకి "ఓ జాలి కథ" అని పేరు పెట్టాడు.

ఇంకోరోజు-

నాలుగురోడ్ల మధ్య ఓ సైకిలు, స్కూటరు, కారు పోలీస్ సిగ్నల్ చూపడంతో నెమ్మదిగా కదులుతూ వచ్చి ఓ పక్కగా ఆగాయి.

ఆ దృశ్యం రాంబాబు కంట పడనే పడింది వెంటనే ఆ మూడు వాహనాలమీద విషాద కావ్యంలా మరో దీనమైన ప్రేమగాథ రాశాడు.

అదేమిటంటే-

స్కూటరు సైకిలుని ప్రేమించానంటుంది సైకిలు అది నమ్మి తను కూడా స్కూటరుని ప్రేమిస్తుంది. కాని స్కూటరు సైకిలుతో కొంత కాలం తిరిగి, దానికి కడుపు చేశాక, కారుని ప్రేమించి పెళ్ళి చేసుకుంటుంది. దాంతో సైకిలుకి మనసు విరిగిపోతుంది. తన కడుపులో మరో చిన్న సైకిలు పెరుగుతోందని కూడా ఆలోచించకుండా రైలు కిందపడి ఆత్మహత్యా చేసుకుంటుంది.

ఆ కథకి "వాహన విషాదగీతిక" అని పేరుపెట్టాడు రాంబాబు.

రాంబాబు కథలలో జంతువులు, పక్షులు, చెట్లు, వాహనాలే కాకుండా కాయగూరలు కూడా చోటుచేసుకుంటుంటాయి.

ఉల్లిపాయ, బంగాళాదుంప దెబ్బలాడుకుంటున్నాయి. ఆ గలాటాలో బంగాళాదుంపకు బాగా దెబ్బలు తగిలి బోలెడు రక్తం కారిపోతుంటుంది. వెంటనే పక్కనే ఉన్న వంకాయ బంగాళాదుంపని ఆటోలో తీసుకెళ్ళి హాస్పిటల్లో చేరుస్తుంది. అప్పుడు డాక్టర్ బంగాళాదుంపకి రక్తం చాలా పోయిందని, రక్తం ఎక్కించాలని చెబుతాడు. అప్పుడు వంకాయ తన రక్తం సరిపోతుందేమోనని పరీక్షించమంటుంది. డాక్టర్ వంకాయ బ్లడ్ గ్రూప్ పరీక్ష చేస్తాడు. దాని బ్లడ్ గ్రూపు బంగాళాదుంప బ్లడ్‌గ్రూప్‌కి సరిపోతుంది. అప్పుడు డాక్టరు వంకాయ రక్తం బంగాళాదుంపకి ఎక్కించి దాని ప్రాణం కాపాడతాడు.

ఆ కథపేరు "వంకాయ త్యాగం"

తానొక విలక్షణ జీవి అనుకునే రాంబాబు కథలు కూడా విలక్షణంగానే ఉంటాయి.

తిరిగి వచ్చేస్తున్న తన కథలని చూసి సంపాదకులింకా తన స్థాయికి ఎదగలేదని జాలిపడేవాడు.

అలా పదులా...వందలా...

వేలూ...

రాంబాబు రచనలు పెరిగిపోతూనే ఉన్నాయి.

అతడలా రాసుకుంటూపోతూనే ఉన్నాడు.

రాంబాబు అలా కథలు రాసుకుంటూపోతూండగా ఇక్కడ సంపాదకలోకంలో కలవరం ప్రారంభమయింది. పత్రికాప్రపంచంలో భూకంపం సంభవించింది.

రాంబాబు రచనలు సంపాదకులకు తలనొప్పి పెట్టించసాగాయి.

మొదట్లో వాళ్ళు అతడి రచనలు చదివి

నవ్వుకునేవారు. అతడి విపరీతధోరణికి జాలిపడేవారు.

కానీ

రానురాను రాంబాబు రచనలు సంపాదకులలో రకరకాల జబ్బులు కలిగించసాగాయి.

కొందరు సంపాదకులకి వాంతులయ్యేవి.

ఇంకొందరికి చలిజ్వరం పట్టుకునేది.

మరికొందరి సంపాదకులకి విరేచనాలయ్యేవి.

అలాంటి సమయాలలో వాళ్ళు తమ టేబుళ్లపక్కనే మంచాలు ఏర్పాటు చేసుకుని, రగ్గులు కప్పుకుని పడుకునేవారు.

తమకు వచ్చిన కష్టానికి కన్నీరుమున్నీరుగా విలపించేవారు.

కావాలంటే రాంబాబు రచనలు చదవకుండానే వెనక్కుతిప్పి పంపేయవచ్చు!

కానీ,

రాంబాబు రచనలలో ఓ ప్రత్యేకత ఉంది.

అదే చదివించే తీరు.

అతడి ప్రతిరచన చూడగానే చదవాలనిపిస్తుంది. చదివింపజేస్తుంది. అయితే చదివి జీర్ణం చేసుకునే శక్తినిమాత్రం ఇవ్వదు.

అతడి రచన చూడగానే చదవకూడదని అనుకుంటూనే ఆతృతగా చదివేస్తారు సంపాదకులు.

ఆ కథలకు రాంబాబు పెట్టే రకరకాల ఆకర్షణీయమైన హెడ్డింగులు కూడా అందుకు కారణం.

"టీవీ నవ్వింది"

"వీడియో ఏడ్చింది"

"రేడియో పాడింది"

"ధరణి చచ్చింది"

ఇలా ఉంటాయి అతడి కథల టైటిల్స్. అలాంటప్పుడు ఏ సంపాదకుడికి మాత్రం రాంబాబు కథలు చదవాలని క్యూరియాసిటీ కలగదో మీరే చెప్పండి!

మొదట్లో ఒకట్లు...పదులు...వందలుగా ప్రారంభమయిన రాంబాబు రచనలు వేలకు పెరిగిపోయాయి.




సంపాదకలోకం ఠారెత్తిపోయింది.

రాంబాబు రచనలు చదవడంవల్ల మొదట్లో చిన్నచిన్న జబ్బులకు గురైన సంపాదకులకు ఆ తరువాత పెద్దపెద్ద గండాలే ఎదురయ్యాయి.

ఓరోజు పత్రికాప్రపంచంలోనే ఎన్నడూ జరగని ఘోరం ఒకటి జరిగిపోయింది.

ఆ దారుణమైన ఘోరం గురించి ఓ పత్రికాఫీసు నుంచి మరో పత్రికాఫీసుకు- అక్కడి నుంచి అన్ని పత్రికాఫీసులకు కబురు అందిపోయింది.

"సబ్‌ఎడిటర్ వెంకట్రావు ఎక్స్పయిర్డ్ బై రీడింగ్ రైటర్ రాంబాబు స్టోరీ!" అని ఆ వార్త సారాంశం.

అంతే!

ఆ వార్తతో యావత్ పత్రికాప్రపంచంలో ప్రళయం సంభవించింది.

పత్రికాసంపాదకులు వెంకట్రావుని తలుచుకుని దారుణంగా విలపించారు.

రాంబాబు కథలు తలుచుకుని భయపడిపోసాగారు.

"విశాలి" వారపత్రిక కార్యాలయంలో

తన ఆఫీసుగదిలో కూర్చునివున్నారు చీఫ్ ఎడిటర్ ధర్మారావుగారు.

ధర్మారావుగారి నోట్లో సిగార్ నిర్విరామంగా పొగలు కక్కుతోంది.

భ్రుకుటి ముడిపడి ఉంది.

దీర్ఘంగా ఆలోచిస్తున్నారాయన.

బుర్రమీసాలతో, గాబర్డిన్ ఫుల్‌సూటులో హుందాగా ఉంటారాయన.

ఆరోజు ఉదయం తన ఆఫీసులో జరిగిన దారుణమైన సంఘటన ఆయన హృదయాన్ని కదిలించివేస్తోంది. దుఃఖం పొంగుకొస్తోంది.

తమ పత్రికలో పనిచేస్తున్న సబ్‌ఎడిటర్ వెంకట్రావు ఓ గంటక్రితం గుండెపోటుతో మరణించాడు.

"వెంకట్రావుగారూ... మీకెలాంటి దుర్గతిపట్టింది? మీకీదుస్థితి పట్టడానికి నేనే కారణం... నన్ను మన్నించండి. ఆవేదనగా తనలోతనే గొణుక్కున్నారు ధర్మారావుగారు.

ఆరోజు ఉదయమే వెంకట్రావు ధర్మారావుగారి ఆఫీసు గదిలోకి వచ్చాడు.

వెంకట్రావు వయసు అరవై. చాలాకాలం నుంచి 'విశాలి' వారపత్రిక కార్యాలయంలో సబ్‌ఎడిటర్‌గా పనిచేస్తున్నారు.

తన గదిలోకి అడుగుపెట్టిన వెంకట్రావుని చూసి-

"ఏం కావాలండీ?" అని అడిగారు ధర్మారావుగారు.

"ఆ రాంబాబుగాడి చెత్త కథలు చదువుతూంటే నాకు గుండెలో విపరీతమైన ప్రకంపనాలు కలుగుతున్నాయి. గాభరాపుడుతోంది. నా గుండె ఆగిపోతుందేమోనని భయంగా ఉంది" అంటూ తన అనుమానాన్ని వెలిబుచ్చారు వెంకట్రావు.

ఆయన మాటలకు ధర్మారావు చిన్నగా నవ్వారు.

"అది కేవలం మీ భ్రమ! అంతే... వాడికథలు చదివితే మీకేమీ కాదు. ఈ విషయంలో నేను మీకు హామీ ఇస్తున్నాను. వెళ్లండి... వెళ్ళి వాడి కథలన్నీ చదివేయండి" అంటూ తేలిగ్గా కొట్టివడేశారాయన.

ఆ మాటలకు వెంకట్రావు కళ్లలో నీళ్ళు గిర్రునతిరిగాయి.

"మీరు దయచేసి నా పరిస్థితి అర్థంచేసుకోండి సార్! రెండ్రోజుల క్రితం డాక్టరుని కలిశాను. కొంతకాలం రాంబాబు కథలకి దూరంగా వుండమని డాక్టరు సలహా ఇచ్చాడు. లేకపోతే నాకు గుండెపోటు వచ్చే ప్రమాదం వుందని హెచ్చరించాడు. ఆ పైన మీ ఇష్టం" అంటూ వినయంగా చేతులు నలుముకున్నాడు వెంకట్రావు.

"డాక్టర్లదేముందండీ!? ఏ అనారోగ్యమూ లేకపోయినా ఏదో వుందని భ్రమకలిగించి హడలగొడతారు. అంతే! మీకేమీ కాదని నేను హామీ ఇస్తున్నాను కదా! మీ ప్రాణాలకి నాప్రాణం అడ్డు! సరేనా-వెళ్లండి... వెళ్ళి ఆ కథలు తొందరగా చూసేయండి" అన్నారు ధర్మారావుగారు.

"ఏమండీ....." అంటూ వెంకట్రావు ఇంకేదో చెప్పబోయాడు.

కాని,

ధర్మారావుగారు ఆయన మాట వినలేదు.

"నా టైమ్ వేస్ట్ చెయ్యకండి!" అన్నారు కొంచెం అసహనంగా.

ఇక వెంకట్రావు ఏమి అనలేకపోయాడు.

మౌనంగా, దీనంగా గదినుండి నిష్క్రమించాడు.

ధర్మారావుగారు ఏదో వ్యాసం చదవడంలో లీనమైపోయారు.

ఆ తరువాత పదినిముషాలకే –

ఆయనకీ దుర్వార్త అందింది......

వెంకట్రావు రాంబాబు కథ చదువుతూనే గుండెచేత్తో పట్టుకుని శ్వాసవదిలేశారని.

అంతే!

ధర్మారావుగారికి పైప్రాణాలు పైనే పోయినట్టనిపించింది.

ఆఫీసు వేనులో వెంకట్రావు భౌతికకాయాన్ని అప్పటికప్పుడు ఇంటికి తరలించారు.

వెంకట్రావుతో జరిగిన తన సంభాషణ అంతా గుర్తుకొచ్చి కళ్ళు తుడుచుకున్నారు. తను వెంకట్రావుకి సెలవిచ్చి ఇంటికి పంపేసినా ఈ ఘోరం జరిగి వుండకపోనుఅనుకున్నారు.

వెంటనే కర్తవ్యం గుర్తువచ్చినవాడిలా రివాల్వింగ్ ఛెయిర్‌లోంచి లేచి నిలబడ్డారు..

కార్యాలయంలోంచి బయటికి అడుగుపెట్టారు.

మరో ఐదు నిముషాల్లో ఆయన ఎక్కిన కారు వెంకట్రావు ఇంటివైపు దూసుకుపోయింది.

ధర్మారావుగారు వెంకట్రావు గుమ్మంలోకి అడుగుపెట్టేసరికి –
వరండాలో వున్న వెంకట్రావు భౌతికకాయంపై పడి ఆయన భార్య, పిల్లలు హృదయవిదారకంగా విలపిస్తున్నారు.

వెంకట్రావు భార్య పేరు కామాక్షమ్మ.

"అయ్యో... మాకెన్ని కష్టాలు వచ్చిపడ్డాయండీ! ఆ రచయిత రాంబాబుగాడి జిమ్మడ! వాడి కథలు చదివి మీరు మమ్మల్ని నట్టేట్లో ముంచివెళ్లిపోయారా? ఆ రాంబాబుగాడు కూడా వచ్చే జన్మలో మీలాగే ఎడిటరై పుట్టి – వాడూ ఓ చెత్తకథ చదివి చావాలి- ఇదే నాశాపం! వాడికి తప్పక తగలాలి!" అంటూ భర్త శవం మీదపడి విలపిస్తున్నారామె.



వెంకట్రావుకి ముగ్గురు ఆడపిల్లలు, ఇద్దరు కొడుకులు.

"ఆ రాంబాబుగాడు... ఆ రచయిత రాంబాబుగాడు కనిపిస్తే వాడిని చంపేస్తాం. ఉప్పుపాతర వేస్తాం?" అంటూ ఆవేశంగా ఆరుస్తున్నారాయన పిల్లలు.



ధర్మారావుగారిని ఆ హృదయ విదారక దృశ్యం కదిలించివేసింది. గుండెల్ని పిండేసింది.

"బాధపడకండమ్మా!" అంటూ కామాక్షమ్మ గారిని ఓదార్చాలని ప్రయత్నించారు. కాని ఆమెని ఓదార్చడం ఆయనకి సాధ్యంకాలేదు.

"ఆ రాంబాబుగాడి చెత్తకథ చదివి ఆయన చచ్చిపోయారు. ఇప్పుడు మా కుటుంబానికి దిక్కేది?" అంటూ మరింత ఘోరంగా విలపించసాగారామె.

"అమ్మా... మీరేమీ బెంగపెట్టుకోకండి! వెంకట్రావుగారు మిమ్మల్ని దిక్కులేని వాళ్లని చేసినా, మా పత్రిక మాత్రం మిమ్మల్ని దిక్కులేనివాళ్లని చెయ్యదు. వారి ఉద్యోగం మీ పిల్లల్లో ఒకరికి ఇస్తాను. మీరు నిశ్చింతగా వుండండి"



అన్నారు ధర్మారావుగారు.

అంతే!

ఆ మాటలకు కామాక్షమ్మగారు ధర్మారావు గారిని కోపంగా చూశారు.

"మీరలా అనడంలో మీ వుద్దేశం ఏమిటి! మావారిలాగే మా పిల్లలు కూడా ఆ రాంబాబు గాడి కథలు చదివి గుండె ఆగిచచ్చిపోవాలనా!? బతికుంటే బలుసాకు తినవచ్చు! మీకు, మీరివ్వబోయే వుద్యోగానికి నాతరపున, నాపిల్లల తరపున ఓ నమస్కారం! దయచేసి ఈ ప్రసక్తి నాముందు మరోసారి తీసుకురాకండి" అంటూ రెండు చేతులూ ఎత్తి ఆయనకి నమస్కారం చేసిందామె.

తల్లికి కోరస్‌గా ఐదుగురు పిల్లలూ కూడా చేతులెత్తి భయం భయంగా ధర్మారావుగారికి నమస్కారాలు చేశారు.

ధర్మారావుగారు ఇంకేమీ అనలేక తప్పుచేసినవాడిలా తలదించుకున్నారు.

ఆ తరువాత –

వెంకట్రావుగారి కుటుంబానికి, ఆయన దహన సంస్కారాల నిమిత్తం పదివేల రూపాయల చెక్కు అందజేసి బరువుగా బాధగా వెనుదిరిగారు.

కార్యాలయానికి తిరిగివచ్చి –

రాంబాబు కథల బారినుండి ఇకపై సంపాదకులనెలా కాపాడటమా అని దీర్ఘంగా ఆలోచించసాగారు.

★ ★ ★

అదేరోజు —

'సౌజన్య' మాసపత్రికలో మరో దుర్ఘటన జరిగింది.

ఆ పత్రికలో పనిచేస్తున్న సబ్-ఎడిటర్ సుబ్బారావు రాంబాబు కథలు చదివి చదివి, తట్టుకోలేక – రైలు కింద తలపెట్టి ఆత్మహత్య చేసుకున్నాడు.

ఈ వార్త కూడా అన్ని పత్రికాఫీసులకు అందజేయబడింది.

పార్వతీశంగారు తన పత్రికా కార్యాలయంలో కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తున్నారు.

ఆయన 'సౌజన్య' చీఫ్ ఎడిటర్! లాల్చీ, పంచెలో మల్లెపువ్వులా వుంటారాయన.

గంటక్రితమే పార్వతీశంగారు సుబ్బారావు ఇంటికెళ్ళి, అతడి భౌతిక కాయాన్ని చూసివచ్చారు.

సుబ్బారావు రూపం ఇంకా ఆయన కళ్ల ముందు కదులుతోంది.

సుబ్బారావుకి పట్టుమని పాతికేళ్ళు నిండలేదు. బి.కామ్ ఫైనల్ ఎగ్జామ్స్‌రాసి రెండు నెలలవుతుంది. ఖాళీగా కూర్చోవడమెందుకని 'సౌజన్య' సబ్‌ఎడిటర్‌గా జాయినయ్యాడు.

సుబ్బారావు తెలివితేటలు, చురుకుతనం పార్వతీశంగారిని బాగా ఆకర్షించాయి. అందుకే సుబ్బారావుని సబ్‌ఎడిటర్‌గా అపాయింట్ చేసుకున్నారు.

రెండురోజులక్రితం జరిగిన సంఘటన ఆయన మదిలో మెదిలింది.

ఆరోజు సుబ్బారావు పార్వతీశంగారి ఆఫీసు రూమ్‌లోకి అడుగుపెట్టాడు.

ఏడ్చి ఏడ్చి అతడికి కళ్ళు వుబ్బివున్నాయి.

జుత్తంతా రేగిపోయివుంది.

బట్టలన్నీ దుమ్ముకొట్టుకుపోయి వున్నాయి.

"ఏమిటిది సుబ్బారావూ... ఎక్కడైనా పడ్డావా? బట్టలు అలా మాసిపోయాయి?!" అడిగారు పార్వతీశంగారు.

"లేదు సార్! ఇది ఆ రాంబాబుగాడి కథల ప్రభావం. అవి చదివి తట్టుకోలేక మన కార్యాలయంలోనే నేలమీదపడి ఏడుస్తూ దొర్లానంతే!" వినయంగా చెప్పాడు సుబ్బారావు

"ఐసీ" అంటూ సాలోచనగా తలపంకించారు పార్వతీశంగారు.

"సార్!" అన్నాడు సుబ్బారావు.

"ఏమిటి సుబ్బారావు?" అడిగారు పార్వతీశంగారు.

"రాంబాబుగాడి కథలు చదివి భరించలేకపోతున్నాను సార్! రాత్రుళ్లు నాకు పీడకలలు వస్తున్నాయి. ఇక నేనీ ఉద్యోగం చెయ్యలేనండీ! ఉద్యోగానికి రాజీనామా చెయ్యాలనుకుంటున్నాను" అంటూ దీనంగా చెప్పాడు సుబ్బారావు.

"వ్వాట్!?" ఆశ్చర్యపోయారు పార్వతీశంగారు.




విశిష్ఠ సుగంధం
మైమరపించే తాజాదనం

క్రొత్త
ప్రేమ్
మీకోసమే




ఇప్పుడు అనువైన ఆకారంలో క్రొత్త పరిమళంతో వస్తోంది.

Imageads 2418 Tel

''చూడు సుబ్బారావ్... నువ్వు కుర్రాడివి. చురుకైనవాడివి. ఆ రాంబాబుగాడి కథలు చదివి తట్టుకునే ధైర్యం నీకే లేకపోతే ఇక మాలాంటివాళ్లకి ఎక్కడ వుంటుంది? వూరికే అలా డీలా పడిపోకు. ధైర్యేసాహసే సంపాదకా అన్నారు పెద్దలు. అంచేత నువ్వు ధైర్యంగా ఆ రాంబాబుగాడి కథల్ని ఎదుర్కో! అంతేగాని ఇలా రాజీనామా ఇచ్చేస్తానని చిన్నపిల్లాడిలా ఏడవకూడదు'' అంటూ ధైర్యం చెప్పారు పార్వతీశంగారు.

''కాని సార్..... బతికుంటే బలసాకు తినవచ్చునని చిన్నప్పుడు మా బామ్మ చెప్పింది. మీ మాటలకంటే నాకు ఆమె మాటలే విలువైనవి. మీ కార్యాలయంలో సబ్ఎడిటర్‌గా పనిచేస్తూ నా నిండుజీవితాన్ని బలిచేసుకునేకంటే -- వుద్యోగం లేకుండా రోడ్డుమీద అడుక్కుతినడం మేలనిపిస్తోంది. మీ మాటలు కాదంటున్నందుకు నన్ను మన్నించండి'' అన్నాడు సుబ్బారావు బాధగా.

ఆ మాటలకు పార్వతీశంగారికి కొంచెం కోపం వచ్చింది.

సుబ్బారావు చురుకైనవాడనీ, భవిష్యత్తులో అతడిని తనంతవాడిని చేద్దామనీ పార్వతీశంగారి అభిప్రాయం. అనవసరంగా వృద్ధిలోకి రావాల్సిన కుర్రాడు అలా వుద్యోగం మానేస్తానంటే ఆయనకి బాధకలిగింది.

''చూడు సుబ్బారావ్! నేను నీ రాజీనామా అంగీకరించను అంతే!'' అన్నారు గట్టిగా పార్వతీశంగారు.

''సార్!'' అంటూ సుబ్బారావు ఇంకేదో అనబోయాడు.

''నో మోర్ టాక్స్! నౌ యు కెన్‌గో!'' అంటూ ఖండితంగా చెప్పేసి ఫైళ్లలోకి తలదూర్చేశారు పార్వతీశంగారు.

పాపం సుబ్బారావు ఇంకేమీ నోరు మెదపలేక గుడ్లనీరు తిప్పుకుంటూ అక్కడినుండి వెళ్లిపోయాడు.

ఈరోజు వుదయం ఆ సుబ్బారావే జీవితం మీద విరక్తిచెంది గోదావరి ఎక్స్‌ప్రెస్ కింద తలపెట్టి ఆత్మహత్యచేసుకున్నాడు.

పార్వతీశంగారు ఈ వార్త తెలిసి హడావిడిగా సుబ్బారావింటికెళ్లారు.

సుబ్బారావు శవంమీద పడి అతడి తల్లిదండ్రులు దారుణంగా విలపిస్తున్నారు. పాపం... ఆ దంపతులకు సుబ్బారావు ఏకైక సంతానం!

''నాయనా... నాకన్న తండ్రీ! ఇంత చిన్నవయసులోనే మాకు కడుపుశోకం కలిగించావటరా! నీకిది న్యాయంగా వుందా!?'' అంటూ సుబ్బారావు తల్లిదండ్రులు ఘోరాతి ఘోరంగా దుఃఖిస్తున్నారు.

''ఏడవకండి. పోయినవాడెలాగూ తిరిగిరాడుకదా!'' అంటూ పార్వతీశంగారు ఆ దంపతులని ఓదార్చబోయారు.

''వాడిది సహజంగా వచ్చిన మరణమైతే మేమసలు ఏడ్చేవాళ్లమేకాము. రాత్రే వాడు మాకోవుత్తరం రాసిపెట్టి వెళ్ళిపోయాడు. వాడి ఆత్మహత్యకి రాంబాబు అనేవాడి రచనలే కారణమని ఆ లేఖలో పేర్కొన్నాడు. అందుకే మేమిలా బాధపడిపోతున్నాము'' అంటూ సుబ్బారావు తండ్రి కండువా నోటికి అడ్డంపెట్టుకుని కుమిలి కుమిలి ఏడవసాగాడు.

''ఆ రాంబాబుగాడు కూడా నా కొడుకులాగే ఎడిటరయి, చెత్తరచనలు చదివి చావాలని శాపంపెడుతున్నాను. నా కడుపు మంట వాడికి తగలాలి'' అంటూ సుబ్బారావు అమ్మగారు శోకాలు పెడుతున్నారు.

ఆ దృశ్యం పార్వతీశంగారి హృదయాన్ని కదిలించి వేసింది.

ఆయన ఎంత ఓదార్చాలని ప్రయత్నించినా ఆ దంపతుల శోకాన్ని ఆపలేకపోయారు.

ఇక చేసేది లేక – ఆ వృద్ధ దంపతులకు సుబ్బారావు దహన సంస్కార నిమిత్తం పదివేల రూపాయలు చెక్కు అందజేసి వెనుదిరిగి వచ్చేశారాయన.

ప్రస్తుతం పార్వతీశంగారు తన కార్యాలయంలో కూర్చుని జరిగిన సంఘటనలన్నింటినీ నెమరు వేసుకుంటున్నారు.

ఆయనకి వున్నట్టుండి రాంబాబుని చంపేయాలన్నంత ఆవేశం వచ్చింది.

కాని, అది సాధ్యమా?

ఆ మహా రచయిత రాంబాబు విశాఖప




[illegible] వున్నాడు! [illegible] వున్నాడు!

దీనికేదో పరిష్కారం ఆలోచించాలి. రాంబాబుగాడి రచనల దాడిని అరికట్టాలి! లేకపోతే మరికొంతమంది సంపాదకులు చచ్చిపోయే ప్రమాదం వుంది.

ఎలా? ఎలా?

దీర్ఘంగా ఆలోచిస్తున్నారు పార్వతీశంగారు.

హఠాత్తుగా ఆయన మదిలో 'విశాలి' చీఫ్ ఎడిటర్ ధర్మారావుగారు మెదిలారు.

ధర్మారావుగారు వాళ్ల అసోసియేషన్‌కి ప్రెసిడెంట్ కూడాను.

అందుచేత ఈ విషయం ధర్మారావుగారితో కలిసి చర్చించాలనిపించింది.

ఆలోచన వచ్చిందే తడవుగా కుర్చీలోంచి లేచి, కారెక్కి 'విశాలి' పత్రికా కార్యాలయంవైపు దూసుకుపోయారు పార్వతీశంగారు.




అదేరోజు 'కోకిల' పక్షపత్రిక కార్యాలయంలో మరో దుర్ఘటన జరిగింది.

గవర్నమెంటు మెంటల్ హాస్పిటల్లోకి హడావిడిగా అడుగుపెట్టారు 'కోకిల' చీఫ్ ఎడిటర్ మాధవగారు.

స్వింగ్‌డోర్స్ తెరుచుకుని సూపర్నెంట్ రూమ్‌లోకి వెళ్లగానే

''కూర్చోండి'' అంటూ కుర్చీ చూపించారు డాక్టర్ జయరాజ్.

''అయామ్ చీఫ్ ఎడిటర్ ఆఫ్ 'కోకిల' అంటూ తనని తాను పరిచయం చేసుకున్నా [illegible] డిలా వున్నారాయన.

''చెప్పండి... కంప్లయింట్ ఏమిటి?'' అని అడిగారు డాక్టర్ జయరాజ్.

''సారీ... జబ్బు నాక్కాదు. మా సబ్‌ఎడిటర్ కాంతారావుకి, అతడు ఈరోజు వుదయం మీ హాస్పిటల్లో జాయినయ్యాడు. చూసివెళదామని వచ్చాను'' చెప్పారు మాధవరావుగారు.

''ఓ.... కాంతారావు మీ కార్యాలయంలో పనిచేస్తున్నాడన్నమాట!'' అని' ''ఇక అతడు తిరిగి మామూలు మనిషి కాలేడు'' విచారంగా చెప్పారు డాక్టర్ జయరాజ్.

''ఏమిటి డాక్టర్ మీరంటోంది? మా కాంతారావు తిరిగి మామూలు మనిషి కాలేడా? మీరలా అనకండి డాక్టర్! ఎంత ఖర్చయినా బాధలేదు. మా కాంతారావుని మామూలు మనిషిని చెయ్యండి'' అభ్యర్థనగా అన్నారు మాధవరావుగారు.

''సారీ! ఈ విషయంలో నేనేమీ చెయ్యలేను. కాంతారావు పరిస్థితి చెయ్యిదాటిపోయింది'' విచారంగా చెప్పారు డాక్టర్ జయరాజ్.

మాధవరావుగారు వుస్సురని బాధగా నిట్టూర్చారు.

ఆయన రెండ్రోజులక్రితం పనిమీద విజయవాడ వెళ్లారు. ఈరోజు వుదయమే తిరిగి హైదరాబాదు వచ్చారు. తిన్నగా తన కార్యాలయానికి వెళ్ళేసరికి ఈ దుర్వార్త తెలిసింది. అంతే! హుటాహుటిన మెంటల్ హాస్పిటల్‌కి పరుగెట్టుకొచ్చారు.

''అసలు మా కాంతారావుకి ఈ జబ్బెందుకొచ్చిందో చెప్పగలరా?'' అడిగారు మాధవరావుగారు.

''విషయం ఏమిటంటే రాంబాబు అనేవాడి చెత్త రచనలు చదివి చదివి అతడి బ్రెయిన్ దెబ్బతింది. ఆ కథల్లోని పాత్రల్నే అతడు కలవరిస్తున్నాడు.

ఇహ ఈ జన్మలో పిచ్చి నయంకాదు. అతడు శాశ్వతంగా ఈమెంటల్ హాస్పిటల్లో వుండిపోవాల్సిందే!''

డాక్టర్ జయారాజ్ సామాన్య వ్యక్తికాదు. ఏడెనిమిది ఫారెన్ డిగ్రీలున్నాయి. ఎలాంటి మొండి జబ్బయినా అతని చేతిలో ఇట్టే నయమైపోతుంది. అలాంటిది కాంతారావు విష




యంలో వ్యాధి నయమవదని చెప్పారంటే- రాంబాబు కథలు ఎంత దారుణమైనవో గదా! అనుకున్నారాయన.

మాధవరావుగారి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. చేతిరుమాలుతో కళ్ళనీళ్ళు వత్తుకున్నారు.

"అసలా రాంబాబు ఎవరండీ?" అడిగారు జయరాజ్.

"వాడిది విశాఖపట్నమండీ! ఏదుర్ముహూర్తాన వాడు రచయిత కావాలనుకున్నాడో కాని మా సంపాదకులకి మూడింది. వాడిది విశాఖపట్నమని మాత్రమే మాకు తెలును. అంతకు మించి వివరాలు మా సంపాదకులెవరికీ తెలీదు" అని చెప్పారు మాధవరావుగారు.

"ఐసీ" అంటూ తలపంకించారాయన.

"చూడండి మాధవరావుగారూ... ఏదియేమైనా ఆ రాంబాబు కథలు చదవకుండా మిగతా సంపాదకులు జాగ్రత్తలు తీసుకోవడం చాలా అవసరం. లేకపోతే తక్కిన సంపాదకులకి కూడా పిచ్చెక్కే అవకాశం వుంది" అంటూ హెచ్చరించారు డాక్టర్.

"అలాగే ప్రయత్నిస్తాను" అని చెప్పి- "ఓ సారి నేను కాంతారావుని చూడాలి" అన్నారు మాధవరావుగారు.

"పదండి" అంటూ కుర్చీలోంచి లేచి నిలబడ్డారాయన.

డాక్టర్ జయరాజ్ అడుగులు వేస్తుండగా మాధవరావుగారు అనుసరించారు.

ఓ కటకటాలగదిలో బంధింపబడి వున్నాడు కాంతారావు.

అతడు ఈ ప్రపంచంలో లేడు.

పిచ్చిగా శూన్యంలోకి చూస్తున్నాడు. వెర్రిగా నవ్వుతున్నాడు. ఆవేదనగా ఏడుస్తున్నాడు.

ఉండివుండి మధ్యమధ్యన- "మైడియర్ రాంబాబూ... రియల్లీ యుఆర్ఎ జీనియస్ రైటర్!" అని అరుస్తున్నాడు.

"ఉల్లిపాయలు... పచ్చిమిరపకాయలు... ఎండుమిరపకాయలు... వంకాయలు... సైకిలు... స్కూటరు... కారు... ఎద్దులు... ఆవులు" అంటూ రాంబాబు కథలలోని పాత్రలని కలవరిస్తున్నాడు.

"పాపం!" అంటూ కాంతారావు మీద జాలి పడ్డారు డాక్టర్ జయరాజ్.

ఆ దృశ్యం మాధవరావుగారి హృదయాన్ని కదిలించివేసింది. గుండెల్ని పిండేసింది.

కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

కాంతారావుని ఇక చూడలేక అక్కడినుంచి వెనుదిరిగారు.

డాక్టర్ ఆ జయరాజ్ దగ్గర సెలవు తీసుకుని మెంటల్ హాస్పిటల్‌లోంచి బయటపడ్డారు.

కారుని కాంతారావు ఇంటివైపు పోనిచ్చారు.

కారుకంటే వేగంగా ఆయన ఆలోచనలు కాంతారావు చుట్టూ పరుగెడుతున్నాయి...

రెండ్రోజుల క్రితం తాను విజయవాడ వెళ్ళబోయే ముందు కాంతారావుతో తన సంభాషణ గుర్తుకొచ్చింది.

ఆరోజు...

కాంతారావు తన గదిలోకి వచ్చాడు.

ఏడ్చిఏడ్చి అతడి కళ్ళు ఎర్రగా ఉబ్బివున్నాయి.

జుత్తంతా రేగిపోయింది.

"ఏంకావాలి కాంతారావ్?" అడిగారు మాధవరావుగారు.

"సార్... ఈమధ్య ఆరోగ్యం బాగుండటంలేదు. ఓనెల రోజులు సెలవు కావాలి" చెప్పాడు కాంతారావు.

కాంతారావు వయసు సుమారు ముప్పై ఏళ్ళుంటుంది. నెలరోజుల క్రితమే అతడికి పెళ్ళయింది.

"ప్రస్తుతం నువ్వు సెలవు అప్లైచేయడానికి వీల్లేదు. ఆ రాంబాబుగాడి కథలు ఓ వందదాకా మనకార్యాలయంలో పేరుకుపోయాయి. వాటినన్నిటినీ పరిశీలించి వెనక్కు తిప్పిపంపేదాకా నీకు లీవ్‌గ్రాంట్‌చేసేది లేదు" అన్నారు మాధవరావుగారు.

ఆ మాటలకు కాంతారావు బావురుమని ఏడ్చేశాడు.

"సార్... మీకిది భావ్యంకాదు. నేను సెలవు పెడతానన్నది కూడా ఆ రాంబాబుగాడి కథల గురించే! వాడి కథలబారినుండి కొంతకాలం ఎస్కేప్ అవాలనే నేను సెలవు పెడతానన్నా

ను. ఈమధ్య కన్నుమూసినా, తెరిచినా ఆ రాంబాబుగాడి కథలలోని పాత్రలే నన్ను వెంటాడుతున్నాయి. అవి నాకళ్ళముందు సజీవంగా నిలిచి నృత్యం చేస్తున్నాయి. 'కాంతారావ్... కాంతారావ్!' అంటూ పలకరిస్తున్నాయి. నేను రెస్టు తీసుకోకుండా ఓ నెలరోజులపాటు వాడి కథలు చదివానంటే పిచ్చెక్కడం ఖాయం. ప్లీజ్... మీకు పుణ్య



ముంటుంది- అసలే కొత్తపెళ్ళికొడుకుని. నన్నూ నాభార్యని అన్యాయం చెయ్యకండి. దయచేసి నాకు లీవ్‌గ్రాంట్ చెయ్యండి'' అంటూ దీనంగా వేడుకున్నాడు కాంతారావు.

''రాంబాబుగాడి కథలు చదువుతూ నువ్వలా భ్రమపడుతున్నావు... అంతే! నీకేంకాదు నేను చెబుతున్నాను కదా! ఇప్పుడు నువ్వు సెలవు పెట్టావంటే స్టాఫ్ తక్కువైపోతుంది. దాంతో ఈనెల్రోజుల్లో రాంబాబుగాడి కథలు మరోవందపోగయిపోతాయి. అందుకే నీకు లీవ్‌గ్రాంట్ చేసే వుద్దేశంలేదు నాకు'' చెప్పారు మాధవరావుగారు.

''అదికాదు సార్!'' అంటూ కాంతారావు ఇంకేదో చెప్పబోయాడు.

కాని మాధవరావుగారు వినలేదు.



"డోంట్‌టెల్ మి స్టోరీస్! యుకెన్‌గో! దట్సాల్" అంటూ కాంతారావు మాటలని మధ్యలోనే ఖండించేశారు మాధవరావుగారు.

పాపం... కాంతారావు హతాశుడై అక్కడి నుండి వెళ్ళిపోయాడు.

అదేరోజు మాధవరావుగారు పనిమీద విజయవాడ వెళ్ళిపోయారు.

మళ్ళీఈరోజు మధ్యాహ్నం తిరిగి వచ్చేసరికి ఆయనకీ దారుణవార్త తెలిసింది.

కాంతారావుతో ఆనాటి తన సంభాషణ గుర్తొచ్చి ఆవేదనగా కణతలు నొక్కుకున్నారాయన.

కాంతారావు అడిగిన వెంటనే తాను సెలవు ఇచ్చేసినా ఈ దారుణం జరిగి వుండకపోనేమో.

కారు కాంతారావు ఇంటిముందు ఆగింది.

కాంతారావు భార్య ప్రమీల గుమ్మంలోనే ఎదురుపడింది.

ఆమె గుమ్మానికి ఆనుకుని నిలబడి శూన్యంలోకి తదేకంగా చూస్తోంది.

ఏడ్చిఏడ్చి ఆమె బుగ్గలు చారికలు కట్టివున్నాయి.

ప్రమీలని ఆ స్థితిలో చూసేసరికి మాధవరావుగారి హృదయం ద్రవించింది.

ప్రమీల యూనివర్శిటీలో ఎమ్.ఎ. చదివింది.

కాంతారావు అందచందాలు, గుణగణాలు చూసి అతడిని ప్రేమించి మరీ పెళ్ళిచేసుకుందామె.

కాని... పెళ్ళయి నెలరోజులైనా కాపురం చెయ్యకుండానే–

విధి రాంబాబు కథల రూపంలో వచ్చి కాంతారావుని మెంటల్‌హాస్పిటల్లో జీవిత సభ్యుడిగా మార్చేసింది.

మాధవరావుగారు ప్రమీలని సమీపించారు.

ఓదార్పుగా ఆమె తలమీద చేయివేశారు.

తండ్రిలాంటి ఆయనని చూడగానే ప్రమీలలో మళ్ళీ దుఃఖం పొంగుకొచ్చింది.

"బాధపడకమ్మా ప్రమీలా... ఏం చేస్తాం?" అంటూ అనునయంగా అన్నారు.




ఆ మాటలకు ప్రమీల ఎదలోంచి దుఃఖం మరింతగా ఎగదన్నుకొచ్చింది.

"నేను దురదృష్టవంతురాలినండీ! ఆ రాంబాబుగాడి కథల గురించి రోజూ నాతో చెబుతూండేవారాయన. రోజూ రాత్రిళ్ళు వాడి కథలలోని పాత్రలనే కలవరించేవారు. మావారికి ఈ దుస్థితి కలిగించి నన్ను దిక్కులేనిదానిగా చేసినందుకు నావుసురు రాంబాబుగాడికి తగలకపోదు. వాడికీ మావారిలా పిచ్చెక్కకపోదు" అంటూ విలపించసాగింది ప్రమీల.

"చూడమ్మా ప్రమీల... ఆ రాంబాబుగాడి కథలవల్ల నీకు అన్యాయం జరిగినా నేను మాత్రం నీకు అన్యాయం చెయ్యను. కాంతారావు వుద్యోగం నీకిస్తాను. రేపటినుంచే నువ్వు వుద్యోగంలో జాయినవు" అని చెప్పారు మాధవరావుగారు.

ఆ మాటలకు మాధవరావుగారిని భయంభయంగా చూసింది ప్రమీల.

"అబ్బే... నాకుద్యోగం వద్దండీ!" అంది.

"ఏమ్మా... మరి నీపొట్ట గడవడమెలా?" అడిగారాయన.

"నాకు వేరే వుద్యోగం చెయ్యాలని వుంది" అంది.

"పోనీ... మరో వుద్యోగం దొరికేదాకా నీభుక్తి గడవడానికి మా ఆఫీసులో పనిచెయ్యి" చెప్పారు మాధవరావుగారు.

"కాని... నాకు కాస్త ఆరోగ్యంగా జీవించాలని వుందండీ!" అంది ప్రమీల.

"ఏమ్మా... మా కార్యాలయంలో చేరితే నువ్వు ఆరోగ్యంగా జీవించలేవా?" నిష్ఠూరంగా అడిగారాయన.

"మీరేమీ అనుకోనంటే నాదొక మనవి. ఆ రాంబాబుగాడు తన కథలతో మీ పత్రికాకార్యాలయాలమీద దాడి చేస్తున్నంతకాలం ఏ సబ్ ఎడిటరూ కూడా ఆరోగ్యంగా బతకలేడు. అంచేత నాకీ వుద్యోగం వద్దు! మరే కంపెనీలోనన్నా మీ పలుకుబడితో నాకు వుద్యోగం ఇప్పించండి" అంటూ వినయంగా విన్నవించుకుంది ప్రమీల.

ఆమె మాటలకు ఇంకేమీ అనలేకపోయారు మాధవరావుగారు.

"సరే అమ్మా... నీఇష్టం!" అని జేబులోంచి పదివేల రూపాయలకు చెక్కు ఒకటి తీసి

ప్రమీల చేతిలో పెట్టారు.

"కాంతారావుకి ఇలా జరిగినందుకు నేను ఇస్తున్న కాంపన్సేషన్ ఇది వుంచు" అని చెప్పి అక్కడినుంచి వెనుదిరిగారు మాధవరావుగారు.

మాధవరావుగారి కారు రోడ్డుమీద జర్రున జారిపోతోంది. ఆయన చేతిలోని స్టీరింగ్ యాంత్రికంగా తిరుగుతోంది. ఆలోచనలు రచయిత రాంబాబు చుట్టూ పరిగెడుతున్నాయి.

రాంబాబు డేంజరస్‌ఫెలో! వాడి రచనలు మరీ డేంజరస్!!

ఈ ప్రమాదం నుంచి తక్కిన సంపాదకులని కాపాడటమెలా?

దీర్ఘంగా ఆలోచిస్తున్నారు మాధవరావుగారు.

ఆయన బ్రెయిన్‌కి ఏ ఆలోచనా తట్టలేదు కాని, మదిలో "విశాలి" వారపత్రిక చీఫ్ ఎడిటర్, ఎడిటర్స్ అసోసియేషన్ ప్రెసిడెంటు అయిన ధర్మారావుగారు మెదిలారు.

ఆయనని కలిసి ఈవిషయం చర్చించాలనుకున్నారు మాధవరావుగారు.

వెంటనే కారు "విశాలి" కార్యాలయంవైపు దూసుకుపోసాగింది.

★ ★ ★

రాంబాబు తనగదిలో కూర్చుని కథ రాస్తున్నాడు.

చాలా దీర్ఘంగా ఆలోచిస్తూ రాస్తున్నాడు.

రాస్తూరాస్తూ మధ్యమధ్యలో అరుస్తున్నాడు.

వెక్కివెక్కి ఏడుస్తున్నాడు.

పిచ్చిగా జుత్తుపీక్కుని నవ్వుకుంటున్నాడు.

అతడు రాస్తున్న కథపేరు "రాధ-లారీ!"

ఆ కథకి థీమ్ రాంబాబుకి చాలా విచిత్రంగా తట్టింది.

ఉదయమే అతడు మార్నింగ్ వాక్‌కి బయలుదేరాడు.

దార్లో రోడ్డు వారన అతడికి ఓ లారీ కనిపించింది.

ఆలారీకి ఇంజను ట్రబులివ్వడం వలన దానిని కొంతమంది కూలివాళ్ళు ముందుకు తోస్తున్నారు. లోపల డ్రైవరు కూర్చుని స్టార్ట్ చెయ్యడానికి ప్రయత్నాలు చేస్తున్నాడు.

అదే సమయంలో ఆ లారీ పక్కనుంచి ఓ కాలేజీ అమ్మాయి నడుచుకుంటూ వెళ్ళిపోతోంది.

రాంబాబు ఆలారీని, కాలేజీ అమ్మాయిని మార్చిమార్చి చూశాడు.

అంతే!

అతడి మెదడుకి థీమ్ తట్టేసింది.

అతడు ఇంటికివచ్చి ఆ కాలేజీ అమ్మాయి మీద "రాధ-లారీ" కథ రాస్తున్నాడు.

ఆకథ థీమ్ ఏమిటంటే—

రాధ అనే ఓ అందమైన అమ్మాయి కాలేజీలో బి.ఎస్సీ ఫస్టియర్ చదువుతూంటుంది. ఆమె అందచందాలని చూసి ఓలారీ ఆమెని ప్రేమిస్తుంది. రోజూ రాధ వెనుక మౌనంగా వెంటబడుతూంటుంది. కాని, ధైర్యం చేసి ఆలారీ తన ప్రేమని రాధతో చెప్పలేకపోతుంది. ఓరోజు తన స్నేహితుడైన సిటీబస్సుతో లారీ తన ప్రేమ గురించి వెళ్ళబోసుకుంటుంది. అప్పుడు సిటీబస్సు ఆవిషయం డైరెక్టుగా రాధని అడిగేయమని సలహా ఇస్తూ తగుధైర్యం నూరిపోస్తుంది. దాంతో రాధని ప్రేమిస్తున్నానని లారీ డైరెక్టుగా ఆమెతో చెప్పేస్తుంది. కాని, రాధ లారీ ప్రేమను తిరస్కరిస్తుంది. దాంతో లారీ జీవితంమీద విరక్తిచెంది, విషం తిని ఆత్మహత్యా చేసుకుంటుంది. ఈవిషయం రాధకి తెలిసి కన్నీరుమున్నీరుగా విలపిస్తుంది. ఆతరువాత లారీ శవానికి ఓ తాడుకట్టి శ్మశానం దాకా ఈడ్చుకువెళుతుంది. అక్కడ లారీకి చితి పేరుస్తుంది. ఆ చితికి నిప్పు అంటించి తానూ ఆచితిలో దూకి ఆత్మత్యాగం చేసుకుంటుంది రాధ.

—ఇదీ రాంబాబు రాస్తున్న కథ థీమ్.

లారీ ఏమిటి? . రాధ ఏమిటి? ప్రేమ ఏమిటి?- అని ఎవరైనా నెత్తీ నోరు కొట్టుకుని అడగవచ్చు.

కాని ఆ కథకి చక్కటి భాష్యం చెప్పగలడు రాంబాబు.

లారీని మనిషి సృష్టించినా దానికీ చలనం వుంది. కాబట్టి మనిషిలాగే మనసుంటుంది. ప్రేమించే హృదయం వుంటుంది- అని

రాంబాబు గట్టిగా బల్లగుద్ది వాదించగలడు.

అతడి వాదనని ఎడిటర్లు, పాఠకులే కాదు... లాయర్లు కూడా కాదనలేరు.

రాంబాబు 'రాధ-లారీ' సగంవరకూ రాశాడు.

ఆపైన కథని క్లైమాక్స్‌కి తీసుకువస్తుండగా బయటినుంచి "పోస్ట్" అన్న కేక వినిపించింది.

దాంతో రాంబాబు కథకి బ్రేక్‌పడింది.

ఆ గదిలో కేవలం డ్రాయరు, బనీనుతో మాత్రమే కూర్చుని కథ రాస్తున్న రాంబాబు చేతిలో కలాన్ని టేబుల్‌మీదికి విసిరేసి హడావుడిగా బయటికి పరుగెత్తుకొచ్చేశాడు.

రాంబాబు ఇంటిముందు ఓ రిక్షా ఆగివుంది.

ఆ రిక్షాలో ఓ గోనెబస్తా కథలు వున్నాయి. రిక్షాలోంచి పోస్టుమాన్ నారాయణ దిగుతున్నాడు.

రాంబాబు నారాయణకి ఎదురెళ్లి "నమస్కారం సార్!" అన్నాడు.

"నమస్కారమండీ రచయితగారూ!" అంటూ నారాయణ కూడా ప్రతి నమస్కారం చేశాడు.

"ఇంటిమేషన్లేమయినా వచ్చాయా?" అడిగాడు రాంబాబు.

"ఏమీ రాలేదండీ! కాని ఈ కథలు పోస్టులో తిరిగొచ్చాయి. వాటిని భద్రంగా గోనెబస్తాలోకి ఎక్కించి రిక్షాలో తీసుకొచ్చాను" చెప్పాడు పోస్టుమాన్.

ఇంతలో రిక్షావాడు ఆ కథల బస్తాని వరండాలోకి జారవేశాడు.

తరువాత రాంబాబు ఇంట్లోకి వెళ్లి డబ్బులు తెచ్చి రిక్షావాడికిచ్చాడు. వాడు వంగివంగి సలాములు చేస్తూ వెళ్లిపోయాడు. "అల్లా దయవల్ల మీ కథలెప్పుడూ ఇలాగే బస్తాలకొద్దీ తిరిగిరావాలి! నాకు నాలుగు డబ్బులు వస్తూండాలి! అల్లా మీకు, నాకు ఎప్పుడూ ఇలాగే మేలుచేయాలి" అని పోతూ పోతూ మనసులోనే అల్లాని ప్రార్థించుకున్నాడు ఆ రిక్షావాడు.

పోస్టుమాన్ నారాయణ రోజూ తిరిగి వచ్చే రాంబాబు కథలని పోస్టాఫీసుల్లో భద్రంగా గోతాల్లో మూటకడతాడు. వారానికి రెండుసార్లు ఆ కథల బస్తాని రిక్షాలో ఎక్కించి రాంబాబు ఇంటికి తీసుకువస్తాడు. రిక్షాబాడుగ రాంబాబే ఇచ్చేస్తూంటాడు.

తిరిగొచ్చిన తన కథల బస్తాలవంక నిరాశగా చూశాడు రాంబాబు.

తన కథలని నిర్లక్ష్యంగా తిప్పి పంపేసిన సంపాదకులమీద పట్టరాని కోపం వచ్చిందతడికి.

'హుఁ... దుర్మార్గులు... దుష్టులు...' అంటూ మనసులో సంపాదకులని బండబూతులు కూడా తిట్టుకున్నాడు.

రాంబాబు కళ్లలో బాధ చూసిన పోస్టుమాన్ నారాయణకి అతడిమీద జాలివేసింది.

ఆ వెంటనే తనకంటే ముందు రాంబాబుకి పోస్టుమాన్‌గా పనిచేసిన సింహాచలం గుర్తుకొచ్చాడు.

సింహాచలం దేశంలో వున్న కొన్ని కోట్ల మంది నిరుద్యోగుల్లో పట్టభద్రయువకుడు. చచ్చిచెడి చేయ ంగల విన్నపాలన్నీ చేసి రికమండేషన్లు కొట్టించుకుంటే పోస్టుమాన్ ఉద్యోగం దొరికింది. యూనివర్సిటీ పట్టభద్రుడైన సింహాచలం అదే తన ప్రాప్తం అనుకున్నాడు. అదే తన అదృష్టం అని పొంగిపోయాడు కూడా. వెంటనే ఉద్యోగంలో చేరిపోయాడు.

ఉద్యోగంలో చేరిన కొత్త! కొత్తేమిటి అదే మొదటిరోజు!! ఒకపక్క తనకి వుద్యోగం ఇప్పించిన పెద్దలపేరు పోగొట్టకూడదు. మరోపక్క పోస్టాఫీసులో అణకువగా వుండాలి— అనుకుంటూ వుండగానే సింహాచలం మీదికి ఆర్.ఎమ్.ఎస్.బేగ్స్ వచ్చిపడ్డాయి.

కొత్తవాడు అందరికీ లోకువగదా, మరి.

"బేగ్స్ ఇప్పవోయ్ సింహాచలం" అన్నాడో సీనియర్ పోస్టుమాన్. అతడు చదివింది ఏదో క్లాస్ వరకే.

సింహాచలం బేగ్స్ విప్పుతున్నాడు.

ఇంతలో కిటికీ దగ్గర అలికిడయింది.

సింహాచలం ఆ అలికిడి పట్టించుకోలేదు.

"అప్పారావు రాలేదా? ఏమైపోయాడు? పోస్టు ఇప్పుడే వచ్చిందా? హలో! ఏమండీ





రాజుగారూ! అప్పారావేడీ సార్? సూర్యనారా యణగారూ! అప్పారావెక్కడసార్?''

ఇవి ఆ డైలాగులు.

ఆ డైలాగ్స్ ఎవరివో ఆ పోస్టాఫీసులోని పోస్టుమాన్‌లందరికీ తెలుసు. వాళ్లని అతడెలా కంగారుపెడతాడో వాళ్లకి బాగా తెలుసు.

రాంబాబు కలం పట్టినదగ్గరనుండి రోజూ పోస్టాఫీసుకి వస్తూనే వున్నాడు.

పోస్టుమాన్‌లని వూదరగొట్టేస్తూనే వున్నాడు.

అందుకే పోస్టుమాన్‌లు అతడి మాటలు పట్టించుకోలేదు.

రాంబాబు మళ్లీ అవే మాటలని రిపీట్ చేశాడు.

అప్పుడు ఓ పోస్టుమాన్ తలపైకెత్తి-

''అప్పారావుని హెచ్.బి. కాలనీ వేశారండీ'' అన్నాడు.

''అరెరె... అప్పారావుని మార్చేశారా? ఎప్పుడు? ఎందుకు? నిన్నసాయంకాలందాకా వున్నాడుకదా! నిన్న నావి ఓ పదికథలు తిరిగొచ్చాయే. అవన్నీ అతడే తెచ్చాడు నిన్న. ఈరోజు అతడిని ఎందుకు మార్చేసినట్టు?'' అడిగాడు రాంబాబు.

బేగ్స్‌తో చెమటలు కక్కుతున్న సింహాచలం తలతిప్పి చూశాడు.

సన్నటి రివటలాంటి ఆకారం. కాస్తంత నలుపే అయినా కోలముఖం. కోడిలాంటి జుత్తుతో సింహాచలానికి దర్శనమిచ్చాడు రాంబాబు.

ఓ మూలనుంచి మరో పోస్టుమాన్ రాజు అన్నాడు—

''అదుగోసార్... అతనే మీ కొత్త పోస్టుమాన్'' అని.

అంతే!

రాంబాబుకి పెన్నిధి దొరికినట్లయింది.

సింహాచలాన్ని కళ్లనిండుగా చూసుకున్నాడు.

''మీ పేరు సార్?'' అని అడిగాడు.

దాంతో పోస్టుగ్రాడ్యుయేట్ రాంబాబు భుజాలుప్పొంగాయి. పోస్టుమాన్‌ని కూడా ''సార్'' అనే సత్తెకాలం మనిషి దొరికినందుకు అత్యంత ఆనందాన్ని అనుభవించాడు సింహాచలం.

''నన్ను సింహాచలం అంటారండీ!''

''నేను కథలు రాస్తాను సార్! నా పేరు రాంబాబు. ఎడ్రసు శ్మశానం పక్కన. నాకేమైనా పత్రికలనుంచి ఇంటిమేషన్లొచ్చాయేమో చూడండి సార్'' అన్నాడు రాంబాబు.

ఆరోజు అసలే మెయిలు లేటుగా వచ్చింది. ఎంత త్వరగా డెలివరీకి పోస్టుమాన్లు వెళ్లిపోతే ఆ సబ్‌పోస్టుమాస్టర్‌కి అంత త్వరగా విముక్తి. అందుకని బేగ్స్ పని ఎంతవరకు వచ్చిందో చూద్దామని సబ్‌పోస్టుమాస్టర్ అక్కడికి వచ్చాడు.

సింహాచలం బేగ్స్‌లోనుంచి ఉత్తరాలు భద్రంగా కిందికి గుమ్మరిస్తున్నాడు.

రాంబాబు అతడిని ఊదరగొడుతున్నాడు.

''నాకు పత్రికలనుంచి ఇంటిమేషన్లు వస్తాయి సార్! ఇంటిమేషన్‌కి రూపాయి చొప్పున మీకు బహుమతి ఇచ్చుకుంటాను. వాటిని జాగ్రత్తగా నాకివ్వండి సార్! అఫ్‌కోర్స్... మీతో చెప్పకపోవడమేం!? ఇంతవరకూ నాకు ఒక్క ఇంటిమేషన్ కూడా రాలేదు. కథలే తిరిగి వచ్చేస్తున్నాయి. అవి ఒక పత్రికనుంచి తిరిగొచ్చేశాయనుకోండి... మరో పత్రిక్కి పంపిస్తాను. నా గురించి నేను చెప్పకపోవడమేం. కానండీ నేను కథలు చాలా బాగా రాస్తాను. డైలాగ్స్ బాగా రాస్తాను. చక్కటి వర్ణనలు పెడతాను...'' అంటూ స్వంత డబ్బాకొట్టేస్తున్నాడు రాంబాబు.

ఆ దృశ్యం సబ్‌పోస్టుమాస్టర్ కంటబడింది.

అంతే!

అతడు సింహాచలంమీద వుగ్రుడయ్యాడు.

''ఏమోయ్... కొత్తగా చేరింది నువ్వేకదూ! విజిటర్స్‌తో కబుర్లుపెట్టుకుంటే పనులవ్వవు'' అంటూ తగులుకున్నాడు.

పాపం!

సింహాచలం పైప్రాణాలు పైనేపోయాయి.

పోస్టుమాన్ అయిన తనని ''సార్... సార్'' అని పిలిచి రాంబాబు తన పీకలమీదికి తెస్తాడనుకోలేదు.

''సారీ సార్!'' అని వణుకుతున్న చేతులతో




వుత్తరాలు కెలకడం ప్రారంభించాడు సింహాచలం.

ఆ తరువాత కోపంగా ఫెడీల్‌మని కిటికీ రెక్కలు మూసేశాడు సింహాచలం.

రెక్కలకి, చువ్వలకి మధ్య రాంబాబు వేళ్లున్నాయి.

ఆ వేళ్లు కాస్తా నలిగిపోయాయి.

అదే విదేశాల్లో అయితే వేళ్లు నలిగిపోయినందుకు డామేజ్ ఇస్తారు. కాని, ఇది పూర్ ఇండియా అయిపోయింది మరి.

రాంబాబు ఒకందుకు సంతోషించాడు.

నలిగిపోయినవి తన ఎడమచేతి వేళ్లు మాత్రమే.

ప్రస్తుతం అతడో నవలా రచనలో నిమగ్నమైవున్నాడు.

ఆ నవల తెలుగులో అచ్చు అంటూ అయితే అది అంతర్జాతీయ భాషలన్నింటిలోకి తర్జుమా అవుతుందని రాంబాబు ప్రగాఢవిశ్వాసం. ఆ విశ్వాసమే రాంబాబుని ఎడమచేతి వేళ్లు మాత్రమే నలిగిపోయినందుకు దుఃఖపడకుండా చేసింది. అదే కుడిచేతివేళ్లు నలిగిపోయివుంటే అతడి నవలా రచన కొంతకాలం ఆగిపోయేది మరి.

చావుతప్పి కన్నులొట్టపోయిన సింహాచలం సైకిలెక్కి బీటుకి బయలుదేరాడు.

అసలే కొత్త!

ఏ ఇల్లు ఎక్కడ వుందో తెలీదు.

ఇళ్ళ నంబర్లూ సరిగా వుండి చావవు.

ఆ కంగారు కొంత...

పోస్టాఫీసులో రాంబాబు వూదరగొట్టాడు... పోస్టుమాస్టర్ హడలగొట్టాడు.

అది మరి కొంత...

సింహాచలం బుర్రంతా అయోమయంగా వుంది.

సైకిలు మీద బీటుకి బయలుదేరిన సింహాచలం వెంటబడ్డాడు రాంబాబు.

"నాకేమైనా వుత్తరాలు వచ్చాయా సార్?" అంటూ అతడి బుర్రని తినేయసాగాడు.

ఈ రచయిత వల్ల తాను వుద్యోగంలో చేరిన మొదటి గంటలోనే మాటవడ్డాడు. అదృష్టంకొద్దీ వుద్యోగానికి మోసం రాలేదు. ప్రస్తుతం ఈ రచయితని ఎంత త్వరగా వదిలించుకుంటే అంతమంచిది అనుకున్నాడు సింహాచలం.

"మీకుత్తరాలేమీ లేవండీ!" అన్నాడు గ్రాడ్యుయేషన్ తెచ్చిపెట్టిన సభ్యతతో.

"వస్తాయి... జాగ్రత్తగా చూడండి! దసరా కథల పోటీ గడువు ముగిసి చాలా కాలమయింది. ఈ పాటికి టెలిగ్రాములు, వుత్తరాలు వస్తూండాలి! ఒక్కసారి మళ్ళీ చూడండి సార్!" అంటూ బంకలా జలగలా పట్టుకున్నాడు రాంబాబు.

"లేవండీ!" అని సింహాచలం చెప్పినా రాంబాబు వినడంలేదు. పైగా "వుంటాయండీ!" అంటూ సింహాచలాన్ని ఫాలో కాసాగాడు.

విసిగిపోయిన సింహాచలం ఏమీ చేయలేక ఓ సందులో సైకిలు ఆపాడు.

ఉత్తరాల కట్టని రాంబాబు చేతిలో పెట్టి, అతడి కాళ్ళమీద పడిపోయాడు.

"సార్... మీకు పుణ్యం వుంటుంది. నేనీరోజే వుద్యోగంలో చేరాను. ఈరోజుతో నాకు ఏజ్‌బార్ అయిపోయేది. ఈ నూటేభైరూపాయల వుద్యోగమైనా నేను అనేక కష్టాలు పడితే వచ్చింది సార్! దయచేసి నన్ను క్షమించి, ఆ కట్టవెదుక్కొని, వుంటే తమ వుత్తరాలు తీస్కోండి సార్!" అన్నాడు రాంబాబు కాళ్ళు పట్టుకుని దీనంగా.

రాంబాబు జాలిపడలేదు.

ఆ వుత్తరాల కట్టలో తన వుత్తరాల కోసం వెదుక్కోవడంలో లీనమైపోయాడు. ఆ తరువాత రోజుల్లో కూడా సింహాచలం రాంబాబుతో చాలా విపత్కర పరిస్థితులు ఎదుర్కొన్నాడు.

పోస్టాఫీసు ఇంకా తెరవకముందే రోజా రాంబాబు అక్కడికి వచ్చి కూర్చునేవాడు.

ముందుగా లోపలికి అడుగు పెట్టే సబ్ పోస్ట్‌మాస్టర్‌కి శాల్యూట్ కొట్టేవాడు.

అయితే ఎస్.పి.ఎమ్. ఆ శాల్యూట్‌ని అందుకునేవాడు కాదు. రాంబాబుని గుర్రుగా చూసి లోపలికి వెళ్ళిపోయేవాడు.

ఆ తరువాత ఎస్.పి.ఎమ్. వెనుకనే లోపలికి అడుగుపెట్టే సింహాచలానికి శాల్యూట్ కొట్టే



వాడు రాంబాబు.

రోజూ ఎస్.పి.ఎమ్.తో పాటు తనని కూడా సమానంగా మన్నించేసే రాంబాబుని చూసి భయపడిపోతుండేవాడు సింహాచలం. తనతో సమానంగా పోస్టమాన్‌కి కూడా నమస్కారాలు పెడుతున్న రాంబాబు వల్ల-ఆ ఎస్.పి.ఎమ్. ఏడ్చుకుని తన వుద్యోగం ఎక్కడ పీకేస్తాడోనని సింహాచలం భయం.

ఒక్కోసారి రాంబాబుకి కట్టల కొద్దీ కథలు తిరిగొచ్చేవి.

అందరికీ వచ్చే వుత్తరాలు ఒకెత్తు!

రాంబాబు కొచ్చే కథల కట్టలు ఒకెత్తు!!

సింహాచలానికి మతిపోయేది.

సింహాచలం బాధ కనిపెట్టిన మిగతా పోస్టు మేన్‌లు-

"ఒక గోతాంకొను సైకిల్ కేరేజ్ మీద కట్టుకో వచ్చు" అని సలహా ఇచ్చారు.

నెల జీతాల వరకూ ఆగి సింహాచలం గోతాంతో పాటు కొబ్బరితాడు కూడా కొన్నాడు.

రాంబాబుకీ విషయం తెలిసి సింహాచలం

వుద్యోగధర్మానికి పొంగిపోయాడు. వెంటనే సింహాచలానికి గోనె డబ్బులు, కొబ్బరితాడు డబ్బులు ఇచ్చేశాడు. ఆపైన టిఫిను, కాఫీ కూడా ఇప్పించాడు.

దాంతో సింహాచలం ప్రాణం తేరుకుంది.

రాంబాబుకి తంతితపాలా శాఖలో ఓ ఫ్రెండున్నాడు. ఆ ఫ్రెండు ద్వారా సింహాచలం పోస్టుని రెగ్యులర్ చేయడానికి ప్రయత్నించాడతడు. సింహాచలం పోస్టు వెంటనే రెగ్యులర్ అయింది. తనకు చేసిన సహాయంపట్ల రాంబాబు ఎడల కృతజ్ఞతతో మెలికలు తిరిగిపోయాడు సింహాచలం. ఆ మెలికలు తిరిగిపోవడమే అతడి కొంపముంచిది పాపం!

"మీరిన్ని కథలు రాస్తారు కదా సార్... ఒక్కటీ అచ్చుకాదేం?" అన్నాడు ఓ రోజు నోరుజారి- అంతే!

రాంబాబు సింహాచలానికి క్లాసు తీసుకున్నాడు.

తన కథలెంత బాగుంటాయో తనే వివరించాడు.

తన శైలి ఎంత బాగుంటుందో తనే పొగుడుకున్నాడు.

పాపం... సింహాచలం ఇరుకున పడిపోయాడు.

తను పంచవలసిన వుత్తరాలు చాలా వున్నాయి. ఇంటికి వెళ్లి భోంచెయ్యాలి! మళ్ళీ ఆఫీసుకి తగలడాలి! సరిగ్గా డ్యూటీ మధ్యలో తగులుకున్నాడు రాంబాబు.

సింహాచలానికి ఓ ఆలోచన తళుక్కుమంది.

రాంబాబుని వదిలించుకోవడానికి ఓ మార్గం తోచింది.

"ఈ నవల చదువుతాను సార్... భోంచేసి, చదివి, పోస్టాఫీసుకి వస్తాను" అన్నాడు బుద్ధితక్కువై.

అంతే!

రాంబాబు మహదానందపడిపోయాడు.

అంతవరకూ తన నవలకాని, కథకాని చదువుతానన్న పెద్దమనిషి ఎవరూ కనిపించలేదు రాంబాబుకి.

వెంటనే తన చేతిలోని తాజా నవల సింహాచలం చేతిలో పెట్టాడు.

మర్నాడు పొద్దున్నే పోస్టాఫీసుకు వెళ్ళి సింహాచలం రాక కోసం ఎదురు చూడసాగాడు... తన నవల గురించి అతడియొక్క అమూల్యమైన అభిప్రాయాన్ని తెలుసుకుంటేగానీ కాఫీ కూడా తాగదలచుకోలేదు రాంబాబు.

కాని...

మధ్యాహ్నం రెండైనా, మూడైనా, నాలుగైనా సింహాచలం పోస్టాఫీసుకు రాలేదు.

ఆ తరువాత కూడా అసలు వుద్యోగానికే రాలేదు.

చూసి చూసి పేపర్లో ప్రకటించారు. "కనుపించుటలేదు" అని ఫొటోతో సహా. అయినా సింహాచలం జాడ తెలియరాలేదు.

"పోస్టుమేన్స్ సమాఖ్య" ఈ విషయమై పెద్ద ఉద్యమం లేవదీసింది.

సింహాచలం ఏమయ్యాడో తెలుసుకోవడానికి పోస్టుమాస్టర్ జనరల్ ఐదుగురు సభ్యులతో ఒక ఎంక్వయిరీ కమిటీని ఏర్పాటుచేశాడు.

వాళ్ళు తిన్నగా విశాఖపట్నం వచ్చి ఎంక్వయిరీ ప్రారంభించారు.

రాంబాబు నవల చదువుతానని తీసుకెళ్లిన తర్వాత సింహాచలం తిరిగి డ్యూటీకి రాలేదని ఆ కమిటీ తేల్చింది.

రాంబాబుని కథలు, నవలలు పోస్టుచెయ్యొద్దని చెప్పేహక్కు తమకు లేదు కాబట్టి– ఈసారి అతడి కథలని బట్వాడా చేయడానికి– అసలు కథలు, నవలలు చదవడంలో ఏ మాత్రం ఇంట్రస్ట్ లేనివాడిని పోస్ట్‌మేన్‌గా సింహాచలం స్థానంలో అపాయింట్ చేశారు. ఆ పోస్టుమానే నారాయణ.

ఇదంతా గుర్తుకొచ్చిన నారాయణ కళ్ళ నుండి అప్రయత్నంగా రెండు కన్నీటి బిందువులు జారి నేలరాలాయి.

"మరి నాకు సెలవిప్పించండి సార్! వస్తాను" అని రాంబాబుతో చెప్పి అక్కడి నుంచి నిష్క్రమించాడు పోస్టుమాన్ నారాయణ.

రాంబాబు తిరిగొచ్చిన తన కథల బస్తాని లోపల పెట్టుకున్నాడు.




తరువాత 'రాధ–లారీ' కథలో క్లైమాక్స్ సీన్ రాయడంలో నిమగ్నుడైపోయాడు.




ఉమెన్స్ కాలేజీ! లేబరేటరీలో జువాలజీక్లాసు సీరియస్‌గా జరుగుతోంది.

జువాలజీ లెక్చరర్ మిసెస్ జోగులాంబగారు ప్రాక్టికల్స్ క్లాసులో "కప్ప– అందలి భాగాలు" గురించి స్టూడెంట్సుకి బోధిస్తున్నారు.

గాజుజాడీలోంచి ఓ కప్పని తీసుకున్నారామె. దానికి క్లోరోఫారం ఇచ్చి, వుడెన్ ప్లాంక్ మీద వెల్లకిలా పడుకోబెట్టి, నాలుగు వైపులా శిలువవేసినట్టుగా కప్ప కాళ్ళలో పిన్నులు గుచ్చారు. కత్తి, కత్తెర్లతో దాని వుదరభాగాన్ని కోశారు. కట్టర్‌తో బోన్సు కట్ చేశారు. అప్పుడు కప్ప గుండెకాయ కనిపించింది. తరువాత నీడిల్‌తో దాని గుండెమీది పెరికార్డియం పొరని తొలగించారు.

లబ్‌డబ్ మంటూ కప్పయొక్క గుండెకాయ సంకోచవ్యాకోచాలు స్టూడెంట్స్‌కి కనిపించాయి.

కప్ప గుండెకాయ చాలా దీనంగా కొట్టుకుంటోంది.

అది మత్తులో ఎంత బాధపడుతోందో ఏమో!

చాలా దీనంగా బాధగా కొట్టుకుంటోంది దాని గుండె!

ఉడెన్ ప్లాంక్ మీద ఏసుప్రభువుకి శిలువవేసినట్టుగా నిస్సహాయంగా పడి వుంది కప్ప.

ఆ దృశ్యం చాలా హృదయవిదారంకంగా వుంది. అయినా ఎవరూ నోరు మెదపటంలేదు.

మోహిని అనే ఓ స్టూడెంటుకి మాత్రం అది దారుణమైన చర్యలా గోచరించింది.

"ఆపండి ఈ ఘోరహింస" అంటూ గట్టిగా అరిచింది తట్టుకోలేక.

చక్రాల్లాంటి కళ్ళు... సంపెంగ నాసిక... గులాబీల బుగ్గలు... గోదావరీ తరంగాల లాంటి నొక్కునొక్కుల జుత్తు... బారెడు జడ... చెవులకు రింగులు... మెడలో ఒంటిపేట గొలుసు... నీలం రంగు శారీ! దాని మీద అదే రంగు మోచేతుల కిందిదాకా దిగి వున్న బ్లవుజూ!... బంగారు మేనిఛాయ... చక్కటి ఆకర్షణీయమైన రూపంతో ఎంతో అందంగా వుంది మోహిని.

"ఏమిటమ్మా... అలా అరిచావు?" అంటూ తెల్లబోయారు మిసెస్ జోగులాంబ.

"లేకపోతే ఏమిటిది మేడమ్? ఓ మూగజీవాన్ని... నోరులేనిదాన్ని అలా పరపర కోసేస్తూ హింసిస్తారా? అదే మిమ్మల్ని కూడా అలా తెగ్గోస్తే మీకెలా వుంటుంది?" అంటూ తీవ్రంగా ప్రశ్నించింది మోహిని.

జోగులాంబగారు మోహినిని ఆశ్చర్యంగా చూశారు.

"చూడు మోహినీ... ఇది జువాలజీ క్లాసు! మనిషి ప్రకృతిలో జీవాలగురించి తెలుసుకోవాలంటే అతడు వాటిని చంపి కోయక తప్పదు. అలా చంపితేనే అతడికి వాటి శరీర నిర్మాణాల గురించి తెలుస్తుంది. తద్వారా అతడు రకరకాల మందులు కనిపెట్టి వాటిని ఆ మూగజీవాలమీద ప్రయోగించి, అవి సత్ఫలితాలనిస్తే-అప్పుడు ఆ మందులని మనిషికి ఏరోగమైనా వస్తే వాడతారు. మానవుడు ఇలా ఎన్నో మూగజీవాలను కోసి మరెన్నో ప్రయోగాలు చేసి– ఈనాడు గుండె మార్పిడి విధానాన్ని కూడా కనిపెట్టాడు. ఇదంతా ఎలా సాధ్యమయింది? ఇలా మూగజీవాలని కోసి ప్రయోగాలు చేసి చూడబట్టే" అంటూ వివరించి చెప్పారామె.

"ఓ... ఫెంటాస్టిక్" అంటూ వేళాకోళంగా చప్పట్లు చరిచింది మోహిని.

"అయితే మనిషి తన శరీర నిర్మాణం గురించి తెలుసుకోవడానికి– ఆ మనిషినే కోయవచ్చుగా!?" అంటూ ఎదురు ప్ర

శ్నించింది.

"అవును... మనిషినీ కోస్తారు! మెడికల్ కాలేజీలో శవాలని కోయడంలేదా?" అన్నారు జోగులాంబ.

"హియర్... హియర్!" అంటూ మళ్ళీ చప్పట్లు చరిచింది మోహిని.

"మనిషి మనిషి గురించి తెలుసుకోవాలంటే చచ్చిన మనిషిని మాత్రమే కోస్తాడు. బతికివున్నవాడిని కోయడు. మరి మీరాతేడాని మూగజీవాలయందు ఎందుకు చూపించడంలేదు. చచ్చిన వాటినే ఎందుకు కోయడంలేదు?" ఆవేశంగా అడిగింది మోహిని.

"కానీ... చనిపోయినవాటి భాగాలు బాగా కుంచించుకుపోయి వుంటాయి వాటి గురించి అంత వివరంగా తెలుసుకోవడానికి వీలుండదు" చెప్పారు జోగులాంబ.

"ఓహో.... చచ్చినవాటి భాగాలయితే కుంచించుకుపోతాయని బతికినవాటిని కోస్తారన్నమాట! మరి చనిపోయిన మనిషి భాగాలు మాత్రం ముడుచుకుపోవా?" అడిగింది మోహిని.

ఆ మాటలకు జోగులాంబ సమాధానం చెప్పలేకపోయారు.

"మీరేం మనుషులండీ మేడమ్! జీవహింస మహాపాపమని మీకు తెలీదా? మనిషి రక్షణ పేరిట ఈ మూగజీవాల్ని చంపడం నేను సహించను. ఈరోజునుంచీ నేను జువాలజీ క్లాసుని వెలివేస్తున్నాను. ఇకనుంచి నేనీక్లాసుకి అటెండ్‌కాను" అంటూ విసురుగా చేతిలోకి పుస్తకాలు తీసుకుని చరచరా బయటకు నడుచుకుంటూ వచ్చేసింది మోహిని.

మిసెస్ జోగులాంబతోసహా మిగతా లేడీ స్టూడెంట్సు అంతా బిత్తరపోయి అలాగే చూస్తూండిపోయారు.

మోహిని ఆ కాలేజీలో ఇంటర్ చదువుతోంది.

ఆమెది చాలా జాలిగుండె. చీమకి, దోమకి, ఆఖరికి నల్లికికూడా ఆమె హానిచెయ్యదు.

రోడ్డుమీద తలదించుకుని నడుచుకుంటూ పోతూంటే- దారిలో చీమ కనిపిస్తేచాలు... తీసి పక్కనపెట్టి మరి నడుస్తుందామె.

రాత్రిళ్ళు నిద్రలో దోమలు కుట్టి రక్తం పీలుస్తూంటే... వాటిని చూసి "పిచ్చి ముండలు" అని జాలిపడుతుందే తప్ప... ఆ దోమలని చంపాలనే ప్రయత్నం చెయ్యదు.

సృష్టిలో వస్తువులు రెండురకాలు.

జీవమున్న వస్తువులు, జీవంలేని వస్తువులు.

మనుషులు, జంతువులు, చెట్లు ఇవన్నీ జీవం గలవి.

రాళ్ళు, రప్పలు, నీరు ఇవన్నీ జీవంలేనివి. అలాగే మనిషి సృష్టించిన యంత్రాలుకూడా జీవంలేనివే. అవి మనిషి నడిపితేనే కదులుతాయి.

కాని,

మోహిని మాత్రం అలా అనుకోదు.

సృష్టిలో జీవమున్నవి, జీవంలేనివి, మనిషి నడిపితే కదిలే యంత్రాలూ— ఇవన్నీ ఆమె దృష్టిలో ఒకటే.

రాళ్ళు, రప్పలు, కొండలు, గుట్టలు, యంత్రాలు— వీటికికూడా జీవం వుందని వాదిస్తుందామె. ఆఖరికి చెట్లు చేమలనుండి వేరుచేసే కాయగూరలు, పువ్వులు, పండ్లు— వాటికి కూడా ప్రాణం వుందనే అంటుంది మోహిని.

అందుకే ఆమె తల్లో పూలు పెట్టుకోదు.

ఇంట్లో తల్లి కాయగూరలు వండితే అసలే ముట్టదు.

ఆఖరికి అన్నంలో మజ్జిగకూడా పోసుకోదామె. మజ్జిగ పోసుకుంటే అందులోని బాక్టీరియా క్రిములు తను అన్నం తింటున్నప్పుడు నోట్లోకి పోయి చచ్చిపోతాయని ఆమె భయం. అందుకే మోహిని కేవలం వుప్పు, నీళ్ళు కలుపుకుని మాత్రమే ఆహారం తీసుకుంటుంది.

మోహిని విపరీత చాదస్తానికి ఇంట్లో ఆమె తల్లి తండ్రి నెత్తీనోరూ కొట్టుకుంటూంటారు.

అలాంటి అత్యద్భుతమైన ఛాదస్తంకల మోహినికి మనసులో ఒకేఒక కోరిక వుంది.

అదే!

తనకున్న జాలి మనస్తత్వాన్ని అర్థం చేసుకునే వ్యక్తిని మాత్రమే ప్రేమించి పెళ్లిచేసుకోవాలని ఆమె ఆశయం.




అది మొదలు మోహిని జువాలజీ క్లాసుకి తప్ప మిగతా క్లాసులకి మాత్రమే అటెండ్ అవసాగింది.

* * *

"విశాలి" పత్రికా కార్యాలయం ముందు రెండుకార్లు ఆగాయి.

ఒకటి ఫియట్, ఇంకొకటి అంబాసిడర్ కార్లు.

ఫియట్‌లోంచి పార్వతీశంగారు, అంబాసిడర్‌లోంచి మాధవరావుగారు దిగారు.

ఇద్దరూ ఒకరినొకరు పలకరించుకున్నారు.

"పాపం... మీ సబ్‌ఎడిటర్ కాంతారావుకి పెచ్చెక్కిందట కదా! చాలా బాధపడ్డాను" అంటూ నొచ్చుకున్నారు పార్వతీశంగారు.

"అవును... పాపం! మీ ఉపసంపాదకుడు సుబ్బారావు రైలుక్రింద పడి ఆత్మహత్యా చేసుకున్నాడని తెలిసి నేనూ చాలా బాధపడ్డాను" అంటూ మాధవరావుగారు కూడా పార్వతీశంగారిని పరామర్శించించారు.

"ఇలా వచ్చారేమిటి?" అని అడిగారు పార్వతీశంగారు.

"ఏముంది? ఆ రచయిత రాంబాబుగాడి కథల దాడిని ఎలాగైనా అరికట్టి మన సాటి సంపాదకులని కాపాడాలని ఆలోచిస్తున్నాను. వాడి రచనలు ఎలా అరికట్టాలో తెలీక ధర్మారావుగారిని సలహా అడుగుదామని ఇలా బయలుదేరి వచ్చాను" చెప్పారు మాధవరావుగారు.

"నేను కూడా అదే ఆలోచనలో వున్నాను. ధర్మారావుగారిని సలహా అడుగుదామనే నేనూ ఇలా వచ్చాను" అన్నారు పార్వతీశంగారు.

"ఆయన మన ఎడిటర్స్ అసోసియేషన్‌కి ప్రెసిడెంటు కదా! ఆ రాంబాబుగాడి కథల బారినుండి తప్పకుండా మన సంపాదకుల ప్రాణాలు కాపాడటానికి ఏదో ఒక దారి చూపక పోరు" ధీమాగా అన్నారు మాధవరావుగారు.

ఆ తరువాత ఇద్దరూ స్ప్రింగ్‌డోర్స్ తెరుచుకుని ధర్మారావుగారి ఆఫీసు గదిలోకి అడుగుపెట్టారు.

ఆ సమయంలో ఆయన తన సిగార్ పొగని గాలిలోకి వలయాలుగా వదులుతూ, శూన్యంలోకి దృక్కులు సారించి ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నారు.

ఆ ధోరణిలో ధర్మారావుగారు తన ఇద్దరు మిత్రుల రాకని గమనించలేదు.

తమ ఉనికిని గుర్తుచేస్తూ చిన్నగా దగ్గారు పార్వతీశంగారు.

ధర్మారావుగారు వులిక్కిపడి ఈ లోకంలోకి వచ్చిపడ్డారు.

స్నేహితులిద్దరినీ చూసి చిరునవ్వుతో పలకరించారు.

పార్వతీశం, మాధవరావు ఆయనకి ఎదురుగావున్న కుర్చీల్లో ఆశీనులయ్యారు.

మొదట ఆ ముగ్గురు మిత్రులూ తమ సబ్‌ఎడిటర్లకి జరిగిన దారుణ ప్రమాదాల గురించి మళ్ళీ పరామర్శించుకున్నారు. కన్నీటి తర్పణాలు విడిచారు.

ఆపైన– "మీరొచ్చిన పనేమిటి?" అని అడిగారు ధర్మారావుగారు.

"మీకు తెలియనిదేముంటుంది ధర్మారావుగారూ? ఆ రాంబాబుగాడి కథలదాడిని ఇకమీదట అయినా ఆపకపోతే మన యావత్ సంపాదకులూ నిహతులయ్యే ప్రమాదం వుంది" అన్నారు పార్వతీశంగారు.

"అప్పుడు పత్రికాఫీసులన్నీ మూతబడిపోతాయి"

"సాహిత్యం కొరవడి చదువుకోవడానికి కథలు, నవలలు లేక పాఠకలోకం గగ్గోలెత్తిపోతుంది"

"అందుకే మీరు మన సంపాదకులకేదన్నా దారి చూపించాలి"

"ఆ రాంబాబుగాడి రచనల దాడిని అరికట్టి మన సంపాదకలోకాన్ని కాపాడుకోవాలి"

ధర్మారావుగారు సాలోచనగా తలపంకించారు.

"అవును... నేనూ అదే ఆలోచిస్తున్నాను. ఆ రాంబాబుగాడి కథల యుద్ధాన్ని ఆపాలంటే అది కేవలం మన ముగ్గురి వలన అయేవనికాదు" అన్నారు.

"అయితే మరెలా?" అన్నారు మాధవరావుగారు.

"ఈ కీడు మన యావత్ సంపాదక ప్ర



పంచానికి దాపురించిందని. కాబట్టి. ఈ విషయమై మన పత్రికా సంపాదకులంతా కలిసి మీటింగ్ పెట్టుకుని చర్చిస్తే బాగుంటుంది'' అన్నారు ధర్మారావుగారు.

''అయితే వెంటనే మీటింగ్ ఏర్పాటు చేయించండి-- చర్చిద్దాము'' అన్నారు పార్వతీశంగారు.

''ఆలస్యం అమృతం విషం. వెంటనే మన తెలుగుదేశంలోని పత్రికాధిపతులందరికీ టెలిగ్రాములు పంపండి'' చెప్పారు మాధవరావుగారు.

''అలాగే... మరో పదినిముషాల్లో టెలిగ్రాములు రెడీ చేయిస్తాను'' అంటూ కుర్చీలోంచి లేచి నిలబడ్డారు ధర్మారావుగారు.

* * *

''ఎడిటర్స్ అసోసియేషన్'' మీటింగ్‌కి తెలుగు సంపాదకులు, జర్నలిస్టులు అందరూ హాజరయారు.

సభ ప్రారంభమయింది.

సంస్థ ప్రెసిడెంటు ధర్మారావుగారు మైక్ ముందుకు వచ్చారు.

''కామ్రేడ్స్... నేడు మనకి అశుభదినం. చాలామంది శుభదినాలకి మాత్రమే మీటింగులు ఏర్పాటుచేసుకుంటారు. అందుకు విరుద్ధంగా మనమీ మీటింగు ఏర్పాటుచేసుకున్నాం. నేనెందుకు మీటింగు ఏర్పాటుచేశానో మీకందరికీ తెలిసిందే! మన సంపాదకుల పాలిట యముడిలా ఓ చెత్త రచయిత పుట్టుకొచ్చాడు. వాడిపేరు రాంబాబని మీకు తెలుసు. వాడి రచనలెలా వుంటాయోకూడా మీకు తెలుసు. వాడు తన రచనలతో మన సంపాదకులని వూచకోతకోస్తున్నాడు. హఠాత్తుగా ఒకరోజు ఆ రాంబాబుగాడి కథ చదువుతూ ఓ ఎడిటర్ సోదరుడు గుండె ఆగి మరణించాడు. మరో ఎడిటర్ సోదరుడు జీవితంమీద విరక్తిచెంది ఆత్మహత్య చేసుకున్నాడు. ఇంకో సోదర సంపాదకుడు మతిచలించి మెంటల్ హాస్పిటల్లో జీవిత సభ్యుడిగా చేరిపోయాడు. అందుకే మనం ఇంక ఆ రాంబాబుగాడి రచనలు వుపేక్షించితే మరి కొంతమంది సంపాదకులు పత్రికాప్రపంచంలో గల్లంతయ్యే ప్రమాదం వుంది. ఆ ప్రమాదం మన దరిదాపులకి రాకుండా వుండాలంటే ఏంచేయాలో మీరే చెప్పండి? ఆ పాపిష్టి రచనలు మన కార్యాలయాలకి రాకుండా ఎలా అరికట్టాలో తగు సలహా మీరే నిర్ణయించండి'' అంటూ స్పీచ్ ముగించి కూర్చున్నారు ధర్మారావుగారు.

వెంటనే సభలోంచి ఓ సబ్‌ఎడిటర్ లేచి వేదిక మీదికి వచ్చాడు.

''సోదర సంపాదకులారా... అందరికీ వందనాలు. మన కార్యాలయాల మీదికి ఆ రచయిత రాంబాబుగాడి రచనల దాడి ప్రారంభమయి సరిగ్గా ఈరోజుకి ఏడాది అయింది. వాడి కథలు చదువుతూండటంవల్ల నాకు అజీర్ణవ్యాధి పట్టుకుంది. నా సోదర సంపాదకుడు మరొకతనికి బ్రాంకైటిస్ సోకింది. ఇంకో సంపాదకునికి కడుపులో శూలవ్యాధి-- ఇలా మన సోదరులందరికీ ఇప్పటికే ఒక్కొక్కరికి ఒక్కొక్క వ్యాధి పట్టుకుంది. ఇంకా రాంబాబుగాడి రచనలు మనం చదవటం తటస్థించిందంటే మనమంతా కూడా శ్మశానంలో చోటు చూసుకోక తప్పదు. అందుకే నాకొక ఐడియా వచ్చింది. ఆ రాంబాబుగాడిని మనం చితకతన్నేసి, గుండుగీసి, సున్నంబొట్లు పెట్టి, గాడిదమీద వూరేగించి, ఇంకెప్పుడూ మన పత్రికా కార్యాలయాలకి కథలు పంపవద్దని హెచ్చరిద్దాము. ఇదే నాకుతోచిన సలహా'' అని మైక్‌లో చెప్పి స్టేజి దిగిపోయాడు ఆ సంపాదకుడు.

వెంటనే మరో ఉపసంపాదకుడు లేచి మైక్ ముందుకు వచ్చాడు. ''అలాచేస్తే రాంబాబు పోలీసు కేసు పెడతాడు. కాబట్టి రాంబాబుకి దేహశుద్ధి చేయాలనుకోవటం విరమించుకుంటే మంచిది'' అని చెప్పాడు.

ఇంకో సంపాదకుడు మైక్ పట్టుకుని-- ''రాంబాబుగాడిమీద మనమే పోలీస్ రిపోర్ట్ ఇస్తే సరి... అప్పుడు వాడే కథలు పంపటం మానేస్తాడు'' అని చెప్పాడు.

మరో సంపాదకుడు మైక్‌లో నోరుపెట్టి-- ''వాడి కథలవల్లే మన సంపాదకులు చచ్చిపోయారని సాక్ష్యం ఏమీలేదు. కాబట్టి పోలీసులు మనల్ని కాపాడలేరు'' అన్నాడు.

''అయితే మరెలా?''





గక్షించుకోవడం?''

''ఎలా?''

''ఎలా?''

సంపాదక సభ్యులలో కలకలం చెలరేగింది.

గుసగుసలుగా మాట్లాడుకోసాగారు.

ఎడిటర్లంతా కలిసి ఎంతగా ఆలోచించినా ఎవరికీ ఎలాంటి ఐడియా తట్టలేదు.

ఇంతలో ఓ వృద్ధ సంపాదకుడు లేచి మైక్ ముందుకు వచ్చాడు.

''మైడియర్ ఎల్డర్ అండ్ యంగర్ బ్రదర్స్! రాంబాబుగాడి రచనల దాడిని శాశ్వతంగా ఆపాలనే మన ప్రయత్నాన్ని ప్రస్తుతానికి పక్కనపెట్టండి. మరి కొద్దిరోజుల్లో మనకి మరో పెద్ద ఆపద రాబోతోంది. అదే మనం సంక్రాంతికి నిర్వహించే పోటీలకి-- ఒక్కొక్క పత్రిక్కి వందేసి కథల చొప్పున పంపిస్తాడా త్రాష్టుడు. సంక్రాంతిపండగ చాలా దగ్గరలో వుంది. ఈసారి వాడు పోటీకి ఇంకా ఎక్కువ కథలే పంపొచ్చు! మన తెలుగుదేశంలో వున్న చిన్న పెద్ద పత్రికలన్నింటికి ఒక్క రాంబాబు కథలే వందల సంఖ్యలో వస్తాయి. అవన్నీ పరిశీలించి తట్టుకోవాలంటే మనతరమా? అందుకే శాశ్వతంగా వాడి కథల బారినుండి తప్పించుకునే ఉపాయాన్ని పక్కనపెట్టి ప్రస్తుత తరుణోపాయాన్ని ఆలోచించండి'' అంటూ అందరినీ హెచ్చరించాడా వృద్ధ సంపాదకుడు.

సంక్రాంతి పండగ కథల పోటీ అనేసరికి అందరికీ గుండెల్లో రైళ్ళు పరిగెత్తాయి.

''అయితే ప్రస్తుతం ఈ విపత్తునుండి మనలని మనం కాపాడుకోవటం ఎలా?'' సభలో నుండి ఓ సంపాదకుడు గట్టిగా అరిచాడు.

చాలాసేపు వాళ్ళమధ్య తర్జనభర్జనలు జరిగాయి.

కథల పోటీల్లో రచయిత పేరు, ఎడ్రసు కేవలం హామీ పత్రం మీద మాత్రమే రాయాలని ప్రకటనలు ఇద్దామనుకున్నారు. అలాచేస్తే కథలకి నంబర్లు వేసి హామీ పత్రాలు తొలగించేశాక ఏవి రాంబాబు కథలో గుర్తుపట్టడానికి వీలుండదు. అప్పుడా కథలని జడ్జీలకి ఇచ్చి చేతులు దులుపుకుందామనుకున్నారా ఎడిటర్లంతా! ఈ సులభపద్ధతి వల్ల రాంబాబు కూడా కాపాడుకోవచ్చునని అనుకున్నారు.

చివరికి ఆ మీటింగులో కేవలం తాత్కాలికంగా మాత్రమే రాంబాబు కథల బారినుండి తప్పించుకోవడానికి ప్లాను సిద్ధంచేయబడింది.

శాశ్వతంగా వాడి కథల దాడినుండి తమని కాపాడుకోవడానికి మరోమారు సంక్రాంతి పండగ వెళ్ళాక మీటింగు ఏర్పాటుచేసుకుందామనుకున్నారు.

ఎడిటర్లు అనుకున్నట్లే సంక్రాంతి పండగ కథల పోటీలకి ఒక్కో పత్రికకి రెండొందల కథల చొప్పున పంపించాడు రాంబాబు.

ఆ పత్రికల సంపాదకులు రాంబాబు కథల హామీ పత్రాలను ఒక పక్కనపెట్టి, కథలకి నంబర్లు వేసి, మిగతా రచయితల కథలతోపాటు అతడి కథలని కూడా కలిపేసి జడ్జీలకి ఇచ్చేశారు.

ఆ జడ్జీల్లో ఒకరు రామనాథంగారు. హైకోర్టులో పనిచేసి రిటైర్ అయ్యారు రామనాథంగారు. ఆయన మంచివక్త. కథలు, నవలలు రాసి ప్రముఖ రచయితగా కూడా గణతికెక్కారు.

టిఫిను కాఫీ సేవించి, తీరికగా పత్రికలవాళ్ళిచ్చిన సంక్రాంతి పోటీ కథలు ముందేసుకుని కూర్చున్నారు- ఓ రోజు రామనాథంగారు.

రెండుమూడు కథలు మామూలుగా చదివి పక్కనపెట్టేశారు.

నాలుగో కథ రాంబాబుదని ఆయనకు తెలియదు. ఆ కథ ఆయనని వేగంగా చదివింపసాగింది. ఎంతో కుతూహలంగా ఆ కథ చదవసాగారు రామనాథంగారు.

ఉన్నట్టుండి రామనాథంగారి శరీరంలో ఏవో ప్రకంపనలు కలగసాగాయి. బుర్రలో టెలిగ్రాఫ్ టెలిప్రింటర్ శబ్దాలు వినిపించసాగాయి. కడుపులో గుడగుడమని చప్పుళ్ళు ప్రారంభమయ్యాయి.

లేచి లెట్రిన్‌కి వెళ్ళొచ్చారు.

మళ్ళీ రాంబాబు కథ ముందేసుకుని కూర్చున్నారు.

ఆయిన గుండె వేగంగా కొట్టుకోవడం ప్రారంభించింది.

కాళ్ళూచేతులు వణకడం ప్రారంభమయింది.

కాని, అక్షరాలు కళ్ళని అయస్కాంతంలా ఆకట్టుకుని లాగుతున్నాయి.

రాంబాబు కథలలోని టెక్నిక్ అదే! చదవకూడదనుకున్నా, పిచ్చెక్కుతుందని తెలిసినా చదవాలనిపిస్తుంది.

పట్టాల మీది రైలు చక్రాల్లా ఆయన కళ్ళు అక్షరాల లైన్లమీద పరుగెడుతున్నాయి.

ఆ కథపేరు 'ఆవకాయకూ మనసుంది' టూకీగా ఆ కథ థీమ్ ఏమిటంటే--

స్వర్గలోకంలో వున్న విష్ణుమూర్తికి ఆవకాయ పచ్చడి తినాలని కోరిక పుడుతుంది. కారు వేసుకుని భూలోకానికి వస్తాడు. పేదరాశి పెద్దమ్మ ఇంట్లో బస చేస్తాడు. తనకి ఆవకాయ పచ్చడి తినాలని వుందని ఆ పెద్దమ్మతో చెబుతాడు. పెద్దమ్మ ఆవకాయ చేసి పెడుతుంది. విష్ణుమూర్తి ఆనందంగా పచ్చడి అన్నంలో కలుపుకుని, ఆవకాయ ముక్కని ముద్దలో నంజుకోబోతాడు. అప్పుడు ఆ ఆవకాయ ముక్క 'ఓ విష్ణుదేవా! నువ్వు నాకు జన్మనిచ్చావు! జీవం పోశావు. అలాంటిది సృష్టించిన నువ్వే నన్ను భక్షించడం న్యాయమా?'' అని అడుగుతుంది పరిపరి విధాల ప్రార్థిస్తుంది. తనని అన్నం ముద్దలో నంజుకోవద్దని ఏడ్చిమొత్తుకుంటుంది. విష్ణుమూర్తి దాని దీనాలాపనలని నిర్లక్ష్యం చేసి ఆవకాయ ముక్కని నోట్లోవేసుకుని మింగేస్తాడు. అతడి కడుపులోకి వెళ్ళిపోయిన ఆవకాయలో ప్రతీకారజ్వాల రగులుతుంది. ఆ వెంటనే విష్ణువు కడుపులో గుడగుడలు రగులుస్తుంది. విష్ణుమూర్తికి విరోచనాలు పట్టుకుంటాయి. ఆ దెబ్బతో విష్ణుదేవుడు ఆవకాయ ముక్కని బయటికి కక్కేసి, కారులో స్వర్గలోకం పారిపోతాడు.

-ఇదీ ఆ కథ థీమ్!

రామనాథంగారు ఆ కథ పూర్తిగా చదివేసేరికి మరోసారి విరోచనం అయింది. ఆ తర్వాత గుండె ఆగిపోయింది.

పాపం... ఆయిన ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయి. నిస్తేజ్తంగా పక్కకి ఒరిగిపోయారు.

అదే సమయంలో రామనాథంగారి మూడేళ్ళ మనవరాలు 'ఉష' అక్కడికొచ్చి ఆయన చేతిలో ఉన్న రాంబాబు కథ కాగితాలని తీసింది- పడవ చేసి ఆడుకుందామని. తక్షణం ఆ అమ్మాయికి ఇన్ఫెక్షన్ వచ్చి వాంతులు ప్రారంభమయ్యాయి.

అదే సమయంలో--

వేరు వేరు ప్రదేశాల్లో వేరు వేరు జడ్జీలు రాంబాబు పోటీ కథలని పరిశీలిస్తున్నారు.

అతడి కథలు చదువుతూ ఓ జడ్జీ ఉత్తిపుణ్యానికి బావురుమని ఏడ్చేశారు.

ఇంకో జడ్జి పిచ్చిగా జుత్తుపీక్కుని వెర్రిగా నవ్వాడు.

మరో జడ్జి ఇల్లంతా పరిగెడుతూ పిల్లిమొగ్గలు వేశాడు.

మరో ఆసామీకి ఏమీ పాలుపోక వంటగదిలోకి వెళ్ళి-- పొయ్యి మీద పడుతున్న వేడి వేడి ఎసరు నెత్తిమీద దిమ్మరించుకున్నాడు.

ఇంకో పెద్దమనిషి ఉత్తపుణ్యానికి పిల్లల వీపులు వాయగొట్టేశాడు.

రాంబాబు కథలు పరిశీలిస్తున్న జడ్జీలందరికీ ఇలా రకరకాల అనుభవాలు ఎదురయ్యాయి.

ఆ జడ్జి ఇళ్ళలో వున్న బంధుజనావళికి ఏమీ అంతుపట్టక, వాళ్ళు జడ్జీల చేతుల్లోవున్న కథలని కొద్దికొద్దిగా చదివారు.

అంతే!

ఆ బంధుజనావళికి ఇది సంపాదకులు పన్నిన కుట్ర అని తెలిసిపోయింది.

వెంటనే జడ్జీల పెళ్ళాలు, పిల్లలు, సోదరులు, బావమరుదులు, మేనమామలు పత్రికా కార్యాలయాల మీద దాడిచేశారు.

రాంబాబు కథలు సంపాదకుల మొఖాని విసిరికొట్టారు.

ఇంకెప్పుడూ పోటీ కథల ఎంపికకి కథలు తమ ఇళ్ళకు పంపవద్దని. అలా పంపారంటే-- మీ పత్రికా కార్యాలయాలన్నీ తగలబెడతామని వార్నింగిచ్చి వెళ్ళిపోయారు.

పత్రికలన్నీ మరో మార్గంలేక సంక్రాంతి

 

కథల కాటల్ని కొన్సల చేసుకున్నాయి.

★ ★ ★

మళ్ళీ సంపాదకుల సభ జరిగింది.

సంక్రాంతి కథల పోటీ బెడిసికొట్టేసరికి వాళ్ళకి ఏం చేయాలో పాలుపోలేదు. రాంబాబు కథలు తిప్పి పంపేస్తే-- తిరిగివాడు మళ్ళీ అన్ని కథలనీ సాధారణ ప్రచురణకు తమకే తిప్పి పంపిస్తాడు.

ఇప్పుడెలా?

ఎడిటర్‌లంతా దీర్ఘాలోచనలో మునిగిపోయారు.

తర్జనభర్జనలు ప్రారంభమయ్యాయి.

''ఒకవేళ ఆ రాంబాబుగాడు కేవలం అచ్చులో ఓసారి వాడి పేరు చూసుకోవాలని మాత్రమే ఇలా రచనలు చేస్తున్నాడేమో?'' అంటూ ఓ సంపాదకుడు అభిప్రాయం వెలిబుచ్చాడు.

''అవును... అలా అయివుండవచ్చు'' మరో ఎడిటర్ ఆ సంపాదకుని అభిప్రాయాన్ని బలపరిచాడు.

''అయితే వాడి రచనలు ఒకటో రెండో వేసిచూద్దాం. తరువాత వాడు కథలు పంపడం మానేయొచ్చు'' అన్నాడింకో సంపాదకుడు.

సంపాదకులంతా తలలూపారు.

''నేను వాడిదో కథ మా పత్రికలో వేసి చూస్తాను'' అన్నారు ధర్మారావుగారు.

''నేను కూడా వాడి కథ ఒకటి వేస్తాను'' అన్నారు పార్వతీశంగారు.

''నేనూ ట్రయిల్‌కోసం వాడి రచన ఒకటి వేస్తాను'' అన్నారు మాధవరావుగారు.

★ ★ ★

'విశాలి', 'సౌజన్య', 'కోయిల' పత్రికలలో రాంబాబు కథలు మూడు ప్రచురించారు.

'మిరపకాయకూ మనసుంది'

'జెర్రి నవ్వింది'

'కుక్క ఏడ్చింది'

--ఇవీ ఆ మూడు పత్రికలలో ప్రచురితమైన మూడు కథల హెడ్డింగులూను.

 

పత్రికలు మార్కెట్లోకి విడుదలయ్యాయి.

అంతే!

పాఠకలోకం నలుమూలలనుండి ఆ కథల మీద ఉత్తరాల పరంపరలొచ్చి పడ్డాయి.

ఆ ఉత్తరాల నిండా అలాంటి కథలు ప్రచురించినందుకు ఆ ముగ్గురి చీఫ్ ఎడిటర్లని బండబూతులు తిడుతూ రాశారు పాఠకులు.

అంతేకాదు--

''విశాలి'' వారపత్రికలో ప్రచురించిన 'మిరపకాయకూ మనసుంది' కథ చదువుతుంటే తన భార్యకు అబార్షన్ అయిందని, ఏడు నెలల గర్భం పోయిందని-- అందుకు కారణం ఆ కథ ప్రచురించిన 'విశాలి' పత్రికేనని, కాబట్టి లక్ష రూపాయలు నష్టపరిహారం చెల్లించమని చింతాకుల శ్రీనివాసరావు అనే పాఠకుడు లాయర్ నోటీసు తగిలించాడు.

'సౌజన్య' మాసపత్రికలో ప్రచురితమైన 'జెర్రి నవ్వింది' అనే కథ చదువుతూ తన బామ్మ పక్షవాతం వచ్చి పడిపోయిందని బూతుల బాబూరావు అనే పాఠకుడు ఆ పత్రిక మీద యాభైవేలకు దావావేశాడు.

'కోయిల' పత్రికలోపడిన 'కుక్క ఏడ్చింది' కథ చదువుతూంటే తన భర్తకు రాబిస్ వ్యాధి సోకి మరణించాడని పాపాయమ్మ అనే మహిళా పాఠకురాలు, ఆ పత్రిక మీద రెండు లక్షలకు దావావేసింది.

ఆ మూడు లాయర్ నోటీసులు చూసి ధర్మారావుగారు, పార్వతీశంగారు, మాధవరావుగారు వాళ్ళ కార్యాలయాల్లో కూర్చుని లబోదిబోమని గుండెలు బాదుకున్నారు. సరిగ్గా అదే సమయంలో ''మేం మీ పత్రికాభిమానులం'' అని చెప్పుకుని కొంతమంది స్థానిక పాఠకులు ఆ మూడు పత్రికాఫీసుల్లోకి జొరబడ్డారు.

రివాల్వింగ్ ఛెయిర్లలో కూర్చుని గుండెలు బాదుకుంటున్న ఆ ముగ్గురు చీఫ్ ఎడిటర్లని పట్టుకుని పొన్నుకర్రలతో అదే పనిగా బాదేశారా పాఠకులు. ''మళ్ళీ ఎప్పుడైనా ఇలాంటి పరమ బేవార్సు కథలు ప్రచురించారంటే ఈసారి మీ కీళ్ళు విరిచేస్తాం'' అని వార్నింగిచ్చి వెళ్ళిపోయారు వాళ్ళు.

ఆ మర్నాడే రాంబాబు మరో వంద కథలు పోస్టులో పత్రికలకు పంపించాడు.

ర్రో మని నెత్తీ నోరూకొట్టుకున్నారు.



4

మళ్ళీ ఆరోజు ఎడిటర్స్ అసోసియేషన్ మీటింగు ఏర్పాటు చేసుకుంది.

రాంబాబు కేవలం అచ్చులో ఓసారి మాత్రమే తన పేరు చూసుకుని రచనలుచేయడం మానేసే రచయితకాడని సంపాదకులకి అర్థమైపోయింది. అతడికి కీర్తికాంక్ష చాలా వుందని-- దానికోసం రాంబాబు ఎన్ని కథలయినా పంపి సంపాదకులని చంపకమానడని వాళ్ళు తెలుసుకున్నారు.

రాంబాబు కీర్తికాంక్షని ఆపడమెలా?

ఎలా...?

మీటింగులో మళ్ళీ బుర్రలు వేగలగొట్టుకున్నారు సంపాదకులు. చివరికి ధర్మారావుగారికి ఒక ఆలోచన తట్టింది.

"కామ్రేడ్స్... ఆ రాంబాబుగాడికి మనమంతా ఒక వినతిపత్రం పంపించుదాం. ఆ లేఖలో రాంబాబు కథలవల్ల మనకి ఎలాంటి కష్టనష్టాలు జరిగాయో రాంబాబుకి తెలియబరుద్దాం. ఆ తరువాత రాంబాబుని దీనంగా ప్రార్థిస్తూ కథలు పంపొద్దని ఆ లేఖలో పేర్కొందాం. లేఖ చివర్న మన అందరి సంతకాలు చేద్దాం. ఆ లేఖ చదివాక అయినా రాంబాబుగాడి మనసు కరగకపోదు. అంతేకాదు వాడికి చీమునెత్తురు వుంటే సిగ్గుతో చచ్చి మనకి అసలు కథలు పంపడు... కలంజోలికి పోడు" అని చెప్పారాయన.

ఆ సలహా అందరికీ నచ్చింది.

"రైటో" అంటే "రైటో" అనుకున్నారు.

తరువాత ధర్మారావుగారు రాంబాబుకి ఓ వినతిపత్రం తయారుచేశారు. దానిమీద మిగి

వాళ్ళ సంతకాల కింద వాళ్ళ పత్రికల రబ్బరు స్టాంపులు కూడా వేశారు.

* * *

మోహిని వూహాలోకాలలో తేలిపోతోంది. కలల కౌగిళ్ళలో సోలిపోతోంది...

ఆమె కళ్ళముందు రాంబాబు కథలే కదులుతున్నాయి. ఆ పాత్రలే ఆమె కళ్ళముందు నాట్యంచేస్తున్నాయి. "మోహినీ... మోహినీ..." అంటూ ఆ కథలు ఆమెని పలకరిస్తున్నాయి.

'విశాలి', 'సౌజన్య', 'కోయిల' పత్రికలలో ప్రచురితమైన రాంబాబు మూడు కథలూ మోహిని చదివింది. వెంటనే ఆమెకి తెలీకుండానే రాంబాబుకి మనసిచ్చేసింది.

'రాంబాబుగారు ఆ మూడు కథలూ ఎంత అద్భుతంగా రాశారు' అనుకుంది. ఆమె అలా అనుకోవడం ఇది వెయ్యోసారి.

ఆమె ఆలోచనలు ఆ మూడుకథల చుట్టూ పరిభ్రమిస్తున్నాయి.

'మిరపకాయకూ మనసుంది' కథ నిజంగా ఆమె హృదయాన్ని ఆకట్టుకుంది.

ఆ కథ థీమ్ మోహిని మదిలో మెదిలింది.

ఓ వంకాయ, మిరపకాయ ఎంతో స్నేహంగా వుంటాయి. ఓరోజు వంకాయ తన తల్లి చెట్టు నుండి కాలు జారిపడిపోతుంది. పక్కనే వున్న మిరపకాయ తాను తల్లి చెట్టునుండి కిందకి దూకేస్తుంది. వంకాయకింద పడేసమయంలో దానికి దెబ్బ తగిలి ముచ్చిక విరిగిపోతుంది. ముచ్చిక లేక వంకాయ నడవలేకపోతుంది. తిరిగి తన తల్లి చెట్టుని చేరుకోలేక దారుణంగా విలపిస్తూంటుంది. అప్పుడు పచ్చిమిరపకాయ తన తొడిమను వంకాయకి త్యాగంచేస్తుంది.

-ఎంత మంచి థీమ్!

తనలాగే రచయిత కాయగూరలని ప్రేమిస్తాడన్నమాట. వాటికి జీవమూ, మనసూ వుంటాయని నమ్ముతాడన్నమాట. నిజంగా వంకాయ విషయంలో పచ్చిమిరపకాయ చేసిన త్యాగం ఎంత గొప్పది.

పరవశించిపోయింది మోహిని.

మళ్ళీ ఆమె మదిలో 'జెర్రి నవ్వింది' కథ థీమ్ మెదిలింది.

ఓ మనిషీ, ఓ జెర్రీ చాలా స్నేహంగా వుంటారు. జెర్రిదగ్గర బోలెడు డబ్బుంటుంది. ఆ డబ్బు కాజేయాలని మనిషి పన్నాగం పన్నుతాడు. జెర్రి ఇంట్లో నిద్రపోతుండగా ఆ మనిషి దాని డబ్బు దోచుకుంటాడు. తరువాత దానిని కర్రతో చంపేయబోతాడు. అదేసమయంలో ఓ పాము ఆ మనిషిని కాటువేసి చంపేస్తుంది. అప్పుడు జెర్రికి మెలకువవచ్చి ఆ దృశ్యం చూసి ఫక్కుమని నవ్వుతుంది.

ఆ రాంబాబుగారు ఈ కథని హృదయానికి హత్తుకుపోయేలా ఎంత బాగా చిత్రించారు.

మూగజీవాలని కూడా చూడకుండా జీవహింసచేసే ఈ మనిషి... తన స్వార్థంకోసం వాటిని సదా బలిపెట్టే ఈ మనిషి దుష్టబుద్ధిని ఎంత బాగా హృదయానికి హత్తుకుపోయేలా చెప్పారు! నిజమే... తన అభివృద్ధికోసం, తన ఆరోగ్యాన్ని బాగుచేసుకోవడంకోసం - రకరకాల మెడిసన్స్ కనిపెట్టి, వాటిని మూగజీవాలమీద ప్రయోగిస్తూ, వాటిని చంపుతూ అనుక్షణం జీవహింసచేసే ఈ మనిషిమీద ఈ నోరులేని జీవాలన్నీ తిరుగుబాటు చేస్తే బాగుండును.

ఆవేశపడింది మోహిని!

ఇంత మంచి కథ రాసినందుకు హాట్సాఫ్ టూ రాంబాబు అని అనుకుంది.

ఆ తరువాత ఆమె మదిలో 'కోయిల' పత్రికలో ప్రచురితమైన 'కుక్క ఏడ్చింది' కథ థీమ్ మెదిలింది.

ఓ కుక్క వుంటుంది. దానికో యజమాని వుంటాడు. వాడు రోజూ దానికి ఆహారంగా ఎముకలు, మాంసం పెడుతుంటాడు. అయితే ఆ కుక్క జీవహింస మహాపాపమని యజమానికి బోధిస్తుంది. మేకలని, గొర్రెలని చంపొద్దని చెబుతుంది. కాని యజమాని కుక్క మాట వినడు. తను రోజూ మాంసం తింటూ కుక్కకి కూడా మాంసాహారమే పెడుతుంటాడు. కాని, ఆ కుక్క తను మాంసం తిననని, తనకి సాంబారన్నం పెట్టమని అడుగుతుంది. యజమాని వినడు. అప్పుడు కుక్క దుఃఖంలోకి చూసి "నాకు సాంబారన్నం పెట్టకుండా కేవలం మాంసాహారం పెట్టే మా యజమాని గొంతుక్కి చికెన్‌బిరియానీలోని కోడిఎముక అడ్డంపడి వాడు చచ్చేలా చేయి భగవంతుడా!" అని ఏడుస్తూ దేవుడిని ప్రార్థిస్తుంది.

జంతువులకూ జాలి మనసుంటుందని ఈ కథద్వారా ఎంత చక్కటి సందేశం అందించారో రచయిత. అలా ఆ మూడు కథల థీమ్‌లనీ మదిలో తలుచుకుంటూ అవ్యక్తమైన ఆనందానుభూతిని అనుభవిస్తోంది మోహిని.

ఆమె గుండె "లబ్‌డబ్" శబ్దాలు చేయడం మానేసి "రాంబాబూ... రాంబాబూ..." అంటూ కొట్టుకుంటోంది. "ప్రేమా... ప్రేమా..." అంటూ గోలచేస్తోంది.

తాపాన్ని భరించలేకపోతోందామె తనువు!

లేచి వెళ్లి రెండుసార్లు చన్నీటిస్నానం చేసి వచ్చింది.

ఇక హృదయతాపాన్ని ఆపుకోలేక-

కలం, కాగితం చేతిలోకి తీసుకుంది. 'విశాలి' మాసపత్రికలో ప్రచురితమైన రాంబాబు కథకింద ప్రచురితమైన ఎడ్రసుకి ఓ సుదీర్ఘమైన ప్రేమలేఖ రాయడం ప్రారంభించింది.

★ ★ ★

ఆరోజే పత్రికలనుంచి తిరిగొచ్చిన కథలనీ, ఓ రిజిస్టర్ ఉత్తరాన్నీ రాంబాబుకి భద్రంగా రిక్షాలో తీసుకొచ్చి అందించి వెళ్ళిపోయాడు పోస్టుమాన్ నారాయణ.

రాంబాబు ఆ రిజిస్టర్‌లెటర్ ఏదో ఇంటిమేషన్ అనుకున్నాడు.

ఆనందంగా కవరు చింపి ఉత్తరం చదవసాగాడు.

అతడి ముఖం కళతప్పింది. రంగులు మారాయి.

పొగరుగా తలని తొండలా పైకెగరేశాడు. కోడిలా "కొక్కొరోకో" అని కూత పెట్టాడు. కుక్కలా కోపంగా "భౌ! భౌ! భౌ!"మని అరిచాడు.

రాంబాబు కథలవల్ల సంపాదకులు ఎలాంటి కష్టనష్టాలని ఎదుర్కొంటున్నారో, ఎంతమంది సంపాదకులు ప్రాణాలు పోగొట్టుకున్నారో తెలియజేస్తూ - ఇకనుంచి రాంబాబు




పత్రికలకు కథలు పంపొద్దని సంపాదకులు అతడికి పంపుకున్న వినతిపత్రమది.

కసిగా కుంగ్‌ఫూ, కరాటేషాట్‌లా ''ఆ...ఈ...వూ...ఆ...'' అంటూ గది దద్దరిల్లిపోయేలా పెద్ద పెద్ద శబ్దాలుచేశాడు రాంబాబు.

అతడి కనుబొమలు ముడుచుకున్నాయి.

పెదాలు అల్లల్లాడాయి.

సంపాదకులు తన కథలని అర్థంచేసుకునే స్థాయికి ఎదగలేదు.

అసలు వాళ్ళకి సాహిత్యం అంటే ఏమిటో తెలీదు.

అందుకే తన కథలు చదివి, ఓర్వలేని గుణంతో, తనని కథలు పంపొద్దని అసూయతో ఈ లేఖ రాశారు.

తను ఎక్కడ పైకి వచ్చేస్తాడోనని ఈ ఎడిటర్ల ఏడుపు.

అవును... అదే అయివుంటుంది.

అందుకే ఈ లేఖ రాసి వుంటారు.

రాంబాబు ఆ వుత్తరం చదివి ఓ అభిప్రాయానికి వచ్చేశాడు.

ఈ విషయమై సంపాదకులను ముఖాముఖీ కలుసుకుని సంగతేమిటో తేల్చేసుకోవాలనుకున్నాడు. వెంటనే ఆ సాయంత్రమే హైదరాబాదు వెళ్ళే ఎక్స్‌ప్రెస్ ఎక్కేశాడు.

* * *

రాంబాబు స్టేషన్లో ట్రెయిన్ దిగినప్పటి నుంచి ఎక్కడచూసినా వుర్దూయే వినిపిస్తోంది. హైదరాబాదు నగరానికి అతను రావడం ఇదే మొదటిసారి.

రాంబాబు జోరుగా అడుగులువేస్తున్నాడు.

రాత్రంతా ఆలోచనలతో నిద్రలేదేమో...కళ్ళు ఎర్రబడి వున్నాయి. కోపంతో కాబోలు... ముక్కుపుటలు చివర చెమటపట్టింది.

అతను వేగంగా నడుస్తూంటే భుజంమీది ఎయిర్‌బేగ్ గిజగిజా గింజుకుంటోంది.

ఎంత అవమానం!

ఎంత అన్యాయం!!

ఎంతో గొప్పగా, మరెంతో అర్థవంతంగా రచనలుచేసే తనలాంటి మంచి రచయితకు సంపాదకులు అలాంటి వుత్తరం రాస్తారా!

తలుచుకుంటుంటే రాంబాబుకి వుద్రేకంతో వొళ్ళు వేడెక్కిపోతోంది.

ఆదరాబాదరా నగరంలో ఏ గూడా ఎక్కడుందో అతడికి తెలీదు. ఎవడినడిగినా అతడి భాష తెలీనట్టు చూస్తున్నాడు. పైగా రాంబాబును చూసి ఎవరో ఖరీదైన బిచ్చగాడనుకుని ''ఆగే జావ్... ఆగే జావ్'' అంటున్నారు.

రాంబాబుకి ఆదరాబాదరా నగరం తెలుగు దేశంలో వున్నట్టు తోచలేదు. ఏ ఇరాన్‌లోనో, ఇరాక్‌లోనో వున్న నగరంలా తోచింది

అతికష్టంమీద ఓ గూడురిక్షా పట్టుకుని 'విశాలి' వారపత్రికా కార్యాలయం ముందు దిగాడు.

ఓ గల్లీలో మురికిగుంటల అవతల వుంది ఆ పత్రికా కార్యాలయం!

లోపలికి వెళ్ళబోయాడు రాంబాబు.

కాని, గుమ్మంలోని ఓ పహిల్వాన్ అతడిని అడ్డేశాడు.

స్థానిక పాఠకులు 'విశాలి' వారపత్రిక చీఫ్ ఎడిటర్ ధర్మారావు గారిని మొన్ననే రాంబాబు కథలు వేసినందుకు దేహశుద్ధి చేశారు. అందుచేత ఆయన ముందు జాగ్రత్తకోసం ఓ పహిల్వాన్‌ని అక్కడ నియమించుకున్నాడు.

పహిల్వాన్ రాంబాబుని అడ్డేసరికి అతడేమీ చేయలేకపోయాడు.

ఆఫీసుబయటే ఓపిగ్గా కూర్చున్నాడు.

ఇంతలో ఓ కుర్రాడు పత్రికా కార్యాలయంలోంచి బయటకి వచ్చాడు.

అతడిని సబ్‌ఎడిటర్‌గా గుర్తించి రాంబాబు ఆ కుర్రాడి వెంటబడ్డాడు.

''సార్... మీరు 'విశాలి'లో పనిచేస్తున్నారా?'' అని అడిగాడు.

కాని, ఆ కుర్రాడు వెనక్కి తిరిగి చూడలేదు. కనీసం తలపైకి ఎత్తనైనా ఎత్తలేదు.

పోగా - ఆ కుర్రాడికి పట్టుమని పంథొమ్మిదేళ్ళు వుంటాయో లేదో కాని, పది సంవత్సరాల నుండి సినీజగత్తులో నంబర్‌వన్ హీరోలా వెలిగిపోతున్నవాడిలా భుజాలెగరేశాడు.

''నేరాస్తే పద్యం నేకూస్తే గద్యం'' అన్నట్టు ఆ కుర్రాడు కనురెప్పలు నాలుగోవంతు ఎత్తి

నడక స్లోచేశాడు.

తన ప్రశ్నకి అదే సమాధానంలా భావించాడు రాంబాబు.

"మీ పేరేంటి సార్?" అని అడిగాడు.

"గిరీశం" స్టయిల్‌గా చెప్పాడు ఆ కుర్రాడు.

"మీరేం చేస్తారు సార్?" మరో ప్రశ్న అడిగాడు రాంబాబు.

"కథల సెక్షన్!" అన్నాడు కుర్రాడు క్లుప్తంగా.

రాంబాబుకి మహదానందమైపోయింది.

'చిట్టీచిలకమ్మా' కథ చదివారా సార్?" అడిగాడు రాంబాబు.

"కథా? అదేదో పాటనుకుంటానే?" అన్నాడు కుర్రాడు.

అప్పటికి వాళ్లిద్దరూ నడుచుకుంటూ ఓ ఇరానీ రెస్టారెంటు ముందుకు వచ్చారు.

"కాస్త టీ తాగుదాం... రండిసార్" అన్నాడు రాంబాబు.

"ఓ! మీఇష్టం... చేసేదేముంది..." అన్నట్టు ఆ కుర్రాడు భుజాలెగరేసి-రాంబాబుని కేవలం కరుణించే దృష్టితో రెస్టారెంట్‌లోకి నడిచాడు.

రాంబాబు స్వీట్ తెప్పించాడు.

హాట్ తెప్పించాడు.

టీ తాగుతూంటే అప్పుడు చెప్పాడు--

"ఓ చిలక, ఓ గుడ్లగూబ ఉంటాయి సార్! అవి రెండూ ప్రేమించుకుంటాయి. మధ్యలో చిలక్కి, గుడ్లగూబకి గొడవొస్తుంది. దాంతో గుడ్లగూబని వదిలేసి కత్తెర పిట్టతో డ్యూయెట్లు పాడుతుంది చిలక. చివరికి దాని ప్రేమ ఫలించి గుడ్లగూబతోనే పెళ్లవుతుందనుకోండి! "చిట్టీచిలకమ్మ" కథలో ఇదే సార్ థీమ్! చాలా బాగా రాశాను. సార్! మంచి డైలాగులు... చక్కటి వర్ణన... చదివితే మీరసలు వదిలిపెట్టరండీ! వెంటనే అచ్చువేస్తారు!! అంతేకాదు సార్! రెండుమూడు వారాలు ముందే మీరాకథ గురించి పబ్లిసిటీ కూడా మొదలెడతారు" అన్నాడు రాంబాబు.

అంతే!

కుర్రాడికి టీ పొలమారింది.

గ్లాసుని పెదిమల దగ్గర అలాగే వుంచుకొని బిగుసుకుపోయాడు.

తన ఎదుట భూతమో, ప్రేతమో వున్నట్లు నిలువుగుడ్లు వేసుకుని మిటకరిస్తూ వుండిపోయాడు.

ఏమాటకామాటే చెప్పుకోవాలి...

ఆ కుర్ర సబ్‌ఎడిటర్ చాకులాంటివాడు.

చదవనే చదవడు!

చదివితే మరిచిపోడు!!

వినడే వినడు!

వింటే మరిచిపోడు!!

"మీపేరు రాంబాబు కదూ! విశాఖపట్నం...శ్మశానం పక్కన కదూ మీ ఎడ్రసు" వణికిపోతూ అడిగాడు కుర్రాడు.

రాంబాబు ముఖంమీదకి టీ తుళ్ళింది.

అది ఆ కుర్ర సబ్‌ఎడిటర్ నోట్లో మిగిలిపోయిన టీ!

రాంబాబు ఆ టీ తుంపరులని తుడుచుకునే ప్రయత్నం కూడా చేయలేదు.

పైగా-

మహదానందపడిపోయాడు.

"రైట్ సార్! రైట్‌సార్... నా అడ్రసంతా మీకు తెలుసే" అంటూ పొంగిపోయాడు.

ఆ కుర్రాడు ఓ క్షణం అటూఇటూ చూసి-

చటుక్కున టీ గ్లాసుని బల్లమీద కుదేసి, కుర్చీవెనక్కి నెట్టేసి, గుమ్మంలోకి గెంతబోయాడు.

తన నవల చదివి పోస్టుమెన్ సింహాచలం మాయమైపోయిన సంగతి వెంటనే రాంబాబుకి గుర్తొచ్చింది.

అలాగే ఈ కుర్ర ఎడిటర్ కూడా తనపేరు విన్నాక మాయమైపోతాడేమోనని ఏమూలో ఉన్న సిక్స్త్‌సెన్స్ రాంబాబుని హెచ్చరించింది.

అందుకే చటుక్కున చెయ్యిజాపి లటుక్కున ఆ కుర్ర సంపాదకుడిని పట్టేసుకున్నాడు.

ఆ కుర్ర ఎడిటరు ముఖంలో ఇంతకు ముందు ప్రదర్శించిన గాంభీర్యంకాని, డాబు దర్పంకాని ఇప్పుడు లేవు.

పాపం!




పంజాబు నుంచి వచ్చిన టెర్రరిస్టుకి దొరికి పోయిన ఆడపిల్లలా ఉన్నాడు ఆ కుర్రాడు.

బిక్కముఖంపెట్టి-

రాంబాబుకేసి, హోటల్లో ఉన్న కష్టమర్ల కేసి, నిండుసభలో దుశ్శాసనుడిచేత బట్టలు విప్పించుకోవడానికి సిద్ధంగా ఉన్న ద్రౌపదిలా చూస్తున్నాడు కుర్రాడు.

"ఎందుకుసార్ పారిపోతున్నారు?" మర్యాదగా అడిగాడు రాంబాబు.

"మా సంపాదకులమంతా మీకు ఉమ్మడిగా ఉత్తరం రాశాంగా" అన్నాడు కుర్రాడు అదే సమాధానమైనట్టు.

రాంబాబులో కొత్త చైతన్యం వచ్చింది.

"ఆ విషయం కనుక్కోవాలనే నేనీవూరొచ్చాను. ముందీ టీ తాగండి" అంటూ టేబుల్ మీద గ్లాసులో ఉన్న మిగతా టీ ఆ కుర్రాడిచేత బలవంతంగా తాగించాడు.

పాపం... ఆ కాస్త టీని విషంలా తాగాడా కుర్రాడు.

తరువాత అతడిని బలవంతంగా బయటికి లాక్కుపోబోయాడు రాంబాబు.

ఇంతలో రాంబాబు భుజంమీద ఓ బరువైన చెయ్యిపడింది.

వెనుతిరిగి చూశాడు.

ఎదురుగా 'విశాలి' వారపత్రిక నియమించుకున్న పహిల్వాన్ నిలబడివున్నాడు.

కుర్ర ఎడిటర్‌ని రాంబాబు వెంటాడం చూసి, రాంబాబుని పహిల్వాన్ వెంటాడాడు.

రాంబాబుకి ఉద్రేకం ఆగలేదు.

ఈ పహిల్వాన్‌గాడే తనని పత్రికాఫీసులోకి వెళ్లకుండా చేసింది.

పైగా-

ఇప్పుడీ కుర్ర ఎడిటర్‌తో మాట్లాడబోతూంటే మళ్ళీ అడ్డుపడ్డాడు!

వెంటనే పహిల్వాన్‌గాడి పని పట్టాలనుకున్నాడు రాంబాబు.

అంతే!

రాంబాబులోని వీరోచితంగా ఓ కాష్మోరా పరవళ్ళుతొక్కి పెనుతుఫాన్‌లాగ విజృంభించాడు.

సన్నాటి రివట కొండని ఢీకొని. దానిని పిప్పిచేసింది.

కౌంటర్‌లోని మేనేజరు పరుగెత్తుకొచ్చేటప్పటికి కిచెన్‌రూమ్‌లోని వేడివేడి సాంబార్ డేగిశాలో పడిపోయి ఉన్నాడు పహిల్వాన్.

వాడిని లేవదీయడానికి వెళ్ళి మరో నలుగురు జారిపడ్డారా డేగిశాలో.

రాంబాబు వాడిని ఎలా తన్నాడో ఎవరూ చూడలేకపోయారు.

కెమేరాకూడా బంధించలేని బ్రూస్‌లీవేగంతో ఆ పహిల్వాన్‌ని సాంబారులో వంకాయ ముక్కలా చేసేశాడు రాంబాబు.

అక్కడివాళ్ళు మళ్ళీ రాంబాబుకోసం వెతుక్కున్నారు. కాని, రాంబాబు కనిపించలేదు.

ఆ సమయానికి పబ్లిక్ గార్డెన్స్‌లో ఓ పొదచాటున ఆ కుర్ర ఎడిటర్‌ని తన దగ్గర కూర్చోబెట్టుకుని సంపాదకులంతా కలిసి తనకి రాసిన ఉత్తరాన్ని చదివి వినిపించడం మొదలుపెట్టాడు.

"గౌరవనీయులైన రాంబాబుగారికి,

యావత్ సంపాదకవర్గమూ అనేక నమస్కారములు చేసి విన్నవించుకొను విన్నపములు. ఆర్యా... మీ రచనలు మా సంపాదకవర్గంలో విలయం సృష్టిస్తున్నాయి. మీ కథలు చదవడంవలన మాలో ఓ వృద్ధ సంపాదకుడు గుండె ఆగి మరణించాడు. మరో సంపాదకుడు జీవితంమీద విరక్తిచెంది ఆత్మహత్య చేసుకున్నాడు. ఇంకో ఎడిటర్‌కి పిచ్చెక్కింది. ఇంకా మరికొంతమంది సంపాదకులలో ఇన్ఫెక్షన్స్‌కలిగి రకరకాల జబ్బులతో బాధపడుతున్నారు. అందుకని మేము మీకు తెలియజేయనదేమనగా మా సంపాదకులని కాపాడమని మీకు చేతులెత్తి నమస్కరిస్తున్నాం. ఈ ఉత్తరాన్నే మీకాళ్లనుకుని మిమ్మల్ని వేడుకుంటున్నాం. దయచేసి ఇకనుంచి మీరు మాకు కథలు పంపవద్దని ప్రార్థిస్తున్నాం. ఓ రచయితగా మా సంపాదకలోకాన్ని కాపాడవలసిన బాధ్యత మీ మీద ఉందని గుర్తుచేస్తూ...ఇక మీదట అసలు మా పత్రికలకి కథలు పంపవద్దని మరోమారు మనవిచేస్తూ సెలవు తీసుకుంటున్నాం.

ఇట్లు

యావత్ సంపాదక ప్రపంచం"

కిందన పది పేజీల్లో వరుసగా అన్ని పత్రి కల రబ్బరు స్టాంపులతోపాటు సంపాదకు లందరి సంతకాలు ఉన్నాయి. ఆఖరున ఆ కుర్రఎడిటర్ సంతకం కూడా ఉంది.

రాంబాబు ఉత్తరంతోపాటు వాళ్లందరి పేర్లు చదివి రొప్పడం మొదలుపెట్టాడు.

ఆ రొప్పడంలో అలసటగా ఓ క్షణం కళ్ళు మూసుకున్నాడు.

కుర్ర ఎడిటర్ మళ్ళీ పారిపోబోయాడు.

రాంబాబు కళ్ళు తెరిచి కుర్రాణ్ణి పట్టేసుకు న్నాడు.

"చెప్పు... ఈ ఉత్తరం గురించి నువ్వు చెప్పే సమాధానం ఏమిటి? అసలిలా రాయడంలో మీ ఎడిటర్ల ఉద్దేశం ఏమిటి?" కుర్రాణ్ణి నిలదీశాడు రాంబాబు.

రాంబాబు తనని ఎక్కడ తంతాడోనని బెదిరిపోసాగాడు కుర్రాడు.

"నా ప్రశ్నకు సమాధానం ఏమిటో చెప్పు" మళ్ళీ నిగ్గదీశాడు రాంబాబు.

అంతే!

కుర్రాడు బెదిరిపోతూ రాంబాబు పాదాల మీద పడిపోయాడు:



"మహాప్రభో... మా అమ్మకి, బాబుకి నేనొక్క డినే కొడుకుని. దయచేసి నన్ను ఇంతటితో వదిలిపెట్టండి... మీకు పుణ్యం ఉంటుంది. ఏదో అందరూ సంతకాలు పెట్టమంటే నేనూ పెట్టానంతే!" అన్నాడు కుర్రాడు ఏడుస్తూ.

ముక్కుపచ్చలారని పందొమ్మిదేళ్ల ఆ కుర్ర ఎడిటర్‌ని చూస్తుంటే రాంబాబుకి జాలేసింది.

"సరే... వెళ్ళు" అంటూ కుర్రాణ్ణి వదిలేశాడు. అక్కడి నుంచి మరో పత్రికాఫీసుకు బయలుదేరాడు. కుర్ర ఎడిటర్ తన వీరోచిత కార్యాన్ని చూసి బెదిరిపోయాడు. కాబట్టి ఈసారి తాను కలుసుకోబోయే ఎడిటర్లని కాకాపట్టి పని సాధించుకోవాలనుకున్నాడు రాంబాబు.

★ ★ ★

'సౌజన్య' మాసపత్రిక కార్యాలయంలోకి అడుగుపెట్టాడు రాంబాబు.

గేటు దగ్గర కాపలాగా ఉన్న గూర్ఖాకు పాతిక రూపాయలు లంచం ఇచ్చి మరీ లోపలికి ప్రవేశించాడు.

ఎదురుగా కుర్చీలో ఓ సబ్‌ఎడిటర్ కూర్చుని ఏదో కథ పరిశీలిస్తున్నాడు.

"నమస్కారం సార్... నాపేరు రాంబాబు" అంటూ తననితాను పరిచయం చేసుకున్నాడు.

ఆ సబ్‌ఎడిటర్ రాంబాబు ఎవరో పత్రికాభిమాని అనుకున్నాడు.

"కూర్చోండి" అంటూ కుర్చీ చూపించాడు.

"మీ పేరు సార్?" అడిగాడు రాంబాబు.

"బాబూరావు" చెప్పాడా ఎడిటర్.

"మీ పత్రిక చాలా బాగుంటోందండీ! చాలా చక్కటి కథలు, సీరియల్స్, అందమైన ముఖచిత్రాలు... మీ పత్రిక ప్రతీనెలా క్రమం తప్పకుండా చదువుతానండీ" అంటూ మెచ్చుకున్నాడు రాంబాబు.

"థాంక్స్!" అన్నాడు బాబూరావు.

తరువాత రాంబాబు పత్రికని మెచ్చుకుంటూ మరికొన్ని డైలాగులు ప్రారంభించాడు.

'సౌజన్య' మాసపత్రిక ఆంధ్రదేశానికే వన్నె తెచ్చిందన్నాడు.

ఆకాశంలో చుక్కలు, చంద్రుడు కూడా మీ పత్రిక ముందు వెలవెలబోతాయని పొగిడాడు.

బాబూరావు పొంగిపోయారు.

పది నిముషాలు...

పావుగంట...

అరగంట...

గంటకూడా గడిచిపోయింది.

కాని,

రాంబాబు కుర్చీలోంచి లేవలేదు.

అలా పొగుడుతూనే వున్నాడు.

విని విని బాబూరావుకి తలనొప్పి పట్టుకుంది. ఆస్ప్రిన్‌టాబ్లెట్ తెప్పించుకుని వేసుకున్నాడు. అది చూసైనా రాంబాబు వెళ్ళిపోతాడనుకున్నాడు.

అయినా రాంబాబు కదల్లేదు.

"ఇక మీరు వెళ్ళొచ్చు! నాకు చాలా పని వుంది" చివరికి గొంతు పెగల్చుకుని అన్నాడు బాబూరావు.

రాంబాబు ఇక తప్పదా అన్నట్టు చూశాడతనిని.

తరువాత కుర్చీలోంచి నిలబడి-

"సార్... మీరు శాకాహారా? మాంసాహారా?" అని అడిగాడు.

"మాంసాహారినే! ఏం అలా అడుగుతున్నారు?"

"రండి! అలా నాన్ వెజిటేరియన్ హోటల్‌కెళ్ళి చికెన్ బిరియానీ తిందాం!" చెప్పాడు రాంబాబు.

అంతే!

బాబూరావు నోట్లో లాలాజలం లావాలా పొంగింది. నాలిక లొట్టలు వేసింది.

చికెన్ బిరియానీ అంటే బాబూరావుకి చాలా ఇష్టం కాని, మాంసాహారం రేట్లు బాగా పెరిగిపోవడం వలన డబ్బు చాలదని అతడి శ్రీమతి ఇంట్లో ఎప్పుడూ శాకాహారమే వండుతూంటుంది. అందుకే మాంసాహారం కోసం బాబూరావు ముఖం వాచిపోయివుంది.

మంత్రముగ్ధుడిలా కుర్చీలోంచి లేచాడు.

రాంబాబు ముందు...

బాబూరావు వెనక...




ఇద్దరూ ఓ ఖరీదైన నాన్ వెజ్ హొటల్లోకి ప్రవేశించారు.

రాంబాబు నాలుగు ఫుల్‌ప్లేట్స్ చికెన్ బిరియానీ తెప్పించాడు.

తను ఒక్క ప్లేటు కూడా తీసుకోలేదు.

ఆబగా నాలుగు ప్లేట్ల చికెన్ బిరియానీ బాబూరావొక్కడే లాగించేశాడు.

అతడి కరువు తీరిపోయింది.

బ్రేవ్‌మంటూ త్రేన్చాడు.

"థాంక్స్ ఫర్‌యువర్ బిరియానీ పార్టీ!" అంటూ రాంబాబుకి కాంప్లిమెంట్ పారేశాడు.

"సార్... నాకో చిన్న సహాయం చేసి పెడతారా?" అడిగాడు రాంబాబు.

"చెప్పండి... మీకోసం నా ప్రాణాలైనా ఇస్తాను" గొప్పగా చెప్పాడు బాబూరావు.

"నేనో రచయితను... నాకథలు మీ కార్యాలయంలో పరిశీలనలో వున్నాయి- వాటిని మీరు వేసుకోవాలి" అన్నాడు రాంబాబు.

"మీరీ మాటే అంటారని నాకు తెలుసు. ఇలాంటిదేదో లేకుంటే ఇంత ఖర్చెందుకు పెడతారూ" అన్నాడు బాబూరావు.

తానెవరో, ఎక్కడినుంచి వచ్చాడో వివరించి చెప్పాడు రాంబాబు.

అంతవరకూ రాంబాబు తమ పత్రికని అభిమానించే పాఠకుడని అనుకుంటున్న బాబూరావుకి రాంబాబెవరో తెలిసేసరికి గుండె ఆగినంత పనయింది.

కళ్ళు తేలేశాడు.

ఆ కళ్ళముందు రాంబాబు కథలు కదిలాయి.

మదిలో చనిపోయిన వెంకట్రావు, సుబ్బారావులు మెదిలారు.

పిచ్చెత్తి మెంటల్ హాస్పిటల్లో జీవితసభ్యుడైన కాంతారావు రూపం గుర్తొచ్చింది. అంతే!

బాబూరావు అమాంతంగా రాంబాబు కాళ్ళ మీద సాష్టాంగపడిపోయాడు.

"రాంబాబుగారూ! మీరు విశాఖపట్నం రచయిత అని తెలీక మీకూడా వచ్చాను- నన్ను మన్నించండి. కావాలంటే మీ బిరియానీ మీరు వెనక్కు తీసేస్కోండి" అంటూ రాంబాబు పాదాలమీద తిన్న నాలుగు ప్లేట్ల బిరియానీని, మరో నాలుగు చెంబుల లిక్విడ్‌తోసహా కక్కేశాడు.

తరువాత వెంటనే ఫెయింటైపోయాడు.

మేనేజర్‌తోసహా హొటల్లో వున్న సర్వర్లు, కస్టమర్లు వాళ్ళిద్దరి చుట్టూ గుంపుగా చేరారు.

ఇక అలాంటి పరిస్థితుల్లో రాంబాబు చేసేదిలేక మౌనంగా గుంపుని చీల్చుకుని వెనుదిరిగాడు.

అనవసరంగా బిరియానీకి డబ్బులు వేస్ట యినందుకు అతడి ప్రాణం వుసూరుమంది.

★ ★ ★

గేట్‌మేన్‌కి ముప్పైరూపాయలు కట్నం చదివించుకుని 'కోయిల' పత్రిక కార్యాలయంలోకి అడుగుపెట్టాడు రాంబాబు.

మీరెవరన్నట్టు తలపైకెత్తి చూశాడు ఓ సబ్ ఎడిటర్.

"నేను మీ పత్రికాభిమానినండీ!" అన్నాడు రాంబాబు.

ఉప సంపాదకుడు కూర్చోమని సాదరంగా కుర్చీ చూపించాడు.

"మీ పేరు?" అడిగాడు రాంబాబు.

"దయానిధి" తనపేరు చెప్పాడు సబ్ ఎడిటర్.

వెంటనే రాంబాబు 'కోయిల' పత్రిక గురించి కోతలు కోయడం ప్రారంభించాడు. ఫలానారోజు ప్రచురించిన ఫలానా తార ముఖచిత్రం బాగుందన్నాడు. ప్రస్తుతం వస్తున్న సీరియల్ వుద్వేగంతో తన గుండెని పిండేస్తోందన్నాడు. కార్టూన్లు, జోక్‌లు కడుపుబ్బ నవ్విస్తున్నాయి- అని కార్యాలయం గోడలు దద్దరిల్లిపోయేలా నవ్వుతూ మెచ్చుకున్నాడు. వ్యాసాలు పసందుగా వున్నాయని పొగిడాడు.

దయానిధి పొడిగా నవ్వి వూరుకున్నాడు.

కనీసం రాంబాబుకి థాంక్స్ కూడా చెప్పలేదు సరిగదా మీరొచ్చిన పని అయిందా అన్నట్టు చూశాడు. ఇక వెళ్ళిపోతారా అన్నట్టు తల ఏదో కథల ఫైల్లో దూర్చేశాడు.

రాంబాబు కదల్లేదు.

జిడ్డులా అలాగే కుర్చీకి అతుక్కుని చేతు

లు కట్టుకుకూర్చున్నాడు.

పది నిముషాలు...

పావుగంట....

అరగంట....

గంట....

గంటన్నర గడిచింది.

అయినా రాంబాబు కుర్చీలోంచి లేవలేదు.

కొంచెం కూడా అటూ ఇటూ కదల్లేదు.

బొమ్మలా బుద్ధిగా అలాగే కూర్చున్నాడు.

దయానిధి ఫైల్లోంచి తల పైకెత్తాడు.

రాంబాబు ఇంకా వెళ్ళకుండా అక్కడే కూర్చుని వుండేసరికి చిర్రెత్తుకొచ్చిందతడికి.

"మీరిక వెళ్ళరా?" అసహనంగా అడిగాడు దయానిధి.

"వెళ్ళను" అన్నాడు రాంబాబు సిన్సియర్‌గా.

"మీరొచ్చిన పని అయిపోయిందిగా!"

"అయినాసరే వెళ్ళను" ఖండితంగా చెప్పాడు రాంబాబు.

"అయితే గూర్ఖాని పిలవాల్సివుంటుంది"

"మీ గూర్ఖా నన్నేంచేయలేడు" ధీమాగా అన్నాడు రాంబాబు.

"అయితే పిలవమంటారా?"

"పిలిచినా నన్నేం చేయలేడు. ఆ గూర్ఖాగాడికి ముప్పైరూపాయలు ఇచ్చాను" అసలు విషయం చెప్పాడు రాంబాబు నింపాదిగ.

ఆ మాటలకు దయానిధి నివ్వెరపోయి చూశాడు రాంబాబుని.

"సార్... మీకు పెళ్ళయిందా?" కాకాస్త్రాన్ని ప్రయోగించడానికి సిద్ధమయ్యాడు రాంబాబు.

"కాలేదు... ఏం?" అడిగాడు దయానిధి.

"పోనీ మీకు గరల్‌ఫ్రెండు ఎవరైనా వున్నారా?" అడిగాడు.

"లేరు... ఎందుకు?"

"పోనీ... మీకు... ఆ... అనుభవం వుందా?" అని అడిగాడు

రాంబాబు [illegible] అనిపించింది దయానిధికి. అతడిని లాగి పెట్టి కొట్టాలనుకున్నాడు. అయినా తమాయించుకున్నాడు. ఇంకా ఏం మాట్లాడతాడో చూద్దామని "నాకా అనుభవం లేదు. ఎందుకు?" అని అడిగాడు సౌమ్యంగా.

"రండి... అలా అమ్మాయి దగ్గరికి వెళ్ళి ఎంజాయ్ చేద్దాం" అస్త్రాన్ని సంధించాడు రాంబాబు.

అంతే!

అమ్మాయి పేరెత్తగానే దయానిధి ఐస్సైపోయాడు.

"ప్ప్... ప్ప్... ప్ప్" అంటూ లొట్టలు వేయసాగాడు.

రాంబాబు కుర్చీలోంచి లేచి నిలబడి ముందుకు అడుగులు వేశాడు.

దయానిధి కూడా కుర్చీలోంచి లేచి మంత్రముగ్దుడిలా అతడిని అనుసరించాడు. అలా ఇద్దరూ నడుచుకుంటూ నాలుగు రోడ్ల జంక్షన్ దగ్గరకు వచ్చారు.

బేరం చెయ్యకుండా ఓ రిక్షా ఎక్కకూర్చున్నారు.

"మంచి అమ్మాయిల కంపెనీకి పోనీయవోయ్!" రిక్షావాడితో చెప్పాడు రాంబాబు.

రిక్షా ముందుకు సాగిపోతోంది.

దయానిధి అమ్మాయితో అనుభవాన్ని తలుచుకుంటూ వూహాలోకాలలో విహరించసాగాడు.

రాంబాబుకు వున్నట్టుండి ఓ అనుమానం వచ్చింది.

ఇందాక అతడికి 'సౌజన్య' పత్రికకార్యాలయంలో ఎడిటర్ బాబూరావుకి నాలుగు ప్లేట్లు చికెన్ బిరియానీ ఇప్పించినా పని అవ్వకపోవడం గుర్తొచ్చింది.

ఇప్పుడు అమ్మాయిని ఇప్పించాక ఈ దయానిధి కూడా తనకు మొండి చెయ్యి చూపిస్తే...

ఏమవుతుంది?

తిప్పుదండగవుతుంది!

అనవసర శ్రమ!!

అందుకని ముందుగానే దయానిధితో మాట్లాడి తన కథల గురించి ఒప్పందం కుదుర్చుకుంటే బాగుంటుంది!




ఇళయరాజా స్వరమాధురి

జి.బాబు సమర్పించు

లలితశ్రీ కంబైన్స్

# అభినందన



నిర్మాత: ఆర్.వి.రమణమూర్తి

ఫొటోగ్రఫీ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: అశోక్ కుమార్

మాటలు-పాటలు: ఆచార్య ఆత్రేయ

LAA

అప్పుడు తను ఖర్చుపెట్టిన డబ్బు వృధా కాదు!!

ఒక నిర్ణయానికి వచ్చాడు రాంబాబు.

ఆ తరువాత నోరు విప్పి దయానిధితో తానెవరో, ఎందుకీ ఊరు వచ్చాడో అసలు విషయం చెప్పేశాడు. తన కథలు వేసు కుంటేనే దయానిధికి అమ్మాయి ఛాన్స్ ఇప్పి స్తానన్నాడు.

అంతే!

దయానిధి గుండెల్లో ఆదరాబాదరా నగరం సిటీబస్సులు పరిగెట్టాయి. రాంబాబు కథలు విమానాల్లా మారి చెవులు రోదపుట్టించేలా శబ్దాలు చేశాయి.

భయంతో గడగడా వణికిపోయాడు.

అమ్మాయి వూహలతో వేడెక్కిన వొళ్ళు ఐసు గడ్డలా చల్లబడిపోయింది.

"ఓ..." అంటూ పెద్దగా గావుకేకపెట్టాడు.

"మి... మి... మీరు రచయిత రాంబాబు గారా!?" అని అడిగాడు గడగడలాడిపోతూ.

"అవును సార్!" అన్నాడు రాంబాబు.

అంతే!

దయానిధి పరుగెడుతున్న రిక్షాలోంచి కింది కి ఒక్క గెంతుగెంతి తిరిగి వెనక్కి చూడ కుండా అదేపనిగా పరుగులంకించుకున్నాడు.

రాంబాబు హతాశుడయ్యాడు.

చేసేదిలేక అదే రిక్షలో మరో పత్రికాకార్యాల యానికి బయలుదేరాడు.

అలా రాంబాబు భాగ్యనగరంలోని పత్రికాఫీ సులన్నీ చుట్టుముట్టేశాడు.

సంపాదకులనందరినీ రకరకాలుగా కాకాప ట్టాడు. చివరికి తంతానని కూడా బెదిరించా డు. అయినా ఫలితం లేకపోయింది.

రాంబాబు పనికాలేదు.

సంపాదకులందరూ అతడి కథలు వేసుకో మనే చెప్పేశారు.

దాంతో నిరాశగా విశాఖపట్నానికి వెనుదిరి గాడు రాంబాబు.

★ ★ ★

రాంబాబు ట్రెయిన్ దిగి ఇంటికి వచ్చేసరికి అతడికి మోహిని రాసిన ప్రేమలేఖ దర్శనమి చ్చింది.

ఆ లేఖ విప్పి చదవసాగాడు.

ప్రియమైన రచయిత రాంబాబుగారికి,

మీ అభిమాని మోహిని రాయు ప్రేమలేఖ!

రాంబాబుగారూ! "విశాలి, సౌజన్య, కోయిల పత్రికలలో ప్రచురింపబడిన మీ కథలు చదివాను. అవి కథలా?... కాదు... పంచదార చిలకలు! అపూర్వమైన కావ్యాలు.

మీ కథలు నన్ను రంజింపచేశాయి.

మీ కథలలో పాత్రల చిత్రణ నన్ను ఆకట్టు కుంది.

మీ మూడు కథలలోను కాయగూరలకు మనసుందని, మూగజీవులకు కూడా హృదయం వుంటుందని చక్కగా తెలియజెప్పారు. పాత్రల చిత్రీకరణ కళ్ళకు కట్టినట్టుగా చూపించారు. శైలి అమోఘం. కాయగూరలకు, జంతువులకు కూడా త్యాగబుద్ధి, హృదయ వైశాల్యం వుంటుందని రాసిన మీ అభిప్రాయంతో నేనేకీభవిస్తున్నాను. రియల్లీ యు ఆర్ ఎ జీనియస్ రైటర్! ఇంకా ముందు ముందు మీ రచనల్లో వాహనాలకు కూడా మనసుంటుందని తెలియజేస్తూ సందేశం ఇస్తారని ఆశిస్తున్నాను.

ఇకపోతే నాగురించి--

ఇంటర్ చదువుతున్నాను. అందంగా వుంటాను. మనం ఒకే గమ్యంలో పయనిస్తున్నామని అర్థంచేసుకున్నాను. ఆ గమ్యానికి లక్ష్యం సాధించాలంటే మన మనసులు కూడా దగ్గరవాలని ఆకాంక్షిస్తున్నాను. ఎందుకో నా మనసు మీ కోసం ఆరాటపడుతోంది. మిమ్మల్ని పదేపదే చూడాలని కలవరిస్తోంది. నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. నన్ను నీటముంచినా, పాలముంచినా (పాలు వద్దులెండి! మళ్లీ అందులో బాక్టీరియా క్రిములుంటాయి. అవి చచ్చిపోవచ్చు) మీదే భారం.

మీరు కాదంటే నాకిక మరణమే శరణ్యం.

మీ జాబుకై ఎదురుచూస్తూ...

మీ
ఆరాధకురాలు
మోహిని

రాంబాబు ఆ లేఖ చదవడముగించాడు.





పాఠకలోకంలో తన రచనలని అభిమానించిన ఏకైక పాఠకురాలీమె. అందులోనూ స్త్రీ. అంతే కాదు... తనని ప్రేమించింది కూడా.

రాంబాబు పొంగిపోయాడు.

అప్పటికప్పుడు తను కూడా మోహినికి మనసిచ్చేశాడు.

వెంటనే మోహినికి రిప్లై రాశాడు.

ప్రియాతి ప్రియమైన మోహినికి,

నీ రాంబాబు రాయునది

మోహినీ... నా రచనలు నీకు నచ్చినందుకు మెనీమెనీ థాంక్స్. నా అభిప్రాయాలతో నీ అభిప్రాయాలు కూడా కలిశాయి. దానిని బట్టి చూస్తే ఆ భగవంతుడు మనిద్దరినీ ఒకరికోసం ఒకరిని పుట్టించాడేమోనని పిస్తోంది. నిజంగా మన కలయిక ఒక అపూర్వ సంగమం. నీ లేఖ చూడగానే నా మనసు కూడా నీకు ఇచ్చేశాను. నిన్ను చూడాలని విరహతాపంతో వేగిపోతున్నాను. నీ లేఖ చూసిన ఈ క్షణం మొదలు మళ్ళీ నిన్ను కలుసుకునే దాకా, నాకు అహోరాత్రులు నిద్రాహారాలుండవు. వెంటనే నీ ఫొటో పంపు- చూసి తరిస్తాను.

నువ్వు రాసినట్టు నేను వాహనాల మీద కూడా ఎన్నో రచనలు చేశాను. సైకిళ్ళు, స్కూటర్లు, బస్సులు, కార్లు, జీపులు-- ఇలా అన్నిటికీ కూడా మనసుంటుందని సందేశాత్మకంగా రచనలు చేశాను.

కాని,

నా రచనలని నీలా, నాలా అర్థం చేసుకునే స్థాయికి సంపాదకులింకా ఎదగలేదు. నేడు పత్రికాప్రపంచంలో ఎక్కడ వేసిన గొంగళి అక్కడ వున్నట్టుగా వుంది ఎడిటర్ల పరిస్థితి. వాళ్ళ మందబుద్ధులు ఇంకా వికసించలేదు. పాఠకులకి మనలాంటివాళ్ళ రచనలని అందజేయటానికి వాళ్ళకి చేవలేదు. ప్రేమ, పెళ్ళి అంటూ కేవలం మనుషుల మీదరాసే కథల్ని మాత్రమే వేస్తూ వాళ్ళింకా బూజుపట్టిన సాంప్రదాయంలోనే కుడితిలో ఎలకల్లా కొట్టుకుంటున్నారు. సృష్టిలో ప్రతి వస్తువుకూ ప్రాణం, మనసు వుంటాయని ఆ అమాయక సంపాదకులకు తెలీదు. పైగా వాళ్ళునన్నిక రచనలు పంపొద్దని వుత్తరాలు రాశారు. సాహితీ ప్రపంచానికి ఎంతో సేవచేద్దామనుకున్న నా ఆశ అడియాసగానే మిగిలిపోయింది. ఇప్పుడు నాకేం చేయడానికి పాలుపోవడంలేదు.

నీవు రాయబోయే లేఖ కోసం ఎదురుచూస్తూ...

నీ

రాంబాబు.

వెంటనే రాంబాబుకి మోహిని దగ్గర నుండి రిప్లై వచ్చింది. ఆ రిప్లై లెటర్‌లో ఆమె ఫొటో కూడా వుంది.

రాంబాబు ఆ ఫొటో చూసి మోహిని అందానికి మురిసిపోయాడు. ఓహ్... నిజంగా ప్రబంధనాయకిలా వుందని అనుకున్నాడు. తరువాత మోహిని రాసిన లేఖ చదివాడు.

మైడియర్ రాంబాబూ!

మీ ప్రేమలేఖ అందింది. నా ఫొటో పంపిస్తున్నాను. అలాగే మీరూ మీ ఫొటో పంపండి.

మీ లేఖ చదివాక సంపాదకుల దుస్థితికి చాలా జాలి పడుతున్నాను. ఇంకా సంపాదకులని పూర్వకాలపు ఛాందస భావాలు వదిలిపెట్టి పోలేదు. ఈ సంపాదకులకి చురుకుపాలు తక్కువ. వీళ్ళు పత్రికాప్రపంచంలో వేగంగా ముందుకు సాగిపోలేదు. రచయితల సమాన ఒరవడిలో ముందుకు ప్రవహించుకుపోలేరు. మా విజయవాడలో మా ఇంటి పక్కనే ఓ సంపాదకుడున్నాడు. అతడి నడక అమీబా వేగం కంటే కూడా చాలా తక్కువ. అంటే అంత నెమ్మదిగా రోడ్డు మీద నడుస్తాడన్న మాట. అందుకే పత్రికా పురోగమనంలో ఈ సంపాదకులకంటే నత్తలు, అమీబాలు నయం. మీరన్నది నిజమే! సంపాదకులు మన స్థాయికి ఎదగలేదు. అంటే మనం వాళ్ళని చూసి గర్వపడాలి. సమాజంలో మీ లాంటి సూపర్‌రైటర్లు, నాలాంటి స్పూట్నిక్ పాఠకులూ వుంటారని వాళ్ళకి ఇంకా తెలీదు. అందుకే మనం సంపాదకలోకంలో విప్లవం తీసుకొద్దాము. పత్రికలోకాన్ని సరికొత్త పరవళ్ళు తొక్కిద్దాము.

మీ రచనలు పంపొద్దని మీకుత్తరం రాయడానికి వాళ్ళెవరు? ఆ పత్రికలకి మీరు



లాయర్ నోటీసు తగిలించండి. దెబ్బకి వాళ్ళ రోగం కుదురుతుంది.

మళ్ళీ మీ రచనలు వేసుకోవడం ప్రారంభిస్తారు.

ఆల్‌ది బెస్ట్!

మీ
మోహిని.

రాంబాబు ఆ వుత్తరం చదివి ఎగిరి గంతేశాడు.

వెంటనే లాయర్‌ని కలుసుకుని పత్రికాఫీసులకు నోటీసివ్వాలనుకున్నాడు.



5

రాంబాబు టాక్సీ దిగాడు.

ఒకసారి ఆ ఇంటిని ఎగాదిగా చూశాడు.

లాయర్ వెంకోజీ, బి.ఎ.,ఎల్.ఎల్.బి. అని బోర్డు వుంది.

తనకి కావలసింది ఈ ఇల్లే... సందేహంలేదు.

రాంబాబు టాక్సీదిగి చకచకా పరిగెట్టబోయాడు.

చటుక్కున షర్టు వెనక ఎవరో గుంజినట్లయింది.

రాంబాబు వెనక్కి తిరిగి చూశాడు. టాక్సీ డోర్లో షర్టు చిక్కుకుపోయి వుంది.

"నేనే ఇలా ఎరేంజ్ చేసాను సార్... బాడుగ ఎగ్గొట్టి పారిపోయేవాళ్ళకి ఇలాగే చేస్తూంటాను--సార్" అన్నాడు టాక్సీవాలా ఇకిలించి.

రాంబాబుకి అప్పుడు గుర్తొచ్చింది.

చటుక్కున డబ్బు తీసి బాడుగ చెల్లించాడు.

టాక్సీవాలా సలాం కొట్టి షర్టు విడిపించాడు.

రాంబాబు బాణంలా భవనంలోకి పరిగెట్టాడు.

ఎదురుగా టేబులు, టేబుల్ వెనకాల నల్లటి కోటు, నల్లకోటులో వుందా లేదా అనిపించే సన్నపాటి జీవం. అంటకత్తెర జుత్తు, లావుపాటి ఫ్రేమ్, నల్లకళ్ళద్దాలు.

రాంబాబు నీరుకారిపోయాడు.

తన తరపున వాదించే లాయర్‌కి లావుపాటి కళ్ళజోడు, ఫ్రేము కాదు కావలసింది. ఈదురుగాలిలో సహితం ఎగిరిపోని పీపాలాంటి ఆకారం. అలాంటి ఆకారాలే లాయర్లుగా పనికొస్తాయని, బాగా వాదిస్తాయని రాంబాబు నమ్మకం.

"లాయర్లు, మడత పేచీలు అనే విషయం మీద అతడొక సుదీర్ఘవ్యాసం రాసి, ఏనాడో పత్రికలకు పంపించాడు. కాని అదెక్కడా పడటంలేదు.

రాంబాబు బాణంలా దూసుకొచ్చేసరికి లాయర్ వెంకోజీ తుళ్ళిపడ్డాడు. పెద్దపెద్ద సివిల్, క్రిమినల్ వ్యవహారాల్లోనే అతను తుళ్ళిపడలేదు. బాణం తనవేపు దూసుకువస్తోందేమోనని భయపడిపోయాడు. దరిమిలా నల్లకోటులో పల్చటి శాల్తీ ఎగిరిపడింది. పాతకాలం ఇంక్ సీసా, దాంట్లో వున్న బొద్దు కలం వులిక్కిపడ్డాయి.

ఆరోజుకి వాయిదాపడిన కేసు కట్టమీద కొంత సిరా తుళ్ళించి సంతృప్తి పడింది ఇంకుసీసా.

"ఎవరు నాయనా నువ్వు?" అంది పల్చటి శాల్తీ.

రాంబాబు వెనక్కి తిరిగిపోయాడు. ఎందుకంటే అతడికి కావలసింది లావుపాటి శాల్తీ మాత్రమే.

లాయర్ వెంకోజీ టేబుల్ వెనకనుంచి ఎగిరి అతనిముందు వాలాడు.

ఈసారి తుళ్ళిపడటం రాంబాబు వంతు అయింది.

వెంకోజీ ఎలా ఎగిరివచ్చాడో రాంబాబు గుర్తించేలోగా అతని చేతులు పల్చటి అస్తిపంజరం ఎముకల మధ్య ఇరుక్కుపోయాయి. సదరు ఎముకలకి ముడతలు పడిపోయిన

...ూడా వున్నాయి.

...ందుకొచ్చావు... ఎందుకు ...న్నవు?'' అన్నాడు వెంకోజీ.

రాంబాబు నిర్భయంగా చెప్పేశాడు. లావుపాటి శాల్తీ అయితేనే కోర్టులో గట్టిగా బల్లగుద్ది వాదిస్తుందని.

వెంకోజీ టేబుల్ ముందుకి వాలాడు. అది డబడబలాడింది.

రాంబాబు ఆశ్చర్యపోయాడు.

టేబులు డబడబలాడినందుక్కాదు.

సన్నపాటి అస్తిపంజరం టేబుల్‌ని అలా మోగించినందుకు.

రాంబాబు వెంటనే కుర్చీలో కూర్చున్నాడు.

తన గురించి చెప్పుకొచ్చాడు.

తను ఎంతపెద్ద రచయితో వివరించుకొచ్చాడు.

తన రచనలకోసం పాఠకలోకం ఎలా వువ్విళ్లూరుతుందో కథలు కథలుగా చెప్పుకొచ్చాడు. వచ్చిన సంగతి వివరించాడు. తను సంపాదకులను కాకాపట్టిన వైనం కూడా వివరించాడు.

లాయర్ వెంకోజీ ఒక్కక్షణం బిర్రబిగుసుకుపోయాడు.

కొద్దిక్షణాలపాటు కళ్లు రెండు మూసుకున్నాడు.

ఏదో గుర్తుకొచ్చినట్టు తలాడించాడు.

''ఎస్ రాంబాబు'' అన్నాడు లాయర్ వెంకోజీ.

అతని చేతిలో సంపాదకులనుంచి వచ్చిన తాఖీదు వుంది.

లాయర్ వెంకోజీ అప్పటికప్పుడు చకచకా నోటీసు తగిలించాడు.

కథలు రాసుకోవడానికి ప్రతివాదికి హక్కు వుంది.

రాసిన కథని ఇష్టమొచ్చిన చోటికి పంపటానికి అంతకంటే గొప్ప హక్కువుంది.

పత్రికలు రాంబాబుని కథలు పంపవద్దనటానికి హక్కులేదు. ఎందుకంటే అది వాక్ స్వాతంత్ర్యానికి, పత్రికా స్వాతంత్ర్యానికి గొడ్డలి పెట్టవుతుంది. అందువలన సదరు పత్రికలు లాయర్ వెంకోజీ పంపిన నోటీసు అందుకున్న నెలరోజులలోపల రాంబాబు కథలని పరిశీలించి ఏదో ఒక కథ ప్రచురించుకోవలసివుంది. అలా ప్రచురించుకోని పక్షంలో రాంబాబు సదరు పత్రికలన్నిటిమీద నష్టపరిహారం పొందడానికి సర్వహక్కులు కలిగివున్నాడు.

ఇదీ ఆ నోటీసు సారాంశం.

రాంబాబు డంగైపోయాడు.

కోడి తలకాయంత తల వెంకోజీది.

ఆ తలలో ఎన్ని ఆలోచనలు! ఎంత మేధస్సు! ఎంత న్యాయశాస్త్ర వైదుష్యం!! రాంబాబు ఆ పల్చని శాల్తీని టేబుల్ ఇవతల నిలబడమని చెప్పి కాళ్లమీద అడ్డంగా బోర్లా పడిపోయాడు.

అలా సాష్టాంగ నమస్కారంచేసి ఫీజుకి, నమస్కారానికి చెల్లు అంటాడేమోనని వెంకోజీ అపార్థం చేసుకున్నాడు.

కాని—

రాంబాబు అరిచాడు. ''గురూజీ... మీ ఫీజ్!'' అంటూ ఓ నోట్ అందించాడు.

లాయర్ వెంకోజీ భక్తి పురస్సరంగా ఆ యాభైనోటు అందుకున్నాడు.

''నా కొడకా... నువ్వు చెత్తకథలు రాసే రాంబాబువేనా! నా అల్లుడేరా 'విశాలి' పత్రిక కుర్ర ఎడిటరు. నీ రోగం కట్టించడానికే ఈ నోటీసు రాసిపెట్టాను. నా అల్లుడికి మనశ్శాంతి లేకుండా చేస్తావురా. వాడు నీ గురించి బెంగపెట్టుకుని వుద్యోగం కూడా మానేస్తానంటున్నాడు. నా కూతురు ఎక్కడికి పోవాలి?'' గొణుగుకున్నాడు లాయర్ వెంకోజీ.

ఏమాటకామాటే చెప్పుకోవాలి.

రాంబాబువి పాముచెవులు.

వెంకోజీ గొణుగుడు భూమిపొరల్లోంచి అతని కర్ణభేరిలోకి వెళ్లనే వెళ్లింది.

చటుక్కున బాణంలా లేచాడు.

వెంకోజీ రాసిపెట్టిన నోటీసు, వెంకోజీ చేతిలోని నోటు డేగలాగా లాక్కున్నాడు. ఎలా వచ్చిన బాణం అలాగే వెనక్కి వెళ్లినట్టు రాంబాబు గుమ్మంలోంచి రివ్వున బయటికి దూసుకుపోయాడు.




లాయర్ వెంకోజీ నిర్ఘాంతపోయాడు.

★ ★ ★

రాంబాబు ఆ లాయర్ నోటీసుని వందలాది జిరాక్సుల కాపీలు తీయించి ఆంధ్రదేశంలో వున్న వందలాది పత్రికలకు రిజిష్టర్డు పోస్టులో పంపించాడు.

ఆ లాయర్ నోటీసు చదివి పత్రికా సంపాదకులంతా గంగవెర్రులెత్తిపోయారు.

రాంబాబు లాయర్ నోటీసు తగిలించడంవల్ల పత్రికలు తప్పనిసరిగా అతడి కథలు పరిశీలించవలసి వచ్చింది.

వాళ్ళు కాళ్ళబేరానికి వచ్చి లాయర్ నోటీసుని ఉపసంహరించుకోమని, రాంబాబు ఎప్పటిలా తన కథలని పత్రికాకార్యాలయాలకి పంపవచ్చని అంగీకరించక తప్పింది కాదు. ఈమేరకు వాళ్ళు రాంబాబుకి ఓ క్షమాపణ పత్రాన్ని, మరో అంగీకార లేఖని పంపించారు.

రాంబాబు అవి చూసి విజయగర్వంతో పొంగిపోయాడు. గది దద్దరిల్లిపోయేలా వికటాట్టహాసాలు చేశాడు.

రెట్టింపు ఉత్సాహంతో పత్రికలకు మళ్లీ కథలు పంపడం ప్రారంభించాడు. సంపాదకులు ఏడుస్తూనే రాంబాబు కథలు ముందేసుకుని కూర్చునేవారు.

చదవడం ప్రారంభించేవారు.

మళ్లీ మామూలే!

వాళ్లకి ఎప్పటిలా రకరకాల కాంప్లికేషన్సు పట్టుకునేవి.

ఎటుపోయి ఎటు చస్తుందోనని ప్రతి పత్రికా కార్యాలయాలు ప్రత్యేకంగా సంపాదకుల యోగక్షేమాల దృష్ట్యా ఓ డిస్పెన్సరీని కట్టించుకుని డాక్టర్లని, నర్సులని ఏర్పాటు చేసుకున్నాయి.

అయినా రాంబాబు కథలు చదువుతూ రోజూ ఇద్దరు ముగ్గురు సంపాదకులకి తక్కువ కాకుండా మూర్ఛపోతుండేవారు.

దాంతో మిగతా కొద్దిమంది సంపాదకులు బతుకుమీది తీపితో, బతికుంటే గంజన్నం తినొచ్చని వుద్యోగాలు వదిలేసుకుని దేశాంతరాలు పట్టిపోయారు.

సంపాదకులు లేక పత్రికా కార్యాలయాలు మూతపడ్డాయి.

చీఫ్ ఎడిటర్లయిన పార్వతీశంగారికి, మాధవరావుగారికి సాహిత్యం అంటే ఎంతో మక్కువ. చస్తే చచ్చామని వాళ్లు తమ కార్యాలయాల్ని స్వయంగా తామే నడుపుకుందామనుకున్నారు. కాని, ఇంట్లో వాళ్ల శ్రీమతులు ఒప్పుకోలేదు. ఏడ్చి, అల్లరిచేసి, సత్యాగ్రహాలుచేసి, ప్రమాణాలు చేయించుకుని ఆ చీఫ్ ఎడిటర్ల చేత పత్రికలు ఎత్తించేశారు.

ప్రస్తుతం పార్వతీశంగారు వళ్లబిజినెస్ పెట్టుకున్నారు.

మాధవరావుగారు మటన్ బిజినెస్ పెట్టుకున్నారు.

వాళ్ల వ్యాపారాలు కూడా మూడుపువ్వులు ఆరు కాయలుగా సాగుతూ కుటుంబాలు కళకళలాడుతున్నాయి.

అయితే దేశంలో వున్న పత్రికాఫీసులన్నీ మూతపడిపోగా ధర్మారావుగారు మాత్రం 'విశాలి' వారపత్రికని ఎలాగైనా నడపాలని అనుకున్నారు.

కారణం ఆయనకి పెళ్లాం బిడ్డలు లేరు.

యూనివర్సిటీలో చదివే రోజుల్లో ఆయన ప్రేమవ్యవహారం షార్ట్ సర్క్యూట్ అయి ఫెయిలయింది. తన ప్రేమ గొప్పదని నిరూపించుకోవడానికి ఆయన మళ్లీ పెళ్లిచేసుకోలేదు.

తను పోయినా, తనకోసం ఏడ్చేవాళ్లు వెనకా ముందూ లేరు కాబట్టీ, నష్టంతో నడిచినా 'విశాలి' పత్రికను తన కంఠంలో వూపిరి వుండేదాకా నడపాలనుకున్నారు. ఇతోధికంగా పాఠకులకు సాహితీసేవ చేయాలనుకున్నారు.

పత్రికలన్నీ మూతపడిపోవడంవలన ఇప్పటికే పాఠకలోకానికి గట్టిదెబ్బ తగిలింది. చదువుకోవడానికి సాహిత్యం లేక లక్షలాదిమంది పాఠకులు భగ్నప్రేమికుల్లా తయారయ్యారు.

పత్రికలే కదా సమాజానికి ఆయువుపట్టు!

సమాజాన్ని సక్రమమైన మార్గంలో నడిపించడానికి పత్రికలేకదా రథసారధులు!!

అలాంటప్పుడు 'విశాలి' కూడా మూతపడిందంటే పాఠకలోకంలో సాహితీ విప్లవం వస్తుంది. అల్లర్లు, దౌర్జన్యాలు చెలరేగుతాయి.

ఈ కారణాలన్నీ వూహించి ధర్మారావుగారు



తన పత్రికనైనా పాఠకులకోసం నడుపుదామను కుని గట్టి నిర్ణయం తీసుకున్నారు. బతుకు మీది తీపితో సబ్ఎడిటర్లు ఉద్యోగాలు మానేసినా ధర్మారావుగారు మాత్రం ఎంతో శ్రమతో పత్రిక నడపసాగారు. అయితే కథల సెక్షన్ ఒక్కరే చూసుకోవడం ఇబ్బందిగా ఉంటోందాయనకు.

అందుకే సబ్ఎడిటర్లు కావాలని ప్రకటన ఇచ్చారు ధర్మారావుగారు.

ఆ ప్రకటన చూసి చాలామంది యువతీ యువకులు అప్లై చేయబోయారు.

కాని... అంతకుముందు ఆ పత్రికలో పనిచేసిన ఉపసంపాదకులు రాంబాబు కథల గురించి బహుళ ప్రచారం చేశారేమో వాళ్లు తారెత్తిపోయి అప్లై చేయడం మానుకున్నారు.

శివరామ్ పాతికేళ్ల యువకుడు. అందగాడు. చురుకైనవాడు. ఢిల్లీ యూనివర్సిటీలో ఎమ్.ఎ. పట్టభద్రుడు. జర్నలిజంలో డిప్లొమా తీసుకున్నాడు. తెలుగు, ఇంగ్లీషు, హిందీ క్షుణ్ణంగా అభ్యసించాడు. ఆయా భాషలలో ఎన్నో రచనలు చేశాడు. అతనికి ఏదైనా పత్రికాఫీసులో వుద్యోగం చేయాలని వుంది.

అలాంటి సమయంలో అతనికి 'విశాలి' వారపత్రిక ప్రకటించిన సబ్ ఎడిటర్ ఎడ్వర్టైజ్‌మెంట్ కనిపించి వెంటనే అప్లయిచేశాడు.

అతను అప్లయి చేసినదే తడవుగా ధర్మారావుగారు కళ్లకు అద్దుకుని మరీ అతనికి వుద్యోగం ఇచ్చారు.

ఆరోజు 'విశాలి' వారపత్రిక కార్యాలయంలో శివరామ్ ఓ రచనని సీరియస్‌గా పరిశీలిస్తున్నాడు. ఆ రచన చదువుతుంటే అతనికి కడుపులో గుడగుడమని శబ్దం ప్రారంభమయింది. వెంటనే లేచి లెట్రిన్‌కి వెళ్లివచ్చాడు.

మళ్ళీ ఆ రచనని పరిశీలించడం ప్రారంభించాడు. ఈసారి అతని తల వెంట్రుకల్లో ఏదో జిల ప్రారంభమయింది. వెంటనే సెలూన్‌కి వెళ్ళి గుండు గీయించుకోవాలనిపించింది.

కుర్చీలోంచి లేచి నిలబడి బయటకు అడుగుపెట్టాడు.

ఆ సమయంలో అతనికి గుమ్మంలో ధర్మారావుగారు ఎదురువస్తూ కనిపించారు.

"ఎక్కడికోయ్ శివరామ్... పొద్దున్నే ఆఫీసు వదిలి బయలు దేరుతున్నావ్!?" అని అడిగారు.

"గుండు గీయించుకోవడానికండీ!" వినయంగా చెప్పాడు శివరామ్.

"వ్వాట్" అంటూ ఆశ్చర్యపోయారు ఆయన.

తరువాత తేరుకుని –

"నిజంగానా!?" అని అడిగారు.

"నిజం సార్! మీమీదొట్టు" అన్నాడు శివరామ్.

అతని తలకట్టుని తేరిపారజూశారు ధర్మారావుగారు.

ఎంతో అందంగా వుండే శివరామ్ ఇంతందమైన తలకట్టుని ఎందుకు పోగొట్టుకోవాలనుకుంటున్నాడో ఆయనకి అర్థంకాలేదు.

ఒక్షణం ఆలోచనలో పడ్డారాయన.

తరువాత ఏదో తట్టినవాడిలా తలపంకిస్తూ

"నువ్వేదైనా రచన పరిశీలించావా ఇప్పుడు?" అని అడిగారు.

"ఆ రచనని పూర్తిగా పరిశీలించలేదుగాని సగం వరకు పరిశీలించాను. ఈలోగా నాకు గుండు గీయించుకోవాలనిపించి ఇలా బయటకు వచ్చాను" చెప్పాడు శివరామ్.

"ఆ రచన చేసిన రచయిత పేరేంటి?" అడిగారు ధర్మారావుగారు.

"రాంబాబు అట!" అని చెప్పి, "వుండండిసార్! నేను అర్జంటుగా గుండు గీయించుకోవాలి" అని శివరామ్ వేగంగా ముందుకు అడుగులు వేశాడు.

"శివరామ్... నా మాటవిను! నామాటవిను" ధర్మారావుగారు వెనకనుంచి భుజంపట్టుకుని ఆపబోయారు.

శివరామ్ ఆ పట్టుని విడిపించుకుని పూనకం పూనినవాడిలా మరింత వేగంగా ముందుకు అడుగులు వేశాడు.

ధర్మారావుగారు అతన్ని ముందుకు వెళ్లనీ






NCL
NAGARJUNA CEMENTS LIMITED

య్యకుండా అడ్డుగా నిలబడ్డారు. అయినా ఆయన్ని పక్కకి తోసేసి ముందుకు పరుగెత్తబోయాడు శివరామ్.

అంతే! ఆయన అతనిని లాగి లెంపకాయ ఒకటిచ్చుకున్నారు.

దాంతో శివరామ్ ముఖం దిమ్మెరపోయింది.

కళ్ళు బైర్లుకమ్మాయి.

కొద్దిక్షణాలు పోయాక శివరామ్ తేరుకుంటూ ఎడిటర్‌గారిని అడిగాడు –

"ఇప్పుడు నేనెక్కడున్నాను? లోపల గదిలో కూర్చుని ఏదో కథ పరిశీలిస్తున్న నేను ఇక్కడికెలా వచ్చాను?" అని.

"నువ్వు ఏదో రచన పరిశీలిస్తున్నావని అన్నావు చూడూ.... ఆ దారుణమైన రచన పరిణామమే ఇది" అని అన్నారు ధర్మారావుగారు.

శివరామ్ ఆయన వంక అయోమయంగా చూశాడు.

"మీరంటోందేమిటో నాకు అర్థంకావడంలేదు. కాస్త వివరంగా చెప్పండి" అని అడిగాడు.

"కొద్దిక్షణాల క్రితం నువ్వు గుండు గీయించుకోవాలనుకున్నావు. ఆ విషయం నీకు గుర్తుందా?" అడిగారాయన.

"ఏమిటీ... నేను గుండు గీయించుకోవాలనుకున్నానా?! చాలా ఆశ్చర్యంగా వుందే! ఇంతకుముందెప్పుడు కూడా కలలోనైనా నాకలాంటి వూహరాలేదు. ఇప్పుడు ఈ వూహ నాకెందుకొచ్చింది? నాలో గుండు గీయించుకోవాలనే వికారం కలగడానికి కారణమేమిటి?" ఆశ్చర్యపోతూ అడిగాడు శివరామ్.

శివరామ్‌ని వెంటబెట్టుకుని ఆఫీసు గదిలోకి దారితీశారు ధర్మారావుగారు.

ఇద్దరూ కుర్చీలో ఆశీనులయ్యారు.

"ఇప్పుడు చెప్పండి సార్? నాకలాఎందుకు అయింది?!" అడిగాడు శివరామ్.

ఎడిటర్‌గారు చెప్పడం ప్రారంభించారు-

"బాబూ శివరామ్! నువ్వు ఆంధ్రావాడివైనా ఆంధ్రదేశంలో చదువుకోలేదు. ఈ ఆంధ్రదేశంలో ఏ ఒక్కడూ ఈ సబ్‌ఎడిటర్ పోస్టుకి అప్లయి చెయ్యలేదు. నీ ఖర్మకాలి నువ్వు అప్లయిచేశావు. మా ఖర్మకాలి నిన్ను పెట్టుకున్నాం. రాంబాబు అనే ఓ రచయిత పరమచెత్త రచనలు చేస్తూనే మా సంపాదకులని చాలా మందిని వాడి రచనలతో చంపేశాడు. కొంత మందికి పిచ్చెత్తించేశాడు. వాడి రచనలు పరిశీలించడంవల్ల కొంతమంది విరాగులై సన్యాసుల్లో కలిసిపోయారు. మరికొంత మంది గుండె ఆగి మరణించారు. దాంతో మిగిలిన సంపాదకులంతా పత్రికలలో తమ వుద్యోగాలకు రాజీనామాలిచ్చేసి బతుకుతెరువు కోసం మారుమూల గ్రామాలు పట్టుకుపోయారు. దాంతో ఆంధ్రదేశంలోని పత్రికలన్నీ మూతపడిపోయాయి. చివరికి ఈ ఆదరాబాదరా నగరంలో నా ఒక్క పత్రిక మాత్రమే మిగిలింది. ఇప్పుడు నీకు గుండు గీయించుకోవాలనిపించింది చూశావు? నువ్వా రాంబాబుగాడి రచనలు చదవడం వల్లనే నీకలా అనిపించింది. వాడి రచన చూస్తే ఎలాంటి సంపాదకుడికైనా చదవాలని తప్పకుండా అనిపిస్తుంది. అదే వాడి రచనల ప్రత్యేకత" అంటూ చెప్పారు ధర్మారావుగారు.

శివరామ్ నోరుతెరుచుకొని చాలాసేపు అలాగే వుండిపోయాడు.

తరువాత తేరుకుని–

"హతవిధీ! పత్రికా ప్రపంచానికి ఎలాంటి దుర్గతిపట్టింది?" బాధగా నిట్టూర్చాడు శివరామ్.

"అవును శివరామ్? ప్రస్తుతం వున్నది నా ఒక్క పత్రికే! అదికూడా మూలనపడిపోయిందంటే ఇక ఇంతే సంగతులు"

"మరి మనం ఆ రాంబాబుగాడి రచనల బారినుండి తప్పించుకునే మార్గమేలేదా?" అడిగాడు శివరామ్.

"లేదు" బాధగా చెప్పారు ధర్మారావుగారు.

"పోనీ వాడిని పైకిపంపించేస్తే ఎలా వుంటుంది?" అడిగాడు.

"హు... పిచ్చివాడా! ఆ వూహ నాకులోగడ తట్టింది. కాని...."

"మీరేమీ దిగులుపడకండి. రాంబాబుగాడి సంగతి నేను చూసుకుంటాను. సంపాదకలోకానికి చీడపురుగులా దాపురించిన వాడి పీడ లేకుండా చేస్తాను" అన్నాడు శివరామ్.




''ఎలా?'' అడిగారు ఎడిటర్‌గారు.

''చంపేస్తాను''

''బాగానే వుంది. కాని ఆ ప్రయత్నంలో నువ్వు దొరికిపోయావంటే ఏడూసలు లెఖ్ఖపెట్టుకుంటూ జెయిల్లో కూర్చోవాల్సివస్తుంది''

పత్రికా ప్రపంచానికి చీడపురుగులా దాపురించిన అలాంటి రచయితను సంహరించడంలో నేను చట్టానికి దొరికిపోయినా బాధపడను'' దృఢంగా అన్నాడు శివరామ్.

''ఇంతకాలానికి మన సంపాదకవర్గంలో నీలాంటి ధైర్యవంతుడైన సబ్ ఎడిటర్‌ని చూడగలిగాను'' అని చెప్పారు ధర్మారావుగారు.

తరువాత ఆయన లోగడ ప్రచురించిన రాంబాబు యొక్క మూడు రచనల పేర్లు చెప్పారు. రాంబాబుతో పరిచయంచేసుకోవడానికి ఆ కథలు వుపకరిస్తాయని చెప్పారు. శివరామ్ ఆ కథలపేర్లు తన డైరీలో రాసుకున్నాడు.

తరువాత ధర్మారావుగారి కాళ్లకి వంగి నమస్కరించాడు.

''విజయోస్తు'' అని దీవించారాయన.

రణభూమికి తరలివెళ్ళే యుద్ధవీరుడిలా అడుగులు ముందుకు వేశాడు శివరామ్.

'ఓ భగవంతుడా' పత్రికా ప్రపంచాన్ని రక్షించు' అంటూ భగవంతుడిని ప్రార్థించారు ధర్మారావుగారు.




శివరామ్ విశాఖప్లాట్‌ఫారంపై మెయిలు దిగాడు.

రాంబాబు అడ్రసుప్రకారం ఆటో కట్టించుకున్నాడు.

డోరు నంబర్ ప్రకారం ఇళ్ళు లెఖ్ఖపెట్టుకుంటూ ఓ ఇంటి ముందు ఆగిపోయాడు. ఆ ఇల్లు శ్మశానం వెనక వుంది. అదే రచయిత రాంబాబు ఇల్లు.

ఆ ఇల్లు బోషాణం పెట్టెలా చాలా పెద్దదిగా వుంది. చుట్టూ కాంపౌండు వాల్‌వుంది. కాని జీబురు జీబురుగా ఇంటి చుట్టూ పిచ్చిమొక్కలు లేచిపోయి వున్నాయి. ఆ ఇంటికి వెల్లవేయించి ఎన్నేళ్లయిందో కాని బయట చుట్టూ అక్కడక్కడ సున్నపు పెచ్చులు వూడిపోయి వున్నాయి.

శివరామ్ ఆ ఇంట్లో ఎవరెవరున్నారో తెలుసుకోవాలని అనుకున్నాడు. అలా అనుకున్నదే తడవుగా దారేపోయే ఓ వ్యక్తిని ''ఈ ఇంట్లో ఎవరుంటున్నారండి?'' అని అడిగాడు.

ఆ వ్యక్తి శివరామ్‌ని ఓ పిచ్చివాడిని చూసినట్టుగా చూశాడు.

'మీకు' తెలీదా? ఈ ఇంట్లో ఓ రచయిత వున్నాడు'' అన్నాడు.

''ఇంకా ఎవరెవరుంటున్నారు ఈ ఇంట్లో?'' అని అడిగాడు శివరామ్.

''వాడి ఖర్మకుతగ్గట్టు ఈ ఇంట్లో వాడికి తోడు మరొకళ్లా!'' అని, ''ఓ వూరకుక్క మాత్రం వాడికి తోడుగా వుంటోంది. దాన్ని ఈమధ్యే ఏరోడ్డుమీదో పట్టుకుని తెచ్చుకున్నాడు'' చెప్పాడా వ్యక్తి.

శివరామ్ తలపంకించుకున్నాడు.

వాడు ఒంటరివాడయితే తన పని మరీ సులభం అనుకున్నాడు.

నెమ్మదిగా కాంపౌండువాల్ గేటు తెరుచుకుని పిచ్చిమొక్కలని తప్పించుకుంటూ గుమ్మంలోకి అడుగుపెట్టాడు.

అంతే!

లోపలి నుంచి ''భౌ! భౌ! భౌ!'' అంటూ ఓ వూరకుక్క గెంతుకుంటూ వచ్చి శివరామ్ తొడపిక్క పళ్లతో పట్టుకుని లాగేసింది.

''బాబోయ్... బాబోయ్!'' అంటూ శివరామ్ చిందులు తొక్కాడు.

ఇంతలో అక్కడికి రాంబాబు పరిగెట్టుకుంటూ వచ్చి, ''ఏయ్ జానీ! జానీ!'' అంటూ దాన్ని పట్టుకుని వెనక్కి లాగి పక్కనే వున్న



స్తంభానికి గొలుసుతో కట్టేశాడు.

జానీ కరిచినచోట ఆమేరంతా పేంటు చిరిగిపోవడమేకాకుండా కండ వూడి వచ్చి రక్తం కారసాగింది శివరామ్‌కు.

"బాబోయ్... నొప్పి నొప్పి" అంటూ చిందులు వేస్తున్నాడు శివరామ్.

"ఏడవకండి ఏడవకండి మీ బాధనేను పోగొడతాను" అంటూ రాంబాబు తన కాంపౌండు ఆవరణలో వున్న పిచ్చి మొక్కల ఆకులు కోసుకువచ్చి వాటి పసరు పిండి శివరామ్‌కు కట్టుకట్టాడు.

అదేం విచిత్రమోకాని ఆ పిచ్చి ఆకుల పసరు పిండగానే శివరామ్ నొప్పి చేత్తో తీసేసినట్టుగా అయిపోయింది.

వెంటనే గోల పెట్టడం ఆపేశాడు.

రాంబాబు "హీ... హీ... హీ..." అని నవ్వుతూ-"నా ఇంటి ఆవరణలో వున్న ఈమొక్కలన్నీ రకరకాల జబ్బుల నివారణకు వుపయోగపడ

తాయి. శాస్త్రజ్ఞులు మందు కనిపెట్టలేని కొన్ని జబ్బులను కూడా ఈ ఆకుల పసర్లు అతి తేలిగ్గా తగ్గించేస్తాయి'' అని చెప్పాడు.

శివరామ్ నోరు తెరుచుకుని కాసేపు అలాగే వుండిపోయాడు.

''ఆ... ఇప్పుడు చెప్పండి మీరెవరు? ఎందు కొచ్చారు? నా ఇంటికి పోస్టుమేన్ తప్ప ఇప్పటి దాకా ఎవరూ రాలేదు'' అన్నాడు రాంబాబు.

''నా పేరు శివరామ్. నేను మీ అభిమానిని'' అని చెప్పాడు శివరామ్.

''వ్వాట్... మళ్ళీ చెప్పండి!'' నమ్మలేన ట్టుగా అడిగాడు రాంబాబు.

''అవును... నేను మీ అభిమానిని. ఆ మధ్య పత్రికలలో 'మిరపకాయకు మనసుంది', 'జెర్రి నవ్వింది' 'కుక్క ఏడ్చింది' అనే మీ కథలని నేను చదివాను. మీ 'మిరపకాయకీ మన స్సుంది, రచనలో... అంటూ శివరామ్ ఏదో చెప్పబోతూంటే-

''హిప్ హిప్ హుర్రే!'' అంటూ రాంబాబు శివరామ్‌ని కౌగలించుకుని గుండ్రంగా తిప్పేశా డు.

''ఇంక మీరేమీ చెప్పనవసరంలేదు. మీరు నా అభిమాని అని అర్థమయింది. లోపలికి వెళదాం పదండి'' అంటూ శివరామ్‌ని తన గదిలోకి తీసుకువెళ్ళాడు.

బోషాణం పెట్టిలాంటి ఆ ఇంటిని పరీక్షగా చూశాడు శివరామ్. లోపల అక్కడక్కడ విరిగి వున్న దూలాలతో అది రేపోమాపో కూలిపోయే భూత్‌బంగళాలా వుంది. ఇల్లంతా ఎక్కడప డితే అక్కడ రాంబాబు తిరిగొచ్చిన వేలాది కథలు చిందరవందరగా పడి ఉన్నాయి.

రాంబాబు తన టేబుల్ దగ్గర వున్న ఓ కుర్చీలో కూర్చుని శివరామ్‌కి పక్కనే వున్న మరో కుర్చీ చూపించాడు.

శివరామ్ కుర్చీలో ఆసీనుడయ్యాక-

''నన్నూ, నా రచనలని అర్థం చేసుకునే వ్యక్తి నాకింత కాలానికి దొరికారు. ముందుముందు నా రచనలు పత్రికలలో పుంఖానుపుంఖాలుగా వస్తాయనే ఆశ నాలో బలీయంగా వుంది. అందుకే నా రచనలు తిరిగి వస్తూంటే మరిన్ని రాసి పత్రికలకి పంపిస్తున్నాను'' చెప్పాడు రాంబాబు గర్వంగా.

'' మీ కృషి ఫలించాలని, మీరేనాటికైనా గొప్ప రచయిత కావాలని మీ అభిమానిగా నేను కోరుకుంటున్నాను'' అన్నాడు శివరామ్.

రాంబాబు బొబ్బట్టులా పొంగిపోయాడు.

''చెప్పండి... కాఫీ తీసుకుంటారా? కూల్ డ్రింక్ తీసుకుంటారా?''

''కాఫీ తీసుకుంటాను''

రాంబాబు పక్కనే వున్న స్టౌ ముట్టించి పావుగంటలో కాఫీ తయారు చేశాడు.

ఈలోగా శివరామ్ తన జేబులో చెయ్యిపెట్టా డు. సీసా తగిలింది. కాఫీ కప్పులో ఎలా కలపడమా అని ఆలోచనలో పడ్డాడు.

రాంబాబు కాఫీ రెండు కప్పుల్లోకి వంపి, ఓ కప్పు శివరామ్‌కి అందించి, తానొక కప్పు తీసుకున్నాడు.

''అరే... నా పర్సు పడిపోయిందండీ!'' అంటూ శివరామ్ అటూఇటూ గాభరాగా చూడ సాగాడు తన చేతిలో వున్న కాఫీ కప్పుని టేబుల్ మీద పెట్టి.

రాంబాబు కూడా తన కాఫీ కప్పుని టేబుల్ మీద పెట్టేసి- ''ఎక్కడ పడిపోయిందండీ... ఇక్కడేనా!'' అంటూ టేబుల్‌కిందికి వంగి అటుఇటు చూస్తున్నాడు.

రాంబాబు టేబుల్ కిందికి వంగగానే, శివ రామ్ జేబులోంచి సీసా తీసి నాలుగైదు చుక్క లు రాంబాబు కాఫీ కప్పులో వంపేసి, సీసా మళ్ళీ జేబులో పెట్టేసుకున్నాడు.

''అరెరే... నా పర్సు నా జేబులోనే వుందండీ! సరిగా చూసుకోక కంగారులో పోయిందేమో అనుకున్నాను'' అన్నాడు శివ రామ్ జేబులోంచి పర్సు బయటికి తీస్తూ.

రాంబాబు టేబుల్ కింది నుంచి లేచాడు.

''పోనీలెండి కంగారుపడితే పడ్డారు. మొత్తా నికి పర్సువుంది కదా!'' అని అన్నాడు.

తరువాత ఇద్దరూ టేబుల్ మీద కాఫీ కప్పు అందుకుని కబుర్లు చెప్పుకుంటూ తాగేశారు.

ఆ వెంటనే రాంబాబు కడుపులో వికారం ప్రారంభమయింది. తలతిరగసాగింది.

నాలుక పిడుచగట్టుకుపోయినట్టుగా అయి





పోయి నరాలు తోడుకుపోసాగాయి.

"ఇదేమిటి... నాకేమయింది?" రాంబాబు గాభరా పడుతూ అన్నాడు.

"హ్హహ్హ హ్హ" అంటూ వికటంగా నవ్వాడు శివరామ్. "ఉరేయ్ రాంబాబూ... ఇంతటితో నీపని సరి! నిజానికి నేను నీ అభిమానిని కాను. 'విశాలి' వారపత్రిక సబ్ఎడిటర్‌ని. నీ రచనల బారిపడి మా సంపాదకులు చాలా మంది చచ్చిపోయారు. అందుకే నిన్ను చంపాలని నేను వచ్చాను. నీకు కాఫీలో విషం కలిపేశాను" చెప్పాడు శివరామ్ గొప్పగా.

అంతే!

రాంబాబు వేగంగా పడుతూ లేస్తూ తన ఇంటి ఆవరణలో వున్న పిచ్చి మొక్కల వైపు పరిగెత్తాడు. అక్కడ వున్న ఓ పిచ్చి మొక్క ఆకులు ఐదారు తెంపుకుని అక్కడికక్కడే నమిలి మింగేశాడు.

ఆశ్చర్యం!

రాంబాబు కడుపులో వికారం ఆగిపోయింది.

తల తిరగడం మానేసింది. నరాలు తోడుకుపోవడం మానేశాయి.

నాలుక పిడచగట్టడం ఆగిపోయింది.

నిటారుగా ఆరోగ్యంగా నిలబడ్డాడు.

ఈసారి-

"హ్హహ్హ హ్హ" అంటూ రాంబాబు నవ్వాడు.

"ఉరేయ్... తాడిని తన్నేవాడుంటే వాడి తలని తన్నేవాడు ఇంకొకడుంటాడని మరిచిపోకు. నేను నీకంటే నాలుగాకులెక్కువే చదివాను. ఈ ఇంటి ఆవరణలో రకరకాల పిచ్చి మొక్కలు చూశావా! ఈ మొక్కల ఆకులు రకరకాల జబ్బులకు విరుగుళ్ళే కాకుండా రకరకాల విషాలను కూడా విరిచేస్తాయి. ఇప్పుడు నేనీ ఆకులు తినడం వల్ల నువ్విచ్చిన విషం విరిగిపోయింది" అన్నాడు.

అంతే!

శివరామ్ నిలువుగుడ్లు వేసుకుని ఉండిపోయాడు.

"ఉరేయ్... నువ్వు నన్ను చంపాలని చూస్తావురా!" అంటూ శివరామ్ మీద ఒక్కసారిగా విరుచుకుపడబోయాడు రాంబాబు.

శివరామ్ కాలికి బుద్ధిచెప్పాడు.

వెంటనే రాంబాబు తన వూర కుక్క జానీ మెడలో గొలుసు విప్పి శివరామ్ మీదికి వుసిగొలిపాడు.

జానీ శివరామ్‌ని తరమసాగింది.

శివరామ్ ఎంత పరిగెట్టినా నాలుగైదు చోట్ల అతని పిక్కలని కసిక్కిన కొరికేసంది జానీ.

శివరామ్ పరిగెట్టలేక ఆయాసపడుతున్నాడు.

ఓ వంక జానీ ఇంకా వెంట తరమసాగింది.

అందినచోటల్లా కరిచేస్తోంది.

ఇక తన పని అయిపోయిందనే అనుకున్నాడు శివరామ్.

ఇంతలో "ఎక్కండి సార్" అంటూ ఓ ఆటో అతని ముందుకు దూసుకువచ్చింది.

శివరామ్ ఎక్కడమే తరువాయి ఆ ఆటో డ్రైవరు ఆటో జోరుగా ముందుకు లాగించేశాడు.

జానీ వెనకబడిపోయింది.

జానీ కరిచిన కాట్ల బాధతో పైకి ఏడవలేక లోలోపలే "బాబోయ్! అమ్మోయ్!" అని ఏడుస్తూ- "నా ప్రాణానికి ఇదెక్కడ దాపురించిందిరా బాబూ" అని పైకి అన్నాడు.

ఆ మాటకి ఆటోవాడు వెనక్కి తిరిగి శివరామ్‌ని చూసి జాలిగా నవ్వాడు.

"ఆ పిచ్చి రచయిత ఆ వూరకుక్కని తెచ్చిపెంచుకోవడానికి వెనక చాలా పెద్ద కథ వుంది సార్" అన్నాడు ఆటోవాడు.

"ఏమిటీ... ఆ పిచ్చి రచయిత నీకు తెలుసా?" ఆశ్చర్యంగా అడిగాడు శివరామ్.

'అవునుసార్... అతను నాకు తెలుసు. నేను వుంటోంది కూడా ఆ ఏరియాలోనే!" అన్నాడు ఆటోవాడు.

"అయితే వాడు ఆ వూర కుక్కని పెంచుకోవడానికి గల కారణమేమిటి?" అని అడిగాడు శివరామ్.

"వినండి చెబుతాను" అంటూ ఆటోవాడు చెప్పడం మొదలుపెట్టాడు.

* * *

రచయిత రాంబాబు శ్మశానం వెనుక వున్న ఆ ఇంట్లో కొత్తగా అద్దెకు దిగిన రోజుల్లో ఆ ఇంటి చుట్టుపక్కలవాళ్ళంతా అతన్ని వింతగా చూశారు. ఎంచేతంటే భూత్ బంగళాలా వుండే ఆ ఇంట్లో చాలాకాలందాకా ఎవరూ అద్దెకు దిగలేదు.

ఆ ఇంట్లో దిగిన కొద్ది రోజులకి రాంబాబు రచనలు చేయడం ప్రారంభించాడు.

అతను రచనలు చేస్తున్నప్పుడు పాత్రలలో లీనమైపోయి మరీ రచనలు చేసేవాడు. కథలో వాటిని మాట్లాడిస్తూ పైకి తనూ మాట్లాడేవాడు. వాటిని ఏడిపిస్తూ తనూ ఏడ్చేవాడు. వాటిని నవ్విస్తూ తనూ నవ్వేవాడు. ఇంకా కథలో ఆ పాత్రలతో కుస్తీ పడుతున్నప్పుడు పిచ్చి పిచ్చిగా కేకలు వేసేవాడు. వెర్రిగా నవ్వేవాడు.

కొత్తలో అతని చేష్టలు చూసిన చుట్టుపక్కలవాళ్ళు అతన్ని ఏదైనా పిచ్చికుక్క కరిచిందేమోనని కంగారు పడ్డారు. ఆ ఇంటి ఛాయలకి వెళ్ళడానికి ఎవరికీ ధైర్యం చాలక పోయినా ఒకరిద్దరు యువకులు అతని ఇంటికి ధైర్యంగా వెళ్ళి లోపలికి తొంగిచూశారు.

రాంబాబు చేతిలో ఏవో కాగితాలు వున్నాయి. ఆ కాగితాల మీద అతని కలం పరుగులు పెడుతోంది. అలా కలాన్ని కాగితాల మీద పరుగులు తీయిస్తూనే వెక్కివెక్కి ఏడుస్తున్నాడు. పిచ్చిగా జుత్తు పీక్కుంటున్నాడు. వెర్రిగా నవ్వుతూ కేకలు పెడుతున్నాడు.

"మీకేమయింది సార్ఎందుకలా ఏడుస్తున్నారు..." అని అడిగారు యువకులు.

రాంబాబు సీరియస్‌గా వాళ్ళవంక చూసి-

"కథ రాస్తున్నాను" అని చెప్పాడు.

వాళ్ళు బిత్తరపోయారు.

"వీడెవడో పిచ్చి రచయిత అన్నమాట" అని మనసులో అనుకున్నారు వాళ్ళు. తరువాత ఆ విషయం చుట్టుపక్కలవాళ్ళందరితోనూ చెప్పారు. ఆ విధంగా రాంబాబు రచనా వ్యాసంగం గురించి అందరికీ తెలిసింది.

అది మొదలు వాళ్ళు రాంబాబు ఇంటి వైపు తొంగి చూడ్డం మానేశారు.

రాంబాబు వారంరోజులకోసారి బట్టలు మారుస్తాడు. పదిహేను రోజులకోసారి గడ్డం గీస్తాడు. ఇరవైరోజులకోమారు స్నానం చేస్తాడు. అతను రోడ్డుమీద నడుస్తూంటే మట్టికంపు, చెమట కంపు కొడుతూంటాడు. అది భరించలేక అతని పక్కన నడుస్తున్న వాళ్ళు ముక్కులు మూసుకుని అవతలకి వెళ్ళిపోతూంటారు. మరి అతని ఆఫీసులోని అతని కొలీగ్స్ అతని కంపుని ఎలా భరిస్తున్నారో ఇప్పటికీ అర్థంకాని సమస్యగానే మిగిలిపోయింది.

ఇదిలా ఉండగా రాంబాబు ఇంట్లో ఓ దొంగపడ్డాడు.

అది చాలా విచిత్రంగా జరిగింది.

ఆరోజు రాత్రి—

రాంబాబు ఓ విషాదభరితమైన రచన చేస్తున్నాడు. ఆ రచనలో శోకం పాలు ఎక్కువ అవడం వలన రాంబాబు దారుణంగా కేకలు వేస్తూ ఏడవసాగాడు. ఆ దుఃఖంలో అతనికి అలసట వచ్చింది. శోషవచ్చి అలాగే టేబుల్ మీద తలవాల్చేసి నిద్రలోకి జారిపోయాడు.

ఇంటి తలుపులు బార్లాతెరిచి వుండటం చూసి ఓ దొంగ ఇంట్లోకి జొరబడ్డాడు.

రాంబాబు టేబుల్ దగ్గరకు పిల్లిలా వెళ్ళాడు.

లైటు వెలుతురులో టేబుల్ మీద వున్న అతని రచన చూశాడు.

ఆ రచన చూడగానే ఆ దొంగ తాను దొంగతనానికి వచ్చానన్నమాట మరచిపోయాడు.

వెంటనే కుతూహలంగా ఆ రచనని చేతుల్లోకి తీసుకుని చదవడం మొదలుపెట్టాడు. అంతే!

ఆ దొంగ హృదయంలో ఏదో కలవరం ప్రారంభమయింది.

కడుపులో దేవడం ప్రారంభమయింది.

నరాలు చిట్లిపోతున్నట్టుగా తలలోంచి ఏవో శబ్దాలు వెలువడ్డాయి.

వెంటనే పాంటులోనే విరోచనమయింది.

ఆ వెంటనే దొంగ ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయి.

మర్నాడు రాంబాబుకి మెలుకువ వచ్చి చూసుకునే సరికి పక్కనే దొంగ చచ్చిపడి వున్నాడు.

రాంబాబు వెంటనే దొంగ చచ్చిపడి వున్న




విషయాన్ని పోలీసులకి తెలియజేశాడు- తన వంతు విధిగా.

ఆ పోలీసులు దొంగశవాన్ని పోస్టుమార్టమ్‌కి పంపించడం... ఆ పోస్టుమార్టమ్‌లో దొంగ హఠాత్తుగా గుండె ఆగి మరణించాడని తేలిపోవడం జరిగిపోయాయి.

అయితే అతను హఠాత్తుగా ఎందుకు గుండె ఆగి మరణించాడో ఎవరికీ అంతు తేలని విషయంగానే మిగిలిపోయింది.

ఆ సంఘటనతో రాంబాబు ఒక నిర్ణయానికి వచ్చాడు.

ఆ దొంగ తన రచనలని దొంగిలించుకుపోవడానికే తన ఇంట్లో జొరబడ్డాడు. కాబట్టి ఇక నుంచి తను జాగ్రత్తగా వుండాలి... ముందు ముందు 'ఏ దొంగ కూడా తన ఇంట్లో దూర కుండా చేసుకోవాలి' అనుకున్నాడు.

అలా అనుకున్నదే తడవుగా వీధులన్నీ గాలించి ఓ వూరకుక్కని తెచ్చి పెంచుకోసాగాడు.

పాపం... అతను దానికి తిండీతిప్పలు ఏమీ పెట్టడు.

ఆ వూరకుక్క ఆ ఇంటి ఆవరణలోని పిచ్చి మొక్కల ఆకులను తింటూ కడుపు నింపుకుంటూ కాలం గడిపేస్తోంది.

★ ★ ★

ఆ కథ విన్న శివరామ్ బుర్రగిర్రెత్తిపోయింది.

'పాపం!' అని ఆ దొంగ మీద జాలిపడ్డాడు.

"అంతేకాదు సార్! ఆ పిచ్చి రచయిత రచన చదివి ఓ పోస్టుమాన్ మాయమైపోయాడు" చెప్పాడు ఆటోవాడు.

"ఈజిట్?" ఆశ్చర్యపోయాడు శివరామ్.

"అవును సార్- పోస్టుమాన్‌లు చెప్పుకుంటుంటే విన్నాను"

'హతవిధీ!' అంటూ ఆక్రోశించింది శివరామ్ హృదయం.

ఆటో ముందుకు దూసుకుపోతోంది.

శివరామ్ ఆలోచించసాగాడు

తన ప్లాన్ బెడిసికొట్టింది.

ఇప్పుడు మరో ప్లాను ఆలోచించాలి!

ఆ రాంబాబుగాడిని ఎలాగైనా చంపేయాలి!!

సంపాదక లోకానికి పట్టిన వాడి పీడని విరగడ చేయాలి!!!

ఎలా?

ఎలా?

దీర్ఘంగా ఆలోచిస్తున్న శివరామ్‌కి ఓ ఐడియా తట్టింది.

ఆ ఐడియా ఏమిటంటే- రాంబాబుకి ఏక్సిడెంట్ చేసి చంపేయాలి.

రాంబాబు ఇంటికి, సీతమ్మధార జంక్షన్‌కి మధ్య ఓ సన్నపాటి సందు వుంది. రాంబాబే కాకుండా ఆ ఏరియాలో వున్నవాళ్ళెవరైనాసరే ఆ సందులోంచే వెళ్ళాలి, రావాలి. కాబట్టి రాంబాబు ఆ సందుగుండా నడుస్తున్నప్పుడు అతని మీదికి మోటర్‌సైకిల్ నడపాలి. అతను కిందపడిపోగానే మళ్ళీ మోటారు బైక్‌ని వెనక్కి తిప్పిదాంతో అతని తల మట్టించేయాలి- అని అనుకున్నాడు శివరామ్.

ప్లాన్ బాగానే వుంది. కాని మోటర్‌బైక్ సంపాదించడమెలా?

వెంటనే శివరామ్ మదిలో తన మిత్రుడు సదానందం మెదిలాడు.

సదానందం అతనితోపాటే ఢిల్లీ యూనివర్సిటీలో చదువుకున్నాడు. ప్రస్తుతం సదానందం విశాఖపట్నంలోనే ఎల్లమ్మతోట దగ్గర వంటరిగా వుంటున్నాడు. సదానందాన్ని కలుసుకుంటే తనకి మోటార్ బైక్ సులభంగా దొరకొచ్చు.

శివరామ్ ఎగిరి గంతేసినంత పనిచేశాడు.

"ఆటోని ఎల్లమ్మ తోటకి పోనీయ్" చెప్పాడు శివరామ్.

మరో ఐదో నిముషాల్లో ఆటో జగదాంబ జంక్షన్ అని పిలవబడే ఎల్లమ్మతోట జంక్షన్‌లో ఆగింది.

ఆటోలోంచి కిందికి దిగి, ఆటోవాడికి డబ్బులిచ్చేశాడు శివరామ్.

ఆటో ముందుకు దూసుకుపోయింది.

ఆ ఇంటి ముందు నిలబడి శివరామ్ కాలింగ్‌బెల్ నొక్కాడు.

ఓ నిమిషం పోయాక తలుపులు తెరుచుకున్నాయి.

ఎదురుగా సదానందం నిలబడి వున్నాడు.

ఇరువురూ ఆనందంగా ఒకరినొకరు కౌగలించుకున్నారు. "ఎంత కాలమైందిరా నిన్ను చూసి" ఆప్యాయంగా అన్నాడు సదానందం.

తరువాత శివరామ్‌ని ఎగాదిగా చూస్తూ--

"ఒరే... ఇదేమిటి? నీ కాలిమీద కండలు ఇలా వూడి వచ్చేశాయి. ఈ రక్తం ఏమిటి? నీపాంటు ఇలా చిరిగిపోయిందేం?" అంటూ గాభరాగా అడిగాడు.

ఆ ప్రశ్నలకు శివరామ్ పేలవంగా నవ్వాడు.

అసలు విషయం చెబితే, సదానందం మోటర్‌బైక్ ఇవ్వడని, "దారిలో వస్తుంటే ఓ వూరకుక్క వెంటబడి కరిచింది" అని చెప్పాడు శివరామ్.

"అయ్యో పాపం!" అని నొచ్చుకున్నాడు సదానందం.

లోపలి నుంచి బేండేజ్, అయోడిన్ తీసుకు వచ్చి కుక్క కరిచిన ఆ గాయాలకు కట్టుకట్టాడు.

"ఆ... ఇప్పుడు చెప్పు? ఏవిటి విశేషం? నువ్వు వచ్చిన పనేమిటి?" అని అడిగాడు సదానందం.

"ఏమీ లేదు. చిన్న పనిమీద విశాఖ వచ్చాను. ఇలా నిన్ను కలుద్దామని వచ్చాను" చెప్పాడు శివరామ్.

కొంచెంసేపు ఆ మాటా ఈ మాటా మాట్లాడాక--

"నాకు ఓసారి మోటారు బైక్ కావాలిరా సదానందం" అన్నాడు శివరామ్.

"ఎందుకు?" అడిగాడు సదానందం.

"మోటారు సైకిల్‌మీద సరదాగా విశాఖ వీధులన్నీ వీరవిహారం చేద్దామని వుంది" అసలు విషయం చెబితే సదానందం జడిసి మోటారు సైకిల్ ఇవ్వడేమోనని అలా అని చెప్పాడు శివరామ్.

"మోటార్ సైకిల్ నా ఫ్రెండ్ ఒకతనికి వుంది. అతడిని అడిగి సాయంకాలం నీకిప్పిస్తాను" చెప్పాడు సదానందం.

★ ★ ★

సాయంకాలమయింది.

సదానందం శివరామ్‌ని వెంటబెట్టుకుని తన స్నేహితుడి దగ్గరకు తీసుకెళ్ళాడు.

"ఉరేయ్ చక్రపాణీ! ఇతను నా మిత్రుడు శివరామ్" అంటూ శివరామ్‌ని అతనికి పరిచయం చేశాడు సదానందం.

ఇరువురూ "గ్లాడ్ టు మీట్యూ!" అని చేతులు కలుపుకున్నారు.

తరువాత--

"నా మిత్రుడికి నీ బుల్లెట్ ఒకసారి కావాలి" చెప్పాడు సదానందం.

"ఉండండి నా భార్యని అడిగి చెబుతాను" అన్నాడు.

చక్రపాణి దగ్గరకు ఎవరైనా ఏదైనా కావాలని వస్తే-- అతను తన భార్యని అడిగికాని ఏ వస్తువూ ఇతరులకి ఇవ్వడు. అతను ప్రతిదానికి భార్యమీదే ఆధారపడతాడు.

చక్రపాణి లోపలకి వెళ్ళాడు. మళ్ళీ ఓ నిముషంలో తిరిగి వచ్చి, "నాకు మళ్ళీ బండి మీరెప్పుడు తిరిగిచ్చేస్తారు?" అని అడిగాడు.

"రెండు మూడురోజులు పట్టొచ్చు" చెప్పాడు శివరామ్.

చక్రపాణి మళ్ళీ లోపలికి వెళ్ళి తిరిగివచ్చాడు.

"నా భార్య మిమ్మల్ని బండి తీసుకువెళ్ళమంటోంది. కాని చాలా జాగ్రత్తగా అప్పజెప్పాలి. తిరిగి ఇచ్చేసేటప్పుడు పెట్రోల్ నిండుగా కొట్టించి మరీ ఇవ్వాలి" అంటూ కండిషన్ పెట్టాడు చక్రపాణి.

"ఓకే అలాగే" అన్నాడు శివరామ్.

తరువాత సదానందం, శివరామ్ బయటికి వచ్చి బుల్లెట్ ఎక్కారు.

శివరామ్ కిక్ కొట్టి స్టార్ట్ చేశాడు.

బుల్లెట్ ముందుకు దూసుకుపోయింది.

సదానందాన్ని అతని ఇంటి దగ్గర దింపి, బుల్లెట్‌ని శ్మశానం వైపు పరిగెట్టించాడు శివరామ్.

అతనికి విశాఖ వీధులు కొత్త అయినా ఆటోలో వచ్చినప్పుడు తోవ గుర్తు పెట్టుకున్నాడు.

మోటారు సైకిల్ జంక్షన్ చేరుకుంది.

అక్కడ ఎదురుగా వున్న కిళ్ళీబడ్డీ దగ్గర




'ఒరేయ్ రాంబాబు... రేపు ఈపాటికి నీ శవం ఈ శ్మశానంలో బూడిదగా మాడిపోతుంది రేయ్! నీ పని అవుట్! గొణుక్కున్నాడు శివ రామ్, ఆ దారి అంతా వివరంగా చూస్తూ.

మర్నాడు వుదయమే ఏడుగంటలకల్లా శివరామ్ బుల్లెట్ మోటార్ సైకిల్ మీద అక్కడ కాశాడు.

రాంబాబు ఇంటికి, జంక్షన్‌కి మధ్య వున్న సన్నపాటి సందు చివర బండితో ఎదురుచూడ సాగాడు.

ఓ అరగంట గడిచింది.

సందుకి ఆ చివరలో రాంబాబు వస్తూ కనిపించాడు.

సందు నిర్మానుష్యంగా వుంది.

సందులో ఈ చివరనుండి ఆ చివరిదాకా రాంబాబు తప్ప ఇంకెవరూ లేరు.

శివరామ్ మనస్సు ఆనందంతో గంతులువే సింది.

ఈ దెబ్బతో రాంబాబుగాడి పని అవుట్.!

వాడిని ఒకే దెబ్బతో బండిమీద డేష్‌కొట్టి రెండో దెబ్బకు తల మట్టించేయాలి.!

వెంటనే ఎనభైమైళ్ళ స్పీడ్‌తో బుల్లెట్‌ని స్టార్ట్ చేశాడు శివరామ్.

బుల్లెట్ పెద్దశబ్దంతో వేగంగా ముందుకు దూకింది.

రాంబాబుకి హాండిల్ తిన్నగా గురిపెట్టి నడిపించాడు శివరామ్.

బండి రాంబాబుకి అడుగు దూరంలో సమీ పించింది.

ఈ దెబ్బతో నీపనిసరి అని అనుకున్నాడు శివరామ్ మనస్సులో.

కాని-

అంతవరకు తల దించుకుని నడుస్తున్న రాంబాబు హఠాత్తుగా తలపైకెత్తి రానున్న ప్రమాదాన్ని పసిగట్టేశాడు.

అంతే! శివరామ్ బుల్లెట్‌ని అతనికి గుద్దె య్యబోతుండగా-

బండి వెంట్రుకవాసి దూరంలోకి రాగానే-

అమాంతంగా పక్కనే ఉన్న గోడమీదికి హైజంప్ చేసి నిలబడ్డాడు.

పక్కనే ఉన్న ఆ గోడకి పెద్దశబ్దంతో గుద్దు కుంది.

శివరామ్ అల్లంత దూరాన ఎగిరిపడ్డాడు.

బండిగోడకు గుద్దుకోవడంతో తుక్కుతుక్కై పోయింది.

కిందపడ్డ శివరామ్ కాలు, చెయ్యి విరిగిపో యాయి.

"అమ్మోయ్... నాకాలు... అమ్మోయ్.... నా చెయ్యి..." అంటూ శివరామ్ బాధతో గోలపె ట్టడం ప్రారంభించాడు.

శివరామ్‌ని గుర్తుపట్టిన రాంబాబు గోడ మీంచి కిందకి దూకాడు.

"ఏరా... మొన్నేమో నాకు కాఫీలో విషప్ర యోగం చేశావ్! ఈరోజేమో నాకు యాక్సిడెంట్ చేసి చంపాలని చూశావు. నిన్ను ఊరికే వదల ను" అంటూ కిందపడ్డ శివరామ్‌ని లేవదీశా డు.

కర్రపుల్లని విరిచేసినట్లు అతడి రెండో చె య్యిని కూడా వంచి విరిచేశాడు.

"అమ్మోయ్... బాబోయ్" అంటూ మరింతగా గోలపెట్టసాగాడు శివరామ్.

"బీకేర్! మళ్ళీ ఈసారి నా జోలికివచ్చా వంటే నిన్ను ప్రాణాలతో వదలను" అని హెచ్చ రించి ముందుకు తాపీగా అడుగులు వేసు కుంటూ వెళ్ళిపోయాడు రాంబాబు.

పాపం! విరిగిన ఎముకల బాధతో శివరామ్ పడ్డపాట్లు కుక్కలు కూడా పడలేదు.

మరో అరగంటదాకా నిర్మానుష్యంగా ఉన్న ఆ సందులోకి ఎవరూ అడుగుపెట్టలేదు

తరువాత ఎవరో పుణ్యాత్ముడు సందులోంచి పోతూ శివరామ్‌ని చూసి జాలిపడి అతన్ని కె.జి.హెచ్.లో జాయిన్‌చేశాడు.

ఈ వార్త తెలిసి సదానందం, చక్రపాణి కె.జి.హెచ్.కు పరిగెట్టుకొచ్చారు.

సదానందం శివరామ్‌ని జాలిగా చూశాడు.

కాని-

చక్రపాణి మాత్రం శివరామ్‌ని తినేసేలా కొరకొరా చూస్తూ, "నిక్షేపంలాంటి నా బండికి

యాక్సిడెంట్ చేసి తుక్కు చేసేశావు. నీకు బుద్ధుందా?'' అని అడిగాడు.

''క్షమించండి. ఏదో పొరపాటైపోయింది'' బెడ్‌మీద నిస్తేజంగా పడుకుని ఉన్న శివరామ్ దీనంగా క్షమాపణ చెప్పుకున్నాడు.

''పొరపాటైపోయింది అంటే ఊరుకుంటాన నుకుంటున్నావా? దాని రిపేరుకి అయ్యే డబ్బంతా కక్కు'' చక్రపాణి నిలదీశాడు.

''రిపేర్‌కి ఎంతవుతుందని చెప్పాడు మెకానిక్?'' అడిగాడు సదానందం.

''మూడువేలు'' చెప్పాడు చక్రపాణి.

''ఇప్పుడు నా దగ్గర అంత డబ్బులేదు'' అన్నాడు శివరామ్.

''అదంతా నాకనవసరం. నువ్విస్తావా ఛస్తావా- ఒక్కటేమాట చెప్పు'' అంటూ కొట్టేవాడిలా మంచం మీద పడుకుని ఉన్న శివరామ్ మీది మీదికి వస్తూ అడిగాడు చక్రపాణి.

సదానందం చక్రపాణిని వెనక్కులాగాడు.

''ఉరేయ్ చక్రపాణీ! నీకు బుద్ధుందా? శివరామ్ ఎవరనుకుంటున్నావు? నీలాగే వాడూ నాకు ఫ్రెండు. చేతులు, కాలు విరిగి వాడేడుస్తూంటే ఈ సమయంలో నువ్వు డబ్బుకోసం వాడినిలా బాధపెట్టడం భావ్యంకాదు. నెమ్మదిగా వాడి ఆరోగ్యం కోలుకున్నాకనే డబ్బు నీకిస్తాడులే- నా మాటవిను!'' అంటూ నచ్చజెప్పబోయాడు సదానందం.

''లాభంలేదు. ఇతను డబ్బు నాకిప్పుడే ఇవ్వాలి. అంతవరకు ఇక్కడినుంచి కదలను'' అంటూ భీష్మించుకుని పక్కనే ఉన్న స్టూలుమీద కూర్చుండిపోయాడు చక్రపాణి.

సదానందానికి కోపం వచ్చింది.

''ఛీ... నువ్వసలు స్నేహితుడివేనా? నీకు అవసరంలో నేను ఎన్నిసార్లు డబ్బు ఇవ్వలేదు! ఎన్నోసార్లు నీకు వేలు ఇచ్చానే! ఆ వేలన్నీ నువ్విచ్చేదాకా వెయిట్ చేశానే తప్ప...నిన్నివ్వమని నేనెప్పుడైనా నీ పీకల మీద కూర్చున్నానా!? ఈనాడు నా మిత్రుడు ఏదో నీ బండికి ఏక్సిడెంటు చేశాడని ఇప్పటికిప్పుడే డబ్బు ఇవ్వమని పీకలమీద కూర్చుంటావా? నీకు బుద్ధుందా?''అంటూ చెడామడా దులిపేశాడు సదానందం.

ఆ మాటలకి చక్రపాణి బావురుమని ఏడ్చేశాడు.

''ఉరేయ్! నాకు స్నేహం విలువ తెలుసు. కాని ఈ విషయంలో నేను అశక్తుడిని. నా అశక్తతకు కారణం నా భార్య. ఇప్పుడు బండికి యాక్సిడెంటయ్యిందని నా భార్యకి తెలిసిందంటే, దాని రిపేరు సరిపడా డబ్బు తీసుకురాకపోతే...నా పెళ్లాం నాకు కూడు కూడా పెట్టదు. పైగా నన్ను చీపురుతో తంతుంది. నానామాటలు అంటుంది. కాబట్టి నువ్వే చెప్పు. నేను కూడు లేకుండా ఉండి నా భార్య చేత చీపురుతో తన్నులుతిని ఉండాలంటావా?'' అంటూ వెక్కివెక్కి ఏడవసాగాడు.

పాపం! శివరామ్‌కి, సదానందానికి అతనిని చూస్తుంటే జాలేసింది.

''బాధపడకండి చక్రపాణిగారూ!'' ఓదార్చబోయాడు శివరామ్.

చక్రపాణి ఇంకా గట్టిగా ఏడవసాగాడు.

పాపం! శివరామ్‌కి మరింత జాలేసింది.

వెంటనే తన మెడలో ఉన్న బంగారంగొలుసు తీసి చక్రపాణికి ఇమ్మని చెప్పాడు సదానందంతో. సదానందం అలాగే చేశాడు.

''ఇదుగోండి. ఈ గొలుసు ఈమధ్యనే మా బామ్మ నామీద ప్రేమతో నాకుచేయించి ఇచ్చింది. ఎట్టి పరిస్థితులలోనూ ఈ గొలుసుని నా మెడలోనుంచి తీయవద్దని చెప్పింది. కానీ ఈనాడు మీ ఏడుపు మా బామ్మ ప్రేమని జయించింది. అందుకే ఈ గొలుసు మీకు ఇచ్చేస్తున్నాను. ఇది అమ్మితే మూడువేలు పైనే వస్తుంది. దానిని అమ్మేసి మీ బుల్లెట్ బండిని మరమ్మత్తు చేయించుకోండి'' అని చెప్పాడు శివరామ్.

వెంటనే చక్రపాణి ఏడుపు ఆగిపోయింది.

''థాంక్యూ శివరామ్‌గారూ! నా భార్య చేత నేను తన్నులు తినకుండా కాపాడారు. నన్ను నా భార్య పెట్టబోయే వస్తులు నుంచి గట్టెక్కించారు'' అంటూ పదే పదే కృతజ్ఞతలు చెప్పుకుని అక్కడి నుంచి లేచి వెళ్ళిపోయాడు.

శివరామ్ తన గొలుసు పోయినందుకు బాధపడ్డాడు. ఆ రాంబాబుగాడివలనే తను ఈ గొలుసు నష్టపోయాడు.




''ఉరేయ్ రాంబాబు! నానుంచి రెండుసార్లు తప్పించుకున్నావు. కాని ఈసారి మాత్రం తప్పించుకోలేవు. మళ్ళీ విరిగిన నా ఎముకలు అతుక్కోగానే నీ అంతు చూస్తాను' కసిగా అనుకున్నాడు శివరామ్.

తరువాత సదానందానికి 'విశాలి' పత్రిక ఎడిటర్ ధర్మారావుగారి ఎడ్రసు ఇచ్చి ఆయనకి టెలిగ్రామ్ కొట్టమని చెప్పాడు.

ం ం ం

ధర్మారావుగారు కె.జి.హెచ్.లోకి అడుగుపెట్టారు.

ఎదురుగా బెడ్‌మీద అచేతనంగా పడివున్న శివరామ్‌ని చూసి కళ్ళ నీళ్ళుపెట్టుకున్నారు.

''అసలు ఏక్సిడెంటెలా అయింది శివరామ్?'' అడిగారు.

''రాంబాబుగాడిని హతమార్చే ప్రయత్నంలో'' అనిచెప్పి ఆ రాంబాబుని చంపబోయే ప్రయత్నంలో మొదటి హత్యాప్రయత్నం, రెండో హత్యాప్రయత్నం ఎలా తప్పిపోయిందీ వివరించాడు శివరామ్.

ధర్మారావుగారు నిట్టూర్చారు.

''శివరామ్... నువ్విక ఆ రాంబాబుగాడి మీద హత్యాప్రయత్నం చేయడం విరమించుకో'' అన్నారు ఆయన.

''నో... అది జరగని పని. ఎలాగైనా ఆ రాంబాబుగాడిని హతమార్చి తీరతాను. ఆ ప్రయత్నంలో నా ప్రాణాలు పోయినాసరే లెఖ్ఖచెయ్యను'' దృఢంగా అన్నాడు శివరామ్.

''నా మాట విను శివరామ్! ఎలాగూ వాడివల్ల మనమెంతో నష్టపోయాము. నష్టపోయింది మరి తిరిగిరాదు. మా పత్రికని కూడా త్వరలోనే ఎత్తేద్దామనుకుంటున్నాను. వాడిని చంపే ప్రయత్నంలో నీ ప్రాణాలు పోగొట్టుకోవడం నాకిష్టంలేదు'' చెప్పారు ధర్మారావుగారు.

ఆ మాటలకు శివరామ్ హతాశుడయ్యాడు.

బావురుమంటూ ఏడ్చేశాడు.

''సార్! దయచేసి ఉన్న ఒక్క పత్రికని మాత్రం మూసేయకండి. అదికూడా మూసేస్తే పాఠకలోకం అల్లల్లాడిపోతుంది. వాళ్ళలో విజ్ఞానం కొరవడిపోతుంది. ఆ విజ్ఞానం లేక వాళ్ళలో సోమరితనం తలెత్తుతుంది. పత్రికలలో పడ్డ కథలు, కావ్యాల వల్లనేకదా పాఠకులలో ఇది మంచి, ఇది చెడు అనే విచక్షణా జ్ఞానం కలుగుతోంది. కాబట్టి మీరు మీ పత్రికను మూసేయకండి. నేను రాంబాబుగాడిని ఎలాగైనా సంహరిస్తాను. ఆ తరువాత మళ్ళీ మనం పత్రికలని విస్తృతం చేద్దాం. ఆంధ్రప్రదేశ్‌లో ఎత్తేసిన పత్రికలన్నీ తిరిగి స్థాపించేలా చేద్దాం. దయచేసి మీ పత్రికని ఎత్తేయకండి. దయచేసి నాకా రాంబాబుగాడిని చంపడానికి మరికొంత టైమివ్వండి'' దీనంగా అర్థించాడు.

''సరే... నీ ఇష్టం- నీ అభ్యర్థనని కాదనలేకపోతున్నాను. నష్టం వస్తున్నాసరే మరికొంత కాలం నీ కోసం పత్రికని నడుపుతాను'' అన్నారు ధర్మారావుగారు.

''మనకు సబ్‌ఎడిటర్లు లేక ఆ రాంబాబుగాడి రచనలు పరిశీలిస్తూ ఎలా చిక్కిపోయానో చూశావా?'' అన్నారు బాధగా.

''నాకు తరచుగా గుండెల్లో నొప్పి వస్తోంది. అది గుండె జబ్బేమోనని అనుమానంగా ఉంది నాకు'' మళ్ళీ బాధగా చెప్పారాయన.

శివరామ్‌కి జాలేసింది.

''మీరు ధైర్యంగా ఉండండి. విరిగిన నా ఎముకలు అతుక్కోగానే ఆ రాంబాబుగాడి అంతుచూస్తాను'' అంటూ భరోసా ఇచ్చాడు.

ం ం ం

సాయంకాలం పిల్లగాలులు వీస్తున్నాయి.

పక్షులు కిలకిలారావాలతో గూళ్ళకు చేరుకుంటున్నాయి.

కృష్ణాబేరేజ్ మీద కలుసుకున్నారు రాంబాబు, మోహిని.

ఇరువురు ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకున్నారు.

ఆ రెండు జతల కళ్ళల్లోను కోటి అనురాగాల కాంతులు వెల్లివిరుస్తున్నాయి.

రాంబాబు అందం మోహినిని ముగ్ధురాలిని చేస్తోంది.

మోహిని అందం రాంబాబుని పరవశుడిని చేస్తోంది.

రాంబాబు- మోహిని లేఖలలో చాలారోజులు ప్రేమించుకుని, ఇప్పుడు పర్సనల్‌గా ప్రే




మించుకుందామని విజయవాడలోని కృష్ణా బేరేజి మీద కలుసుకున్నారు.

జనసంచారం లేకుండా చూసి రాంబాబు తమకాన్ని ఆపుకోలేక ఆమెని గాఢంగా కౌగలించుకున్నాడు.

మోహిని కూడా రాంబాబుని కౌగలించుకుని చాలాసేపు అలాగే వుండిపోయింది.

తరువాత ఇరువురూ కౌగలినుంచి విడిపోయారు.

"మీరు చాలా అందంగా వుంటారు?" అంది మోహిని.

"నువ్వూ చాలా అందంగా వుంటావు మోహినీ" అన్నాడు రాంబాబు.

"మీ కథలు ఇంకా బావుంటాయి" అందామె.

"నీ భావాలు నా కథలకంటే కూడా బాగుంటాయి" మెచ్చుకొన్నాడు రాంబాబు.

"మొన్న నేను క్రోటన్ మొక్కలు, అరటిచెట్లు ప్రేమించుకుంటే ఎలా వుంటుందో కథ రాయమని వుత్తరం రాశాను... రాశారా?" అడిగింది మోహిని.

"ఓ!" అంటూ గర్వంగా తలపంకించాడు రాంబాబు.

"థీమ్ చెప్పండి" అడిగింది మోహిని.

"క్రోటన్ మొక్క, అరటిచెట్టు ప్రేమించుకుంటాయి. అవి రెండూ జోడు కట్టుకుంటాయి.

"అప్పుడు అరటిమొక్క గర్భందాల్చి అరటిగెల వేస్తుంది. ఇంటి యజమాని అది చూసి అరటిగెల కోయబోతాడు. అప్పుడు క్రోటన్‌మొక్క, అరటిచెట్టు ఆ యజమాని కాళ్ళమీదపడతాయి. తమ ఏకైక సంతానమైన ఆ గెలని కోయవద్దని ప్రార్థిస్తాయి. కాని యజమాని వినకుండా వాటి సంతానమైన ఆ అరటిగెలని కోసేస్తాడు. దాంతో తమ బిడ్డని పోగొట్టుకున్నామనే బెంగతో అవి రెండూ విషం పుచ్చుకుని ఆత్మహత్య చేసుకుంటాయి. కళ్ళకి కట్టినట్టుగా రాశానీ కథ" భుజాలెగరేస్తూ చెప్పాడు రాంబాబు.

"అద్భుతం... అమోఘం! ఈ కథలో మనిషి చెట్లయెడల చూపే నిర్దయని, క్రూరప్రకృతిని ఎంత చక్కగా తెలియజెప్పారు. హే[illegible] మెచ్చుకుంది మోహిని.

రాంబాబు పొంగిపోయాడు.

ఇంకా తను రాసిన థీమ్‌లు మోహినికి వివరించి చెప్పాడు.

ఆమె పరవశురాలైంది.

రాంబాబు భావాలు, మోహిని భావాలు కలిశాయి.

భావాలతోపాటు మనసులూ కలిశాయి.

ఇప్పుడు శారీరకంగా కూడా కలుసుకున్నారు.

తరువాత-

"మనం పెళ్లి ఎప్పుడు చేసుకుందాం మోహినీ!?" అని అడిగాడు రాంబాబు.

"నా ఇంటర్ పరీక్షలైపోగానే నేనే డైరెక్ట్‌గా నీ దగ్గరికి వచ్చేస్తాను. నీతోనే వుండిపోతాను. అప్పుడు మనం పెళ్లిచేసుకుందాం. మన ఇరువురం కలిసి సాహిత్యానికి పట్టంకడదాం. దానిని కొత్త పుంతలు తొక్కిద్దాం" అని చెప్పింది మోహిని.

"ఓకే" అంటూ రాంబాబు మోహిని కుడిచేతిని గాఢంగా చుంబించాడు.

అప్పటికి పూర్తిగా చీకటిపడింది.

కృష్ణానది వంతెనమీద లైట్లు వెలిగాయి.

"మరి నేను వస్తాను మోహినీ" అన్నాడు రాంబాబు.

మోహిని రాంబాబుతో కూడా స్టేషన్‌కి వెళ్లి అతడిని విశాఖపట్నం వెళ్లే రైలు ఎక్కించింది. టాటాలు చెబుతూ ఒకరికొకరు వీడ్కోలు తీసుకున్నారు.

★ ★ ★

శివరామ్ విరిగిపోయిన రెండు చేతుల ఎముకలు, కాలిఎముకలు అతుక్కోవడానికి మూడు మాసాలు పట్టింది.

ఆరోజు అతను హాస్పిటల్‌నుంచి డిశ్చార్జి అయి బయటికి వచ్చాడు.

నేరుగా సదానందం ఇంటికి వెళ్లాడు.

"ఏరా సదానందం! మీ ఇంట్లో నేను వారం పదిరోజులుంటాను. నీకేమైనా అభ్యంత

ంమో?" అని అడిగాడు.

"నువ్వు నా ప్రియస్నేహితుడివి. ఈసారి అంటే అన్నావు కాని, మళ్లీ ఇంకెప్పుడు అలా అనకు. నువ్వలా అంటే నిన్నింట్లోంచి ఈ క్షణమే బయటికి గెంటేస్తాను. నువ్వెంతకాలం ఇక్కడున్నా నాకేమీ అభ్యంతరం వుండదు" చెప్పాడు సదానందం.

ఆ సాయంకాలం-

శివరామ్ రాంబాబు ఇంటికి బయలుదేరాడు.

ఆ ఇంటికి దూరంగా నిలబడి ఆ ఇంటికేసి పరీక్షగా చూడసాగాడు.

రాంబాబు లోపల గదిలో కూర్చుని ఏదో కథ సీరియస్‌గా రాసుకుంటున్నాడు. మధ్యమధ్యలో కథ రాస్తున్నప్పుడు అతను వేస్తున్న పిచ్చికేకలు బయటికి వినిపిస్తున్నాయి. అతని వూరకుక్క జాని వరండాలో కునికిపాట్లు పడుతోంది.

అతని ఇంటి ఆవరణలో వున్న పిచ్చిమొక్కల మధ్య ఓ స్కూటర్ దర్శనమిచ్చింది శివరామ్‌కి. శివరామ్ ఆ స్కూటరుని నిశితంగా పరిశీలించాడు.

ఆ స్కూటరుకి రంగు అక్కడక్కడ వూడిపోయివుంది. దానికి బాక్‌సీటు లేదు. చూడగానే అది డొక్కు స్కూటరని తెలిసిపోతోంది.

"ఆ స్కూటర్ ఎవరిదండి?" ఆ దారివెంబడిపోతున్న ఓ వ్యక్తిని పిలిచి అడిగాడు.

"ఆ డొక్కు స్కూటర్ ఆ పిచ్చి రచయితదండి! వాడు ఈమధ్యనే ఆఫీసులో లోనుపెట్టి పదిరోజులక్రితం సెకెండ్‌హేండులో ఆ స్కూటర్‌ని కొన్నాడు" చెప్పాడు ఆ వ్యక్తి.

శివరామ్ మదిలో ఓ ఐడియా మెదిలింది.

'అవును... అలా చేస్తే....' అనుకున్నాడు.

ఆ ఐడియా ఏమిటంటే... శివరామ్ ఆ స్కూటర్‌కున్న బ్రేక్‌వైర్లు కట్ చేసేస్తాడు. అది తెలియని రాంబాబు స్కూటర్ డ్రైవ్ చేస్తాడు. అతను రోడ్డుమీంచి వెళుతున్నప్పుడు బ్రేక్‌లు పట్టక ఏ బస్సుకో, లారీకో గుద్దించి చస్తాడు.

ఇది శివరామ్ ప్లాన్!

ప్లాన్ బాగానే వుంది.

కాని, తను ఆ ఇంటి ఆవరణలోకి ప్రవేశించడమెలా?

ఎదురుగా యముడిలా వాడి వూరకుక్క వరండాలో కాపురం వుంటుందే. ఎలా?

వెంటనే శివరామ్ మదిలో ఓ వూహ తళుక్కున మెరిసింది.

ముందు తను ఆ వూరకుక్కని మచ్చిక చేసుకోవాలి.

ఒక నిర్ణయానికి వచ్చిన శివరామ్ అక్కడి నుండి వెనుదిరిగి వెళ్లిపోయాడు.

మర్నాడు ఉదయం ఎనిమిది గంటలకు జంక్షన్ దగ్గర కాశాడు శివరామ్.

మరో అయిదు నిమిషాలకు ఆ జంక్షన్ పక్కనే వున్న సన్నపాటి సందుమలుపు తిరిగి తన డొక్కు స్కూటర్‌ని డబడబలాడించుకుంటూ ఆఫీసుకి వెళ్లిపోయాడు రాంబాబు.

ఆ తరువాత శివరామ్ రాంబాబు ఇంటి వైపు అడుగులు వేశాడు.

ఆ ఇంటిముందు నిలబడ్డాడు.

ఇంటికి తాళంవేసి వుంది.

కాంపౌండు గేటు దగ్గరగా వేసి గొళ్లెంపెట్టి వుంది.

ఆ కాంపౌండు ఆవరణలో రాంబాబు వూరకుక్క జానీ అక్కడ వున్న పిచ్చిమొక్కలని కచాబిచా నములుతూ కనిపించింది.

శివరామ్ గేటుబయట నిలబడి "చు చు చు చూ" అని పిలిచాడు జానిని.

జానీ శివరామ్‌ని చూడగానే కాంపౌండ్‌వాల్ గేటులోపలనుంచి "భౌ భౌ భౌ" అని అరిచింది. ఒకసారి చూస్తే చాలు దానికి ఎవరైనా గుర్తే.

వెంటనే శివరామ్ జేబులోంచి కుక్క బిస్కెట్ ఒకటితీసి దానిముందు గిరవాటు పెట్టాడు.

జానీ ఆ కుక్క బిస్కెట్ తినగానే శివరామ్‌ని చూసి పిల్లిలా అయిపోయింది. "కుయ్యి కుయ్యి" మంటూ గారాలుపోతూ ప్రేమగా తోకాడించింది.

శివరామ్ మరో బిస్కెట్ వేశాడు.

ఆ వూరకుక్క ఆ బిస్కెట్ కూడా తినేసి




తోకాడించసాగింది.

ఆ రెండు బిస్కెట్లు రుచిమరిగిన జానీ 'నా పిచ్చియజమానికంటే వీడే నయం. వాడైతే ఈ ఆవరణలో వున్న పిచ్చిమొక్కల ఆకులనే ఆహారంగా పెడుతున్నాడు. వాడు పెట్టిన పిచ్చి ఆకులవలనే పిచ్చెక్కి అనవసరంగా వీడిని ఓరోజు వెంటతరిమి మరీ కరిచాను. ఎంత పొరపాటు పనిచేశాను' అని మనసులో అనుకుని పశ్చాత్తాపపడుతూ శివరామ్‌ని చూస్తోంది జానీ.

శివరామ్ మరొకటి... మరొకటి అలా తన దగ్గరున్న కుక్క బిస్కెట్లన్నీ జానీకి పెట్టేశాడు.

తరువాత అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

అది మొదలు శివరామ్ వారంరోజులపాటు రాంబాబు ఇంట్లోలేని సమయంలో జానీకి రోజూ కుక్క బిస్కెట్లు పెట్టి అది తనని చూసి అరవకుండా తోకాడించేలా చేసుకున్నాడు.

ఆరోజు అర్ధరాత్రి...

రాంబాబు ఇంటిని సమీపించాడు.

ఆ ఇంటి తలుపులు మూసేసి వున్నాయి.

రాంబాబు లోపల నిద్రపోతున్నాడు.

వరండాలో జానీ కునికిపాట్లు పడుతోంది.

కాంపౌండ్ ఆవరణలో పిచ్చిమొక్కల మధ్య డొక్కు స్కూటర్ స్టాండువేసి వుంది.

శివరామ్ కాంపౌండ్‌వాల్ గేటు తీసుకుని లోపలికి అడుగుపెట్టాడు.

అలికిడి విని కళ్ళు తెరిచి అరవబోయిన జానీ శివరామ్‌ని పసిగట్టి మెదలకుండా వూరుకుంది. పైగా తోకాడించుకుంటూ శివరామ్ దగ్గరకు వచ్చి ప్రేమగా అతని వళ్ళంతా నాకసాగింది.

శివరామ్ డొక్కు స్కూటర్‌ని సమీపించాడు.

రెండు నిమిషాలు తరువాత అక్కడినుండి వెనుతిరిగి వెళ్ళిపోయాడు.

★ ★ ★

మర్నాడు ఉదయమే రాంబాబు నిద్రలేచాడు. హుషారుగా తయారై ఆఫీసుకి బయలుదేరాడు. డొక్కు స్కూటర్ బయటికి తీసి స్టార్ట్ చేశాడు.

స్కూటర్ వేగంగా ముందుకి దూకింది.

'డబడబడబ' మని శబ్దంచేస్తూ పరుగుతీసింది.

జంక్షన్‌దాటి సెంట్‌ఫ్రాన్సిస్ స్కూలు దగ్గరకు వచ్చింది. వేగానికి తీగలు ఇవతలకు వచ్చి ఎగురుతున్నాయి.

అప్పుడు గమనించాడు రాంబాబు... తన స్కూటర్ బ్రేకులు ఎవరో తెంపేశారని.

ఎదురుగా రెండు బస్సులు వచ్చాయి. వెంట్రుకవాసిలో వాటినుంచి ప్రమాదాన్ని తప్పించుకున్నాడు రాంబాబు.

రాంబాబు స్కూటరు ఆ దారిలోనే వస్తుందని, ఈలోగా రాంబాబు ఏ బస్సుకో, లారీకో గుద్దుకుని చస్తాడని వూహించిన శివరామ్ అక్కడికి సమీపంలోనే వున్న బస్‌స్టాప్‌కి ఎదురుగా వున్న పోస్టుబాక్స్ దగ్గర నిలబడి చూస్తున్నాడు.

సెంట్‌ఫ్రాన్సిస్ స్కూలుదాటి పక్కనే వున్న కిళ్లీషాపు, సైకిల్‌షాపు దగ్గరకు వచ్చింది స్కూటరు.

స్కూటర్ వేగంగా పరుగెత్తుతోంది. ఎదురుగా స్కూలు బస్ వస్తోంది. దానికి స్కూటర్ ఢీకొట్టడం ఖాయం. అందుకే రాంబాబు సర్రున కోశాడు.

అంతే!

స్కూటర్ శివరామ్ వైపు పరుగెత్తింది. శివరామ్ తప్పుకోబోయాడు. అప్పటికే ఆలస్యమైపోయింది. స్కూటర్ శివరామ్‌ని గుద్దగానే అతను ఎగిరి కిందపడ్డాడు.

రాంబాబు స్కూటర్‌మీనించి ఒడుపుగా అవతలికి గెంతేసాడు.

స్కూటర్ శివరామ్‌ని గుద్ది వెంటనే పక్కనే ఉన్న పోస్టుబాక్స్‌ని కూడా గుద్దుకుంది.

పోస్టుబాక్స్ మధ్యకు వంగిపోయింది.

కిందపడ్డ శివరామ్‌కి నడుము విరిగిపోయింది.

రాంబాబు స్కూటర్ లొత్త పడిపోయింది.

నడుము విరిగిన శివరామ్ లబోదిబోమని గోలపెట్టసాగాడు.

రాంబాబు తాపీగా కిందపడ్డ శివరామ్‌ని సమీపించాడు. అతడిని కాలితో ఫెడీమని

తన్నాడు. తరువాత కింద పడివున్న డొక్కు స్కూటర్‌ని లేపి నిలబెట్టి దానిని నెమ్మదిగా నడిపించుకుంటూ ముందుకువెళ్ళిపోయాడు.

ఈలోగా అక్కడ చాలామంది జనం గుమ్మి గూడారు.

రాంబాబు చేసిన దౌర్జన్యానికి వాళ్లతన్ని ఏమీ అనలేకపోయారు. కారణం మాసివున్న అతని గడ్డం, బట్టలేకాక స్నానంలేని అతని ఒళ్ళు అదోలా కంపు కొడుతోంది. అతని ఆకారం వాళ్లకి ఓ రౌడీవాలాలా కనిపించింది.

తరువాత ఆ గుంపులోంచి ఎవరో పుణ్యాత్ము లు ముందుకు వచ్చి శివరామ్‌ని కె.బి.హెచ్.లో జాయిన్‌చేశారు.




సదానందం కె.జి.హెచ్.లోకి అడుగుపెట్టా డు.

బెడ్‌మీద నడుముకి పట్టీతో అచేతంగా పడి ఉన్న శివరామ్‌ని జాలిగా చూశాడు.

తరువాత అనుమానంగా చూశాడు.

"ఉరేయ్ శివరామ్... నిజం చెప్పు... ఇలా నీకు యాక్సిడెంట్ జరగడం ఇది రెండోసారి. ఆ రెండుసార్లుకూడా నీకు ఆ ఏరియాలోనే ఏక్సిడెంట్ జరిగింది. ఎందుకు నువ్వు మాటి మాటికి అటు వెళుతున్నావు? అక్కడ నీకెవ రైనా శత్రువులున్నారా? నిజం చెప్పు... చెప్పక పోతే ఈ క్షణం నుంచి నీకూ నాకు చెల్లు" అన్నాడు.

అంతే!

శివరామ్ బావురుమన్నాడు.

తప్పనిసరై సంగతంతా వివరించాడు.

"ఆ" అంటూ సదానందం నోరుతెరుచు కుని చాలాసేపు అలాగే ఉండిపోయాడు.

తరువాత తేరుకుని-

"పోనీ వాడి రచనలని సంపాదకులు చద వకుండానే తిప్పి పంపేయవచ్చుకదా!" అన్నా డు. ఆమాటలకు శివరామ్ విషాదంగా నవ్వా డు.

"అది సంపాదకులకు సాధ్యమయ్యే పనికా దు. వాడి చెత్త రచన ఎలాంటిదైనా బయటికి తీసిన ప్రతికథనీ సంపాదకులకు చదవాలని పిస్తుంది. చదివి తీరుతారు. అదే వాడి చెత్త రచనలలోని ప్రత్యేకత. వాడి బోరు రచనల లోని ఆ ప్రత్యేకత సంపాదకలోకాన్ని హతమా ర్చింది" బాధగా చెప్పాడు శివరామ్.

సదానందం కరెంట్ షాక్‌తిన్నవాడిలా అయ్యా డు కొంచెంసేపు.

తరువాత శివరామ్‌ని చూసి జాలిపడ్డాడు.

అయ్యో! తన ప్రియమిత్రుడికి ఎన్ని కష్టా లు వచ్చిపడ్డాయి.? తన స్నేహితుడికి వచ్చిన ఈ ఆపదని తను తొలగించాలి. శివరామ్‌ని గట్టెక్కించాలి. తను తప్పకుండా శివరామ్‌కి సహాయం చేయాలి! లేకపోతే తన స్నేహానికి విలువుండదు!!

ఒక నిర్ణయానికి వచ్చిన సదానందం-

"శివరామ్... నువ్వేమీ బాధపడకు. నేను రాంబాబుగాడి సంగతి చూసుకుంటాను" అన్నాడు దృఢంగా.

శివరామ్ ఆశ్చర్యపోయాడు.

"ఏమిటి? వాడిని నువ్వు చంపుతావా... ఎలా?" అని అడిగాడు.

"హిప్నటైజ్‌చేసి" అని చెప్పాడు సదా నందం.

"మరి నువ్వు ఆ రాంబాబుగాడిని ఎలా పరిచయం చేసుకుంటావ్?" అని అడిగాడు శివరామ్.

"వాడి అభిమానిగా" చెప్పాడు సదా నందం.

"ముందు నేను వాడి అభిమానిగానే కలిశా ను వాడిని. ఈసారి నువ్వు అలా వెళితే వాడికి అనుమానం కలగొచ్చు. అంచేత నీ జాగ్రత్తలో నువ్వుండు" అంటూ శివరామ్ లోగడ తను భాగ్యనగరం నుంచి బయలుదేరబోయే




ముందు రాసుకున్న రాంబాబు మూడు కథల పేర్లు చెప్పాడు.

ముందు జాగ్రత్తగా సదానందం ఆపేర్లు కాగితం మీద రాసుకున్నాడు.

శివరామ్ ఆరోజు హాస్పిటల్ నుంచి డిశ్చార్జి అయ్యాడు. ఆరోజు సాయంత్రం శివరామ్ సదానందాన్ని తీసుకువెళ్ళి రాంబాబు ఇల్లు చూపించాడు.

సదానందం రాంబాబు ఇంటి వైపు అడుగులు వేశాడు.

కాంపౌండు వాలుగేటు తీసుకుని లోపలికి అడుగుపెట్టబోయాడు.

వెంటనే అతనికి శివరామ్ చెప్పిన వూరకుక్క మాట గుర్తుకొచ్చింది.

లోపలికి అడుగుపెట్టే ప్రయత్నం విరమించుకుని బయటి నుంచే "రాంబాబుగారూ... రాంబాబుగారు!" అంటూ బిగ్గరగా కేకలుపెట్టాడు.

లోపలినుంచి ముందుగా వూరకుక్క బయటికి పరుగెత్తుకొచ్చింది.

అది సదానందాన్ని చూస్తూనే "భౌ భౌ భౌ" మని అరవడం మొదలు పెట్టింది - తరువాత రాంబాబు బయటికి వచ్చాడు.

గేటు అవతల నిలబడ్డ సదానందాన్ని చూసి-

"ఎవరు మీరు?" అని అడిగాడు.

"నేను మీ అభిమానిని. నాపేరు సదానందం" అని చెప్పాడు సదానందం.

అభిమానిని అనగానే రాంబాబు అతనిని అనుమానంగా ఎగాదిగా చూశాడు.

"ఏమిటలా చూస్తున్నారు? నేనేమైనా దొంగాడిననుకుంటున్నారా?" తన జోకుకి తానే పెద్దగా నవ్వాడు సదానందం.

"ఆహా... నేనలా అని ఏమీ అనుకోవడంలేదు" అని అంటూనే, ఏదో ఆలోచిస్తూ "లోపలికి రండి" అంటూ గేటు తోయబోయాడు రాంబాబు.

"మీ కుక్క - మీ కుక్క" అని హెచ్చరించాడు సదానందం బయటి నుంచే. రాంబాబు వూరకుక్కని లాక్కువెళ్ళి వరండాలో వున్న స్తంభానికి కట్టేశాడు.

తరువాత సదానందం లోపలికి అడుగుపెట్టాడు.

రాంబాబు కుర్చీ చూపించి కూర్చోమన్నాడు.

"పత్రికలో పడ్డ మీ మూడు రచనలు చదివాను. చాలా బాగా రాశారు. చాలాకాలం నుంచి నేనీవూళ్ళో వుండి కూడా మీ అడ్రసు సంపాదించలేకపోయాను. సదా మీ మూడు రచనలే నామదిలో మెదిలేవి. మిమల్ని చూడాలని నాహృదయం తహతహలాడిపోసాగింది. మిమ్మల్ని చూడాలనే కోరిక నాలో బలీయంగా పెరిగిపోతూంటే, ఇక ఆగలేక చివరికి 'విశాలి' వారపత్రిక సంపాదకులకు మీ అడ్రసు కావాలని వుత్తరం రాశాను. ఈరోజే వాళ్ళు నాకు రాసిన అడ్రస్సు పోస్టులో అందింది. మీదీ ఈవూరే అని తెలిసి ఎంతో సంతోషించాను. వెంటనే మిమ్మల్ని కలుసుకున్నాను" చెప్పాడు సదానందం.

రాంబాబు గర్వపడ్డాడు.

ఆనందంతో తలమునకలయ్యాడు.

"మీరు నా అభిమాని కావడం నిజంగా నా అదృష్టం" అని అన్నాడు పొంగిపోతూ.

తరువాత తను కొత్తగా రాస్తున్న ఓ రచనని లోపలినుంచి తీసుకొచ్చాడు.

"చూడండి. ఈ రచన పేరు "ఇల్లు చంపింది". నేను వుంటున్న ఈ ఇంటి మీదే ఈ కథరాస్తున్నాను. శిథిలావస్థలో వున్న ఈ ఇల్లుని బాగుచేయమని మా ఇంటి ఓనరికి ఎన్నిసార్లు చెప్పినా బాగుచేయించడంలేదు. రోజూ ఈ ఇల్లు నా కలలోకి వచ్చి 'రాంబాబూ! నన్ను బాగుచేయించవూ? నన్ను బాగుచేయించవూ?' అని అడుగుతోంది. అందుకే మా ఓనరికి బుద్ధిచెప్పాలని ఈ ఇంటిమీద కథ రాస్తున్నాను. ఈ కథ థీమ్ ఏమిటంటే, ఓ యజమాని ఇల్లు కట్టించుకుని ఆ ఇంట్లో కాపురముంటుంటాడు. కొన్నేళ్ళు పోయాక ఆ ఇల్లు కొద్దికొద్దిగా శిథిలమైపోతూంటుంది. తను శిథిలమైపోతూన్నానని, తనని బాగుచేయించమని ఆ ఇల్లు తన యజమానిని అడుగుతుంది. కాని ఆ యజమాని వినడు. అతని కాళ్ళుపట్టుకుని బతిమాలుతుంది. దీనంగా

కన్నీరు కార్చి మరీ అడుగుతుంది. అయినా ఆ యజమాని ఆ ఇంటిని లెక్కపెట్టడు. దానిని బాగుచేయించడు. చివరికి ఆ ఇంటికి కోపమొచ్చి ఆ యజమానిని కత్తితో పొడిచి చంపేస్తుంది. ఇదిసార్ ఆకథ థీమ్! చదవండి'' అంటూ నగంవరకూ రాసిన ఆ ఏడెనిమిది కాగితాల బొత్తిని సదానందం చేతిలో పెట్టాడు రాంబాబు.

పాపం! సదానందానికి గొంతులో పచ్చి వెలక్కాయపడ్డట్టయింది.

తప్పని సరిగా నగం రాసిన ఆ కథని చదవక తప్పలేదతనికి.

పేజీలు తిరగేస్తూ కథని చదవడం ప్రారంభించాడు సదానందం.

అంతే!

అతనికి కడుపులో తిప్పడం ప్రారంభించింది.

కళ్ళు తిరగసాగాయి



ఒళ్ళు దురదపెట్టసాగింది.

ప్రాణం జిల్లార్పుకుపోతున్నట్టుగా అయిపోతోంది.

ఇక తను చచ్చిపోతున్నాడనే అనుకున్నాడు సదానందం.

వెంటనే తన జపాను గురువుగారైన హిరోషిమా చించింగారు చెప్పిన సెల్ఫ్ హిప్నటిజమ్ పద్ధతి గుర్తుకొచ్చింది సదానందానికి.

వెంటనే తన మనసులో-

''ఈ కథ చదువుతూండగా నాకెలాంటి కాంప్లికేషన్సు రాకూడదు. నాకెలాంటి ప్రమాదమూ సంభవించకూడదు. నాకెలాంటి ఆపదా రాకూడదు'' అని అనుకుంటూ తననితాను హిప్నటైజ్ చేసుకున్నాడు.

దాంతో సదానందానికి-

కడుపులో తిప్పడం...

కళ్ళు తిరగడం...

ఒళ్ళు దురదపెట్టడం...

ప్రాణాలు జిల్లార్పుకుపోవడం హఠాత్తుగా ఆగిపోయాయి.

అలా అతను ''ఇల్లు చంపింది'' కథని సగంవరకు రాసిన ఆరేడు పేజీలు తననితాను సెల్ఫ్ హిప్నొటిజమ్‌తో కంట్రోలుచేసుకుంటూ చదివేశాడు.

తరువాత బతుకు జీవుడా అని నిట్టూర్చి-

''కథ చాలా బాగా రాస్తున్నారండీ రాంబాబుగారూ! మిగతా కథకూడా పూర్తిచేసి పంపండి. తప్పకుండా పడుతుంది'' అని చెప్పాడు సదానందం.

రాంబాబు తనివితీరా పొంగిపోయాడు.

''చెప్పండి కాఫీతాగుతారా? కూల్‌డ్రింకా?'' అడిగాడు.

''కాఫీ'' అని చెప్పాడు సదానందం.

రాంబాబు పావుగంటలో కాఫీ తయారుచేసి సదానందానికి ఓ కప్పు అందించి, తానొక కప్పు తీసుకున్నాడు.

''మీరేంచేస్తుంటారు?'' అడిగాడు రాంబాబు.

''నేనేమీ చేయడంలేదు. ప్రస్తుతం ఖాళీగా వుంటున్నాను'' అని చెప్పాడు సదానందం.

ఆ తరువాత తన రచనలగురించి చెప్పిన విషయం చెప్పకుండా మూడుగంటలపాటు సదానందానికి సుత్తివేశాడు రాంబాబు.

మరొకరయితే రాంబాబు కొట్టిన ఆ మూడు గంటలపాటు సుత్తికి గుండె ఆగి చచ్చేవారే! కాని సదానందం తననితాను సెల్ఫ్ **హిప్నటైజ్** చేసుకుని రాంబాబు సుత్తిబారినుండి కాపాడుకున్నాడు.

అప్పటికి బాగా చీకటి పడటంతో-

''మరి నాకు సెలవిప్పించండి. మళ్ళీ రేపు వస్తాను'' అని రాంబాబుదగ్గర సెలవు తీసుకుని వచ్చేశాడు సదానందం.

అంతవరకు ఆ ఇంటికి దూరంగా తన కోసం ఎదురుచూస్తున్న శివరామ్‌ని కలుసుకున్నాడు. అక్కడ రాంబాబుకి, తనకి జరిగిన సంభాషణ వివరించి చెప్పాడు సదానందం.

ఎనీవే...నువ్వు క్షేమంగా తిరిగి వచ్చావు. నేనింకా మరికొంచెంసేపు చూసి, నువ్వు వాడి రచనేదో చదివి చచ్చిపోయివుంటావని, ఇక వెళ్ళిపోదామని అనుకున్నాను'' అన్నాడు శివరామ్.

★ ★ ★

అది మొదలు సదానందం రోజూ రాంబాబుని కలుసుకుంటూనే వున్నాడు. అలా వారి పరిచయం వారంరోజుల్లో వృద్ధిపొంది గాఢంగా పెనవేసుకుపోయింది. ఓరోజు సదానందం రాంబాబుతో చెప్పాడు మాటల్లో:

''నేనొక హిప్నాటిస్ట్‌ని'' అని.

''ఈజిట్?'' రాంబాబు ఆశ్చర్యపోయాడు.

''హిప్నాటిజమ్ గురించి మీకు తెలుసా?'' అని అడిగాడు సదానందం.

సదానందం అలా అడగ్గానే రాంబాబు అనుమానంగా చూశాడు.

అయినా తన అనుమానాన్ని పైకి కనబడనీయకుండా-

''నాకు తెలియదు'' అని చెప్పాడు అమాయకంగా.

''హిప్నాటిజమ్ గురించి మీరు పుస్తకాలు కూడా చదవలేదా?'' అని అడిగాడు సదానందం.

''చదవలేదు'' అని చెప్పాడు రాంబాబు.




"అయితే హిప్నాటిజమ్ గురించి మీరు తప్పకుండా తెలుసుకునితీరవలసిందే!" అని అన్నాడు సదానందం.

"పోనిద్దురూ! నాకు దానిగురించి తెలుసుకోవాలని ఇంట్రస్టులేదు" అంటూ తేలిగ్గా కొట్టిపారేశాడు రాంబాబు.

"అమ్మమ్మా... అంతమాటనకండి. హిప్నాటిజమ్ వలన మనిషి మెదడుని తన అధీనంలోకి తీసుకుని, ఆ మనిషిచేత రకరకాల చేష్టలు చేయించవచ్చు. పిల్లిలా కూయించవచ్చు. కుక్కలా అరిపించవచ్చు. కోతిలా గెంతులు వేయించవచ్చు. కావాలంటే మీరొకసారి నాచేత హిప్నటైజ్ చేయించుకోండి. బాగుందంటే మీరూ నేర్చుకోవచ్చు. మీకు నేను నేర్పుతాను" అని అన్నాడు.

"ఎందుకండీ? నాకు హిప్నటైజ్ చేయించుకోవడం ఇష్టంలేదు" అన్నాడు రాంబాబు.

"మీరు అలా అంటే కుదరదు. ఒక్కసారంటే ఒక్కసారి నాచేత హిప్నటైజ్ చేయించుకునిచూడండి" అంటూ పట్టుపట్టాడు సదానందం.

ఇక రాంబాబుకి ఒప్పుకోక తప్పలేదు.

సదానందం వంక అనుమానంగా చూస్తూనే-

"సరే... కానివ్వండి" అని అన్నాడు.

"అలా సీషోర్‌కి పోదాంరండి. అక్కడైతే ప్రశాంతంగా వుంటుంది. హిప్నాటిజమ్‌కి ఏకాగ్రత వుంటుంది. మనం సరదాగా షికారుకి వెళ్ళినట్టూ వుంటుంది. మీరు హిప్నాటిజమ్ అంటే ఏమిటో తెలుసుకున్నట్టూవుంటుంది ఏమంటారు?" అని అడిగాడు సదానందం.

సదానందం అలా అనేసరికి రాంబాబుకి మరింత అనుమానం పట్టింది.

అయినా పైకి తన అనుమానాన్ని తెలియనివ్వకుండా-

"సరే... అలాగే! బీచ్‌కి పోదాంపదండి" అని అన్నాడు.

ఇద్దరూ ఇంట్లోంచి బయటికి వచ్చారు.

అప్పటికి సమయం సాయంకాలం ఆరు గంటలయింది.

రాంబాబు తనదొక్క స్కూటర్ బయటికి తీయబోయాడు.

"అబ్బెబ్బే... స్కూటర్ ఎందుకండీ!? సరదాగా సిటీబస్సులో వెళదాం!" అన్నాడు సదానందం.

రాంబాబు స్కూటర్ స్టార్ట్‌చేసే ప్రయత్నం విరమించి కాలినడకన సదానందాన్ని అనుసరించాడు.

ఇద్దరూ బస్‌స్టాప్ చేరుకున్నారు.

బస్సు ఎక్కారు.

బస్సు ముందుకు దూకింది.

హిప్నాటిజమ్ ఎలా వుంటుందో, అది ఎలా అభివృద్ధిచెందిందో, దానిని కనిపెట్టింది ఎవరో, దానివలన వ్యాధులు ఎలా నయంచేయవచ్చో...మొదలగు విషయాలగురించి రాంబాబుకి అనర్గళంగా సుత్తివేశాడు సదానందం.

బస్సు వాళ్ళని బీచ్‌దగ్గర దింపింది.

అప్పటికి సమయం సరిగ్గా రాత్రి ఏడు గంటలయింది.

అది అమావాస్య చీకటేమో...ఆకాశంలో ఎక్కడా వెలుగుచుక్కలు లేవు.

ఇద్దరూ బీచ్‌లోకి అడుగుపెట్టారు.

బీచ్ నిర్మానుష్యంగా వుంది.

అది శీతాకాలం అవడంవలన వ్యాహ్యాళికై వచ్చిన జనం ఆరుగంటలకే ఇళ్ళకి తిరిగి వెళ్ళిపోయారు.

సముద్ర కెరటాలు భీకరంగా ఎగిసెగిసి తీరాన్ని తాకుతున్నాయి.

సదానందం రాంబాబుని సాగరానికి అభిముఖంగా కూర్చోపెట్టాడు.

"వెల్... రాంబాబుగారూ! మీరు నాతో ఇప్పుడు పూర్తిగా సహకరించాలి. నేను చెప్పినట్టుగా చెయ్యండి!" అని అంటూ సదానందం జేబులోంచి టార్చితీశాడు.

అప్పటివరకు సదానందం, రాంబాబుల వెనుక ఫాలో అయిన శివరామ్...దూరంగా ఆగిపోయి వాళ్ళిద్దరిని పరీక్షగా చూస్తూవుండిపోయాడు.

జేబులోంచి టార్చితీసి రాంబాబు ముఖంలోకి టార్చిస్విచ్ ఆన్‌చేసి లైటుఫోకస్ చేశా

డు సదానందం.

"మీరీ లైటువెలుగుని ఇలాగే చూడండి" అన్నాడు.

"నో... మీరిలా కళ్ళు మూయకూడదు. మీరీ లైటు వెలుగుని చూడాలి...చూస్తారు...చూస్తారు..."అన్నాడు సదానందం.

రాంబాబు కళ్ళు తెరచి టార్చ్‌వెలుగుని చూశాడు.

సదానందం టార్చ్‌లైటుని రాంబాబు కళ్ళలోకి ఫోకస్‌చేస్తూ ఐదారుసార్లు వెలిగించి ఆర్పాడు.

తరువాత-

"రాంబాబూ... నీ కళ్ళకి ఇప్పుడు అలసట కలుగుతుంది... అలసట కలుగుతుంది. నీకళ్ళు బరువుగా మూతలుపడతాయి... మూతలుపడతాయి. నువ్విప్పుడు నిద్రలోకి జారుకుంటావు నిద్రలోకి జారుకుంటావు" అని అన్నాడు.

రాంబాబు ట్రాన్స్‌లోకి వెళ్ళిపోయాడు.

"గుడ్! నువ్విప్పుడు పిల్లిలా కూస్తావు ఏదీ కుయ్యి?" అని అన్నాడు సదానందం.

"మ్యావ్... మ్యావ్!" అంటూ రాంబాబు పిల్లిలా కూశాడు.

"నువ్విప్పుడు కుక్కలా అరుస్తావు...ఏదీ అరువు?" అని అన్నాడు సదానందం.

రాంబాబు "భౌ భౌ భౌ" మని కుక్కలా అరిచాడు.

తరువాత సదానందం రాంబాబుని తన హిప్నాటిజమ్‌లో కోతిలా కిచకిచమని అరిపించాడు. ఆంబోతులా రంకెలు వేయించాడు. కంగారులా బీచ్ అంతా పరిగెత్తించాడు.

రాంబాబు చేష్టలని బట్టి అతను పూర్తిగా ట్రాన్స్‌లోకి వెళ్ళిపోయాడని నమ్మకం కలిగింది సదానందానికి.

అప్పుడు తనలో తాను వికృతంగా నవ్వుకున్నాడు సదానందం.

"వెల్ డన్ మిస్టర్ రాంబాబు! నేను చెప్పినవన్నీ చేశావు. ఇప్పుడు నీ ఎదురుగా కనుచూపుమేరలో దూరంగా ఓ అందమైన అప్సరస నిలబడి 'రా' రాంబాబు' అని నిన్ను పిలుస్తోంది. నిన్ను తన కౌగిలిలో బంధిస్తానని అంటోంది. ఏదీ పరుగుపరుగునవెళ్ళి ఆ అప్సరసని అందుకో" అన్నాడు సదానందం.

అంతే!

రాంబాబు పెద్ద పెద్ద అంగలువేసుకుంటూ కెరటాలవైపు పరుగుతీశాడు.

సదానందం "హ్హ హ్హ హ్హ" అని పకాపకా నవ్వాడు 'ఫురేయ్ రాంబాబూ! ఇంతటితో నీపని అవుట్' అని అనుకున్నాడు.

కాని అంతలోనే-

కెరటాలదాకా పరుగుతీసిన రాంబాబు విచిత్రంగా వెనుదిరిగాడు.

సదానందంవైపు అడుగులువేసుకుంటూ వచ్చాడు.

రాంబాబు అలా వెనుదిరిగి తనవైపు వస్తూంటే సదానందం నిశ్చేష్టుడై రాంబాబునే చూడసాగాడు.

రాంబాబు సదానందాన్ని సమీపించి అతని చేతిలోంచి టార్చి లాక్కున్నాడు.

నిశ్చేష్టుడై చూస్తున్న సదానందం ముఖంలోకి టార్చ్‌ఫోకస్‌చేసి...ఆర్పుతూ వేస్తూ...

"సదానందం! నీకళ్ళకి అలసట కలుగుతోంది... అలసట కలుగుతోంది... అలసట కలిగింది... కళ్ళుమూసుకో" అని అన్నాడు.

సదానందం కళ్ళుమూసుకున్నాడు.

"సదానందం... ఇప్పుడు అలసట కలిగిన నీ కళ్ళకి నిద్ర ముంచుకువస్తుంది. నిద్ర ముంచుకు వస్తుంది. ఏదీ నిద్రపో" అన్నాడు.

అంతే!

సదానందం ట్రాన్స్‌లోకి వెళ్ళిపోయాడు.

"నువ్విప్పుడు పిల్లిలా కూస్తావు" అన్నాడు రాంబాబు. సదానందం పిల్లిలా కూశాడు.

"నువ్వు కుక్కలా అరుస్తావు" అన్నాడు రాంబాబు.

సదానందం కుక్కలా అరిచాడు.

"నువ్వు ఆంబోతులా రంకె వేస్తావు" అన్నాడు రాంబాబు.

సదానందం ఆంబోతులా రంకవేశాడు.

"నువ్విప్పుడు జీబ్రాలా పరుగులు పెడతావు" అన్నాడు.




సదానందం అలాగ పరుగులు తీశాడు.

ఆ తరువాత---

"సదానందం... ఇప్పుడు నీ ఎదురుగా సుదూరతీరంలో ఓ అందమైన సినీనటి నిల బడి ఉంది. నిన్ను రమ్మని తన బాహువుల్లోకి ఆహ్వానిస్తోంది. ఏదీ పరుగునవెళ్ళి ఆ సినీ నటి బాహువుల్లో ఒదిగిపో!" అన్నాడు.

అలా పరుగులు తీస్తూనే సాగరకెరటాల మధ్యకు వెళ్ళిపోయాడు.

అంతే!

కెరటాలు అతనిని తమలో లీనంచేసుకు న్నాయి.

"హ్హ హ్హ హ్హ" అంటూ రాంబాబు వికృ తంగా నవ్వాడు.

"ఒరేయ్ సదానందం! నీకంటే ప్రముఖ హిప్నటిస్ట్ని నేను" అని బిగ్గరగా అనుకుని అక్కడి నుంచి వెనుదిరిగి తాపీగా వెళ్ళిపోయా డు.

సదానందం ఏ జపాను దొరదగ్గర అయితే హిప్నటిజమ్ నేర్చుకున్నాడో... ఆ జపాన్ దొరైన హిరోషిమా చించిం దగ్గరే రాంబాబు కూడా హిప్నటిజమ్ నేర్చుకున్నాడని పాపం సదా నందానికి తెలీదు. మిత్రుడైన శివరామ్ని ఆప దనుంచి కాపాడాలని తానే ఆపదలపాలయ్యా డు.

ఇదంతా దూరం నుంచి దొంగచాటుగా చూస్తున్న శివరామ్ అలలమధ్యకు పరుగెత్తా డు. స్పృహతప్పి ఒడ్డుకు కొట్టుకువచ్చి శవంలాపడున్న సదానందానికి ప్రథమ చికిత్స చేశాడు.

ఇద్దరూ ఇంటికి తిరిగి వచ్చారు.

ఇల్లంతా వెలవెలబోతున్నట్టుగా అని పించింది.

ఈసారి తాను చేయబోయే ప్రయత్నం వమ్ముకాకూడదు.

ఎలా?

వాడిని చంపడమెలా?

దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు శివరామ్.

అతడికి మరో ఊహ తట్టింది. అలాచేయా లని అనుకున్నాడు.

* * *

మర్నాడు ఉదయం నిద్రలేస్తూనే కాలకృ త్యాలు తీర్చుకుని జంక్షన్కి వచ్చాడు శివ రామ్.

అలవాటు లేకపోయినా పక్కనే ఉన్న కిళ్ళీకొ ట్లో సిగరెట్ పేకట్కొని సిగరెట్టు ముట్టించాడు.

"మీదీవూరేనా?" అనడిగాడు శివరామ్ కిళ్లీ షాపువాడిని.

ఆ కిళ్ళీషాపువాడు శివరామ్ని ఓ వెర్రివా డిలా చూశాడు.

"బాగుందయ్యా- నువ్వడగడం. నాదీవూరు కాకపోతే నేనిక్కడ కొట్టెందుకు పెట్టుకుంటా ను?" అని అడిగాడు.

శివరామ్ ఏమీ మాట్లాడలేదు. వాడిని తా నెంత తెలివితక్కువ ప్రశ్నవేశాడో అర్థమ యింది తనకి.

శివరామ్ ఏదో అడగబోతున్నాడని గ్ర హించిన కిళ్ళీషాపు యజమాని, "నీకేం కా వాలి?" అని అడిగాడు.

శివరామ్ ఒక్షణం తటపటాయించి--

"ఈ ఊళ్లో నీకు తెలిసిన చేతబడి చేసే మాంత్రికులెవరైనా ఉన్నారా?" అని అడిగా డు.

అంతే!

ఆ కిళ్ళీషాపువాడు శివరామ్ని భయంభ యంగా చూశాడు.

తరువాత కోపంగా చూశాడు.

వీడెవడో తననే చేతబడి చేయించాలని చూస్తున్నాడని అనుకున్నాడు శివరామ్ని.

వెంటనే షాపులోంచి ఒక్క గెంతుగెంతి శివ రామ్ ఫిల్ట్పుచ్చుకున్నాడు.

"ఏరా... నీకు చేతబడి చేసే మాంత్రికులు కావాలా? అసలు నువ్వెవడివి? ఎవడికి చేతబ డి చెయ్యాలనుకుంటున్నావ్- నిజం చెప్పు?" అంటూ శివరామ్ని నిలదీశాడు.

కిళ్ళీషాపువాడు తనని అలాచేస్తాడని ఊహించని శివరామ్ హడలిపోయాడు.

వెంటనే వాడి చేతిలోంచి ఒక్క ఉదుటున తన ఫిల్టులాక్కుని అక్కడి నుంచి పరుగు లంకించుకున్నాడు.

కిళ్ళీషాపువాడు శివరామ్‌ని వెంట తగిలాడు.

శివరామ్ ముందు....

కిళ్ళీషాపువాడు వెనక...

అలా ఇద్దరూ చాలా దూరం పరుగులు పెట్టారు.

చివరికి శివరామ్ కిళ్ళీషాపువాడికి అందకుండా ఓ సందుమలుపు తిరిగి తప్పుకున్నాడు. ఇక కిళ్ళీషాపువాడికి తను కనుమరుగైపోయానని నిర్ధారించుకున్నాక ఓచోట ఆగి అలుపు తీర్చుకున్నాడు.

తరువాత ముందుకు అడుగులువేశాడు.

ఆ దారి వెంబడి మరో వ్యక్తి పోతూంటే అతనిని ఆపి--

''ఏవండీ... మీకు చేతబడి చేసే మాంత్రికులెవరైనా తెలుసా? ఎక్కడుంటారు?'' అని అడిగాడు ఆ వ్యక్తిని.

ఆ వ్యక్తి శివరామ్‌ని ఎగాదిగా చూశాడు.

వెంటనే ఆ దారినే పోతున్న మరో నలుగురైదుగుర్ని పిలిచాడు ఆ వ్యక్తి.

''చూడండి... వీడెవడో 'చేతబడి చేసే మాంత్రికులెక్కడ?' అని అడుగుతున్నాడు. పాపం! ఎవరినో చంపించేసేవాడిలా ఉన్నాడు?'' అని చెప్పాడు.

అంతే!

అక్కడున్న నలుగురైదుగురు వ్యక్తులు శివరామ్‌కి దేహశుద్ధిచేసి వదిలేశారు.

''ఏరా... ఏ అమాయకుడిని చంపాలని చూస్తున్నావు? ఒళ్ళెలా ఉంది? బుద్ధిగా వచ్చిన దారినే వెళ్ళిపో!'' అని శివరామ్‌ని హెచ్చరించి వాళ్ళదారిన వాళ్ళు వెళ్ళిపోయారా వ్యక్తులు.

తను అడిగే పద్ధతి ఇది కాదేమోనని అనుకున్నాడు శివరాం.

తరువాత ఒక నిర్ణయానికి వచ్చినవాడిలా మళ్ళీ ముందుకు అడుగులు వేశాడు.

అతనలా కొంచెం దూరం నడిచేసరికి ఒక ముసలాయన ఆ దారి వెంబడి కర్రపట్టుకుని నడుచుకుంటూ వస్తున్నాడు.

శివరామ్ ఆ ముసలతనిని ఆపి—

''తాతగారూ... మాది ఈ వూరు కాదు. పొరుగూరునించి వస్తున్నాను. దారిలో నాకు గాలిపట్టుకుంది. బాగుచేయించుకుందామంటే భూతవైద్యులెక్కడుంటారో నాకు తెలీదు. దయచేసి మీకు తెలిసిన భూతవైద్యులెవరైనా ఉంటే, వాళ్ళెక్కడ దొరుకుతారో చెబుతారా?'' అని అడిగాడు.

''పాపం!'' అని ఆ వృద్ధుడు శివరామ్‌ని జాలిగా చూశాడు.

''ఈ రోడ్డుకి తిన్నగా వెళ్ళి రెండు సందులు దాటాక మూడో సందు తిరిగితే మరో సందువస్తుంది. దానిని అల్లిపురం అని అంటారు. అక్కడే భూతనాథ్ అని ఓ ప్రముఖ మంత్రగాడున్నాడు. వెళ్ళి బాగుచేయించుకో నాయనా!'' అని చెప్పాడు.

శివరామ్ మనసులోనే ఎగిరిగంతేసినంత పనిచేశాడు.

తాతగారికి కృతజ్ఞత చెప్పుకుని ముందుకు అడుగులు వేశాడు.

ఆ ముసలాయన చెప్పిన ప్రకారం రెండు సందులు దాటి, మూడో సందు మలుపు తిరిగి, అల్లిపురం అని పిలవబడే ఆ నాలుగో సందు మలుపులోకి అడుగుపెట్టాడు.

ఆ సందు మొదట్లోనే పెద్దడాబా ఇల్లు ఉంది.

ఆ డాబా ఇంటి బయట 'భూతనాథ్, మాంత్రికుడు' అని బోర్డు ఉంది.

ఆ డాబా ఇంటి తలుపులు మూసి ఉన్నాయి.

శివరామ్ ఆ ఇంటి ముందు నిలబడి తలుపు తట్టాడు.

ఓ నిమిషం పోయాక తలుపులు తెరుచుకున్నాయి.

ఎదురుగా పెద్దపులి మీసాలతో, బవిరి గడ్డంతో భూతనాథ్ నిలబడి ఉన్నాడు.

శివరామ్ వినయంగా అతనికి నమస్కారం చేశాడు.

భూతనాథ్ అతనికి ప్రతినమస్కారం చేసి--

''లోపలికిరా'' అని ఆజ్ఞాపించాడు.

శివరామ్ లోపలికి అడుగుపెట్టాడు.

గదిలోపల గచ్చుమీద రంగురంగుల ముగ్గులుపెట్టి ఉన్నాయి. ఆ ముగ్గులకు అలంకరణలా అక్కడక్కడ పుర్రెలు, ఎముకలు పెట్టబడి ఉన్నాయి. పక్కనే చిన్న హోమగుండం ఉంది. అందులో సమిధలు కాలుతున్నాయి. ఆ హోమగుండం పక్కనే మధ్యకు కోసేసిన కొన్ని నిమ్మకాయలు, ఎవేవో మూలికలు పడిఉన్నాయి. ఆ పక్కనే చిన్న కమండలం ఉంది.

"ఇప్పుడు చెప్పు- చెయ్యాలా? తియ్యాలా?" అని అడిగాడు భూతనాథ్.

చెయ్యడమేమిటో, తియ్యడమేమిటో శివరామ్‌కి అర్థంకాలేదు.

"స్వామీ... చెయ్యడమంటే ఏమిటి? తియ్యడమంటే ఏమిటి?" అని అడిగాడు.

"పిచ్చివాడా... ఆపాటి జ్ఞానం కుడా లేనిదే నువ్వు నా దగ్గరకు ఎందుకొచ్చావ్?" అని గుడ్లురిమి చూశాడు భూతనాథ్.

భూతనాథ్ అలా ఎర్రగా చూసేసరికి శివరామ్ పై ప్రాణాలుపైనే పోయాయి. "మహాప్రభో... నేను ఒకడిని మీచేత చేతబడిచేయించి చంపించేయాలని వచ్చాను. మీకెంత డబ్బు కావాలన్నా ఇచ్చుకుంటాను" అన్నాడు.

భూతనాథ్ భయంకరంగా నవ్వాడు.

"పిచ్చివాడా... లేలే" అని శివరామ్‌ని కాళ్ళ మీంచి లేపి నిలబెట్టాడు.

"చెయ్యాలా అంటే ఎవరికైనా చేతబడిపెట్టడం అన్నమాట! తియ్యాలా అంటే ఎవడికైనా పెట్టిన చేతబడిని తియ్యడం అన్నమాట ఇప్పుడర్థమయిందా?" అని అడిగి, "ఇక చెప్పు... ఎవడువాడు? వాడికి నువ్వెందుకు చేతబడి చెయ్యించాలనుకుంటున్నావు? వాడివల్ల నీకేమైనా హాని ఉంటేనే నేను వాడికి చేతబడి చేస్తాను... లేకపోతే చెయ్యను. చెప్పువాడి కథేమిటి?" అని అడిగాడు భూతనాథ్.

రాంబాబు సంగతి సవివరంగా చెప్పాడు శివరాం.

భూతనాథ్‌కి కళ్ళు తిరిగిపోయి స్పృహ తప్పింది. పక్కకి ఒరిగి పోయాడతను.

శివరామ్ గాభరాగా పక్కనే ఉన్న కమండలంలోంచి నీళ్ళు తీసుకుని భూతనాథ్ ముఖంమీద చల్లాడు.

కొంతసేపటికి భూతనాథ్ కళ్ళు తెరిచాడు.

"స్వామీ... ఏమయింది మీకు? ఎందుకలా మూర్ఛపోయారు?" అని అడిగాడు శివరామ్.

"నువ్వు చెప్పిన ఆ దారుణ రచయిత గురించి విని ఇలా మూర్ఛపోయానంతే!" కొద్దిగా వణుకుతూ చెప్పాడు భూతనాథ్.

"స్వామీ... ఇంతకూ మీరా రాంబాబుగాడికి చేతబడి చేస్తారా, చెయ్యరా?" అని అడిగాడు అనుమానంగా.

భూతనాథ్ శివరామ్‌ని జాలిగా చూసి "అది జరగని పని" అని చెప్పాడు.

"అదేమిటి స్వామీ... అలా అంటున్నారు?"అని అడిగాడు శివరామ్ అయోమయంగా.

"అవును నాయనా! అది జరగని పని. నువ్వు చెప్పిన విషయాలనుబట్టి ఆ రాంబాబుగాడు ఈ వూరువాడే కాబట్టి వాడు తప్పకుండా తెలుగు రచయితే అయివుంటాడు... అవునా?"

"అవునండీ... వాడు తెలుగు రచయితే!" చెప్పాడు శివరామ్.

"అందుకే వాడికి చేతబడిపెట్టడం జరగని పని. నాదగ్గరఉన్న భూత ప్రేత పిశాచాలన్నీ తెలుగు తప్ప మరో భాషరానివి. అవి తెలుగు పత్రికల్నే ఆశ్రయించుకుని బతుకుతూ ఉంటాయి. ఒక వేళనేనా రాంబాబుగాడిని చేతబడి చేసి చంపేస్తే వాడు భూతమై, నా భూతప్రేత పిశాచాల పత్రికల మీద కూడా తన రచనలతో దాడిచేస్తాడు. అప్పుడీ భూత ప్రేత పిశాచాలన్నీ ఈ ఊరి పొలిమేరలు దాటి పారిపోతాయి. అప్పుడు నేను మరొకరికెవరికైనా చేతబడి పెట్టాలన్నా, తియ్యాలన్నా అవి నేను పిలిచినా సరే నా దరిదాపులకు రావు. అందుచేత నేనా రాంబాబుగాడికి చేతబడి చేసి నా వృత్తిని వదులుకోలేను" బాధగా చెప్పాడు భూతనాథ్

శివరామ్ హతాశుడయ్యాడు.

కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

తన ఆఖరి ప్రయత్నం కూడా వమ్ము అయిపోయింది.




"నరేసార్... మీవల్లే ఆ పని కానప్పుడు, ఆ రాంబాబుగాడికి సహజమరణం ప్రాప్తించేదాకా ఇక వాడిని ఎవరూ ఏమీ చేయలేరు- అది మా ఖర్మ. పూర్వజన్మలో ఏపాపం చేసుకున్నామో ఈ జన్మలో అనుభవిస్తున్నాము. వస్తాను సార్... సెలవ్!" అని శివరామ్ బరువుగా, బాధగా వెనుదిరిగాడు.

శివరామ్ నాలుగడుగులు వేయగానే-

"శివరామ్" అంటూ మళ్ళీ వెనక్కి పిలిచాడు భూతనాథ్.

"ఏమిటిసార్?" అంటూ శివరామ్ దగ్గరగా వచ్చాడు.

"నిన్ను చూస్తే నాకు చాలా జాలేస్తోంది- పోనీ ఒక పనిచెయ్యి.
పారుగూళ్ళో మాంత్రికుడొకతను ఉన్నాడు. అతను నాకు మంచి మిత్రుడు. నేనతని అడ్రసు ఇస్తాను. నువ్వు వెళ్ళి అతన్ని కలుసుకో. నీ విషయంలో అతను నీకు తప్పక సహాయం చేయగలడనే ఆశిస్తున్నాను" అని చెప్పాడు భూతనాథ్.

శివరామ్ అడుగంటిన ఆశ మళ్ళీ చిగురించింది.

"అలాగే! ఆయన అడ్రసు ఇవ్వండి" అని అడిగాడు కుతూహలంగా.

భూతనాథ్ ఓ కాగితం మీద అడ్రసు రాసిచ్చాడు.

శివరామ్ భద్రంగా ఆ అడ్రసు కాగితాన్ని జేబుల్లో పెట్టుకుని, భూతనాథ్‌కి నమస్కరించి వడివడిగా ముందుకు అడుగులు వేశాడు.

అర్థరాత్రి ఒంటిగంటయింది.

శివరామ్ ట్రెయిన్ దిగి ప్లాట్‌ఫారం మీదికి అడుగుపెట్టాడు.

నెమ్మదిగా నడుచుకుంటూ గేటు దగ్గర టీసీకి టిక్కెట్‌ఇచ్చి స్టేషన్ బయటకు వచ్చాడు.

సమయానికి మెయిల్ దొరక్క పాసింజర్‌లో వచ్చాడేమో... రాత్రి తిండిలేకపోయింది.

స్టేషన్‌లో టీ తాగి కడుపు నింపుకున్నాడు శివరామ్.

ఊరుకానివూరు... వేళకాని వేళ... ఈ సమయంలో ఇంత రాత్రివేళ ఎలా కలుసుకునేది? తెల్లవారేదాకా ఎక్కడ గడిపేది?... అని ఆలోచించసాగాడు శివరామ్.

'ఒరేయ్ రాంబాబూ...! చూడరా! నిన్ను చంపడం కోసం నేనెన్ని కష్టాలు పడుతున్నానో! మా సంపాదకులని ఎన్నో ఇక్కట్లపాలుచేసి, ఆఖరికి నా స్నేహితుడిని కూడా చంప ప్రయత్నించి నన్ను ఇన్ని పాట్లుపెడుతున్నందుకు ఇంతకి ఇంత అనుభవించకపోవు అని కసిగా అనుకున్నాడు.

నెమ్మదిగా ముందుకి అడుగులు వేశాడు.

ఓ పది అడుగులు ముందుకి నడిచేసరికి రోడ్డువారన ఓ కాకా హోటల్ కనిపించింది.

లోపల దీపం వెలుగు కనిపిస్తోంది. కాని బయట తినుబండారాలేమీ అమ్ముతున్నట్లు కనిపించడం లేదు. లోపల వాళ్ళు పడుకుని నిద్రపోతున్నట్టున్నారు.

శివరామ్ హోటల్‌వాళ్ళని లేపి తినడానికి ఏమైనా వున్నాయేమోనని అడుగుదామనుకున్నాడు. ఆ కాకాహోటలుని సమీపించాడు.

"ఎవరు లోపల?" అని అడిగాడు.

"మీరెవరు?" అంటూ లోపలి నుంచి ఓ వ్యక్తి తల బయటకు పెట్టాడు.

లోపల వెలుగుతున్న దీపం వెలుగులో శివరామ్ ఆ వ్యక్తిని పరీక్షగా చూశాడు.

నల్లగా తుమ్మమొద్దులా ఉన్నాడతను. లావుగా గున్నేనుగు పోలి ఉందతని ఆకారం. హాఫ్ కాకీ నిక్కరు, కట్‌బనీను వేసుకుని ఉన్నాడు.

"నేను ఇప్పుడే బండిదిగి వస్తున్నాను. తినడానికి ఏమైనా ఉందా?" అని అడిగాడు శివరామ్.

"రాత్రి వండిన నూకా రొట్టెలున్నాయి. వాటిలో నంజుకి ఏమీ లేదు. కావాలంటే వడ్డిస్తాను రండి" అన్నాడా వ్యక్తి.

నూకా రొట్టెలలో నంజుకి ఏమీ లేకపోతే వాటి రుచి ఎలావుంటుందో శివరామ్‌కి తెలియనిదికాదు. అసలు గొంతు దిగనే దిగవా రొట్టెముక్కలు. అయినా ఆకలి- తప్పదు... అవే తినాలి.

"సరే... అవే పెట్టు" అన్నాడు శివరామ్.




"లోపలికిరండి" అన్నాడా వ్యక్తి.

శివరామ్ లోపలికి అడుగుపెట్టాడు.

అక్కడ ఉన్న ఒకే ఒక బెంచి మీద చతికిల బడ్డాడు.

ఆ వ్యక్తి ప్లేట్లో ఐదారు సూకా రొట్టెలు తీసుకువచ్చి శివరామ్‌కి అందించాడు. శివరామ్ ఆ ఎండు రొట్టెలను తినలేక తింటూ ఆ వ్యక్తిని సంభాషణలోకి దింపాడు.

"నీపేరేమిటి?" అని అడిగాడు.

"అప్పారావు" చెప్పాడా వ్యక్తి.

"మీది ఈ ఊరేనా?"

శివరామ్ ఆ ప్రశ్న అడగ్గానే అప్పారావు "బేర్" మంటూ ఏడ్చేశాడు.

"మహాప్రభో... ఆ మాట నన్నడక్కండి. నా నోటితో నేను చెప్పలేను. నేనీ ప్రాంతానికి ఈమధ్యనే వచ్చాను. నేను విజయవాడలో ఉండేవాడిని. 'పోగాలము దాపురించినవారు మిత్ర వాక్యమును వినరు. అని పెద్దలు చెప్తారు. నాకో పత్రికాఫీసు పెట్టాలనిపించింది. వద్దని నా శ్రేయోభిలాషులంతా ఎంత చెప్పినా వినకుండా పత్రికాఫీసుపెట్టి ఈ గతి తెచ్చుకున్నాను" అంటూ బావురుమన్నాడు అప్పారావు.

"అంటే.... మీరు ఒకప్పుడు పత్రికా సంపాదకులన్నమాట?" అన్నాడు శివరామ్ ఆశ్చర్యపోతూ.

"అవునండీ... నాకథ వినండి" అంటూ అప్పారావు తమ కథ చెప్పడం ప్రారంభించాడు.



8

అప్పారావుది విజయవాడ. ఆంధ్రాయూనివర్సిటీలో చదువుకున్నాడు. జర్నలిజమ్‌లో డిప్లొమా తీసుకున్నాక విజయవాడ వచ్చేశాడు.

అతనికి పత్రిక పెట్టాలనిపించింది.

"పత్రికలు అందరికీ అచ్చిరావు... నువ్వు పెట్టొద్దు" అని మిత్రులు, శ్రేయోభిలాషులు ఎంత చెప్పినా వినలేదు అప్పారావు.

ఓ శుభముహూర్తాన అచ్చు యంత్రం కొని, ఓ మంచి సెంటర్ చూసి, "జంతర్ మంతర్" అనే ఓ వార పత్రిక స్థాపించాడు. కథలు కావాలని ఇతర పత్రికలలో ఎడ్వర్టైజ్‌మెంట్లు ఇప్పించాడు.

'జంతర్ మంతర్' పేరు వింతగా ఉండటంతో అదేదో నిజంగా జంతర్ మంతర్‌లాటి పత్రికేనని రచయితలెవరూ ధైర్యంచేసి ఆ పత్రికకు కథలు పంపలేదు.

అయితే రాంబాబు ఇతర పత్రికల నుంచి తిరిగొచ్చిన ఓ వంద కథలని 'జంతర్ మంతర్' పత్రికకు పంపాడు.

ఒక్కరోజులోనే తన కార్యాలయానికి అన్ని కథలు వచ్చిపడేసరికి అప్పారావు కళ్ళు జిగేల్ మన్నాయి.

ఏమి తన అదృష్టం! ఎంతమంది రచయితలు తన కార్యాలయానికి ఎన్ని కథలు పంపించారు... అని పొంగిపోయాడు.

తీరా కథల కవర్ల మీద ఫ్రమ్ అడ్రస్‌లు చూసేసరికి- ఆ అడ్రసులన్నీ ఒక రచయితవే

అంతే!

అప్పారావు గాలి తీసేసిన బెలూనులా అయిపోయాడు.

పోనీలే! రాంబాబు అనే రచయిత అయినా తన పత్రిక మీద ప్రేమతో అన్ని కథలు పంపించాడు... అని అనుకున్నాడు.

వెంటనే తన పత్రికాఫీసులో నియమించిన సబ్‌ఎడిటర్ శంభులింగం, జంబులింగంలిద్దరినీ పిలిచి ఆ రచలని పరిశీలించమని చెప్పాడు.

అయితే--

శంబులింగం, జంబులింగం కథలు పరిశీలించకుండా కార్యాలయంలో కూర్చుని పేకా

డుకుంటూ గడిపేశారు.

సాయంకాలం అప్పారావు తన గదిలోంచి బయటికి రావడం చూసి గప్‌చిప్‌గా ఆడు కుంటున్న పేకముక్కలని టేబుల్‌కిందకి తోసే శారు.

రాంబాబు రచనలు తీసుకుని ముందు పెట్టుకుకూర్చున్నారు.

"ఏం... శంభులింగం! జంబులింగం! ఆ రచనలు ఎలా వున్నాయో చూశారా?" అని అడిగాడు అప్పారావు.

"చూశామండి చీఫ్ ఎడిటర్‌గారూ... ఓ యాభై కథలు దాకా చూశాం. చాలా వెరైటీగా ఉన్నాయి. మిగతా కథలు రేపు పరిశీలిస్తాం" వినయంగా చెప్పాడు శంభులింగం.

"ఇంత మంచి కథలు నేనెక్కడా చూడలే దంటే నమ్మండి" అన్నాడు జంబులింగం.

అప్పారావు నిజమేననుకున్నాడు.

"రేపు మిగతా ఐదొందల కథలూ చూసే యండి" అని చెప్పాడు.

మర్నాడు–

ఉదయం ఎనిమిది గంటలకు అప్పారావు కార్యాలయానికి వచ్చేసరికి శంభులింగం, జంబులింగం మళ్ళీ పేకాటలో కూర్చున్నారు.

అప్పారావు లోపలికి అడుగుపెట్టడం చూసి పేకముక్కలని గుట్టుచప్పుడు కాకుండా టేబుల్ కిందికి తోసేసి, రాంబాబు రచనలని ముందు వేసుకుని కూర్చుని, చదువుతున్న ట్టుగా నటించసాగారు.

అప్పారావు తన సబ్ ఎడిటర్లని చూసి తృప్తిగా తల పంకించాడు.

నిజంగా వీళ్ళకి పని అంటే ఎంత శ్రద్ధ' అని అనుకున్నాడు.

అప్పారావు వెళ్ళిపోయాడు.

శంభులింగం, జంబులింగం రాంబాబు రచనలు పక్కనపెట్టేసి, టేబుల్ కింది నుంచి పేకముక్కలు తీసి ఆటలో లీనమైపోయారు.

ఆ సాయంకాలం-

"ఆ రచయిత రాంబాబు మిగతా కథలు ఎలావున్నాయి?" అని అడిగాడు అప్పారావు.

"సూపర్బ్ సార్!" అన్నాడు జంబులింగం.

"ఫెంటాస్టిక్ అంటే నమ్మండి!" అన్నాడు శంభులింగం.

"వెరీగుడ్! అయితే రేపే ఆ కథల్లో ఓ పదింటిని అచ్చుకి ఇచ్చేయండి. సీరియల్‌కి కూడా మన పత్రిక అంతా ఆ రచయిత రచనలే వేసేద్దాం. మరి మనకి ఇతర రచయి తల కథలు రాలేదుకదా!" అని అన్నాడు అప్పారావు.

"చిత్తం... అలాగేనండీ!" అని తలవూపా రు ఇద్దరూ.

నిజానికి శంభులింగం, జంబులింగం పని దొంగలవటం వాళ్ళ అదృష్టమనే చెప్పాలి.

ఎంచేతంటే వాళ్ళు రాంబాబు రచనని ఒక్కటి కూడా కవరులోంచి బయటికి తియ్యలే దు. తీసి చదివి ఉంటే, అక్కడికక్కడే గుండె ఆగి చద్దురు. వాళ్ళు రాంబాబు రచనల టైటిల్స్‌ని కూడా చూడలేదు. ఒకవేళ వాళ్ళు ఆ రచనల టైటిల్స్ చూసి వుంటే, తప్పకుండా అతడి కథలు వాళ్ళని చదివింపజేసేవి. వాళ్ళు గుండె ఆగి చచ్చేవాళ్ళు. రాంబాబు రచనలలోని ప్రత్యేకతే అదికదా! వాళ్ళిద్దరూ రాంబాబు రచనలని చూడకుండా బతికిపో యారు- అదృష్టవంతులు.

శంభులింగం, జంబులింగం మీద నమ్మ కంతో రాంబాబు రచనలని పరిశీలించలేదు.

అదే అతని కొంపతీసింది.

మర్నాడు-

రాంబాబువి పది కథలూ "జంతర్ మంతర్" పత్రికలో ప్రచురితమయ్యాయి. మరో రెండురోజుల్లో-

పత్రిక మార్కెట్లోకి రిలీజయింది.

వేలాది కాపీలు అమ్ముడుపోయాయి.

అప్పారావు పొంగిపోయాడు.

మరో నాల్రోజులు పోయాక వేలాదిమంది పాఠకులు "జంతర్ మంతర్" పత్రిక మీదికి ఉత్తరాల దాడిని ప్రారంభించసాగారు.

ఇలాంటి చెత్త పత్రికని తమ జీవితంలో చూడలేదని, ఆ చెత్త పత్రికలో పడ్డ రచయిత రాంబాబు రచనలు పరమ చెత్తగా ఉన్నా యని, పత్రికని స్థాపించి ఇలాంటి చెత్త రచన లు ప్రచురించేకంటే, పత్రిక మూసేసుకుని,

జోలిపట్టుకుని వూరూరా తిరిగి అడుక్కుతిన డంమేలని... అంటూ రకరకాలుగా పాఠకులు వుత్తరాల వర్షం కురిపించారు.

ఆ వుత్తరాలు చూసి అప్పారావు కొయ్యబారి పోయాడు.

తలదిమ్మెరపోయింది. మెదడు గిరెత్తిపో యింది.

శంభులింగాన్ని జంబులింగాన్ని కేకేసి, వాళ్ళమీద ఫైరైపోయాడు.

పక్కనే ఉన్న నీళ్ళకూజా తీసుకుని వాళ్ళ బుర్రల మీద పిచ్చిగా ఒక్కపెట్టుపెట్టాడు.

కూజా పగిలి వాళ్ళబట్టలన్నీ నీళ్ళతో తడి సిపోయాయి.

తరువాత పిచ్చిగా జుత్తు పీక్కుంటూ పిచ్చి కుక్కలా వాళ్ళని కరిచేయబోయాడు.

దాంతో శంభులింగం, జంబులింగం బెదిరి పోయి కాలికి బుద్ధిచెప్పారు.

అయినా అప్పారావు వాళ్ళని వదల్లేదు.

కాట్లకుక్కలా కేకలు వేస్తూ వాళ్ళని వెంటత రిమాడు.

ఆ సబ్ ఎడిటర్లలిద్దరూ అప్పారావుకి అందకుండా రోడ్డు మీద కనుమరుగైపోయా రు.

చివరికి అప్పారావు ఏడ్చుకుంటూ కార్యాల యానికి తిరిగి వచ్చాడు.

అలా అతను కార్యాలయానికి తిరిగి వచ్చే సరికి రిజిస్టరు పోస్టులో నాలుగు లాయర్ నోటీసులు పోస్టుమేన్ తీసుకువచ్చి అందించా డతనికి.

జంతర్ మంతర్ పత్రికలోని రచయిత రాంబాబు రచనలు చదువుతూంటే తనకు కాలుచెయ్యి పడిపోయి పెరాలసిస్‌స్ట్రోక్ వచ్చిందని, అలాంటి చెత్త రచనలు ప్రచు రించినందుకుగాను అప్పారావు తనకి లక్ష రూపాయలు నష్టపరిహారం చెల్లించవల సిందని భాగ్యనగరం నుంచి మంచినూనె నారాయణరావు అనే పాఠకుడు లాయర్ నోటీ సు పంపించాడు.

'జంతర్ మంతర్' పత్రికలో రాంబాబు చెత్త రచనలు చదవడంవలన తనకు గుడ్డి తనం ప్రాప్తించిందని, అలాంటి చెత్తరచనలు ప్రచురించి తన కళ్ళకు ప్రమాదం కలిగించి నందుకు లక్ష రూపాయలు నష్టపరిహారం చెల్లించాలి- అంటూ కొత్తపల్లి నుంచి భాగోత రావు అనే పాఠకుడు లాయర్ నోటీసు ఇప్పించాడు.

రాంబాబు కథలు చదవడంవలన తనకు చెముడు వచ్చిందని,కాబట్టి యాభైవేలు నష్టప రిహారం అప్పారావు తనకు చెల్లించాలని బొంబాయి నుంచి బాబూరావు అనే పాఠకుడు లాయర్ నోటీసు పంపించాడు.

రాంబాబు చెత్త కథలు చదువుతూ తన నాయనమ్మ గుండె ఆగి మరణించిందని ఆ కథలు తన జంతర్ మంతర్ పత్రికలో ప్రచు రించి అందుకు బాధ్యుడైన అప్పారావు తనకి ఎలాగూ నాయనమ్మ లేని లోటు తీర్చలేడు కాబట్టి రెండు లక్షల రూపాయలు నష్టపరి హారం చెల్లించవలసిందని అంటూ తాడేపల్లి గూడెం నుంచి తాతారావు అనే పాఠకుడు లాయర్‌నోటీసు పంపించాడు.

ఆ నాలుగు లాయర్ నోటీసులు చూడగానే అప్పారావు గుండె బేజారెత్తిపోయింది.

లబోదిబోమంటూ లాయర్ దగ్గరకు పరిగెత్తా డు.

ఆ లాయరు సహాయంతో ఇందులో తన తప్పేమీలేదని, ఇలాంటి చెత్తరచనలు చే సినందుకు ఆ తప్పంతా రాంబాబుదే అవు తుందని, అతను ఎంతగానో కోర్టులో వాదించా డు.

కాని-

అప్పారావు వాదనని కోర్టు వినలేదు. అలాంటి చెత్త రచనలు ప్రచురించి పాఠకు లకు నష్టాన్ని కలిగించింది అతని పత్రికే కాబట్టి, అప్పారావు తప్పనిసరిగా ఆ నలుగురి పాఠకులకు నష్టపరిహారం చెల్లించాలి- అంటూతీర్పుచెప్పింది.

పాపం... అప్పారావు లబోదిబోమని గోలపె ట్టాడు.

ఎంత గోలపెట్టినా కోర్టు తీర్పుని ఎవరూ కాదనలేరుగా!

అందుచేత ఆ నలుగురి పాఠకులకి మొ త్తం నాలుగు లక్షల యాభైవేల నష్టపరిహారం చెల్లించవలసి వచ్చింది. ఆ ప్రయత్నంలో




అప్పారావు తన ఆస్తులన్నీ అమ్మేసుకుని పూర్తిగా దివాలా తీశాడు.

ఆ తరువాత-

పూలమ్ముకునే చోట కట్టెలమ్ముకోలేక విజయవాడ వదిలేసి, ఇక్కడ హోటల్ సర్వర్‌గా జీవనాన్ని సాగిస్తున్నాడు.




"అదండీ నా కథ శివరామ్‌గారూ! పత్రిక పెట్టి, దాని బాగోగులు సరిగా చూసుకోకుండా నా తెలివితక్కువతనంవల్ల, చెత్త రచనలు ప్రచురించి ఇలా దివాళా తీశాను" అంటూ బాధగా తన కథ చెప్పడం ముగించాడు అప్పారావు.

అతని కథ విన్న శివరామ్ చాలాసేపు నోరుతెరుచుకుని అలాగే వుండిపోయాడు.

కొంచెంసేపు పోయాక తేరుకుని--

"అయ్యో అప్పారావుగారూ! మీకెంత కష్టం వచ్చింది? ఆ రాంబాబుగాడి వల్ల మీరూ నష్టపోయారన్నమాట! ఆ రాంబాబుగాడు నాకు తెలుసు" అన్నాడు.

ఈసారి అప్పారావు ఆశ్చర్యపోయాడు. వివరాలన్నీ చెప్పించుకున్నాడు.

అప్పటికి పూర్తిగా తెల్లవారింది.

ఆ కాకా హోటల్లో వున్న ఇద్దరు వంటవాళ్ళు లేచి టీపెట్టే ప్రయత్నంలో పడ్డారు.

వాళ్ళ యజమాని లేచి కాష్‌బాక్స్ దగ్గర కూర్చున్నాడు.

"మరి నాకు సెలవిప్పిస్తారా అప్పారావుగారూ! నేనిక ఆ మాంత్రికుడి దగ్గరకు బయలుదేరతాను" అన్నాడు శివరామ్.

"శివరామ్‌గారూ! నేనూ మీతో వస్తాను... పదండి" అన్నాడు అప్పారావు.

తరువాత తన యజమాని దగ్గర ఆరోజు సెలవు అడిగి, అప్పారావు శివరామ్‌తో కలిసి బయటకు వచ్చాడు.

ఇద్దరూ రిక్షా ఎక్కి అడ్రసు చెప్పారు.

రిక్షా ముందుకు దూకింది.

రిక్షావాడు ఓ రెండు గంటలపాటు సందులు గొందులు తిప్పి, చివరికి వూరిచివర వున్న ఓ గుడిసెముందు రిక్షా ఆపాడు.

ఇద్దరూ రిక్షా దిగారు.

శివరామ్ రిక్షావాడికి డబ్బులిచ్చేసి పంపేశాడు.

తరువాత వాళ్ళిద్దరూ గుడిసెలోకి అడుగు పెట్టారు.

ఆ గుడిసె మధ్య రకరకాల రంగులతో ముగ్గులు పెట్టబడి వున్నాయి. ఆ ముగ్గుల మధ్య పెద్ద పుర్రె, రెండు చేతి ఎముకలు పెట్టబడి వున్నాయి. ఆ పక్కనే సగానికి కోసి వేయబడిన నిమ్మకాయచెక్కలు వున్నాయి. ఆ పక్కనే కొంచెం ఎడంగా ఓ మూలన ఏవేవో మూలికలు కుప్పపెట్టబడి వున్నాయి. ఆ పక్కనే చిన్న కమండలం వుంది.

ఆ ముగ్గుల ముందు మహామాంత్రికుడు సాహుపండా నిశ్చలంగా కళ్ళుమూసుకుని వున్నాడు. అతని ఎదురుగా హోమగుండం మండుతోంది.

ఎర్రటి రక్త వర్ణంగల పంచె ధరించి వున్నాడతను. ఒళ్ళంతా విబూది రేఖలు వున్నాయి. మెడలో రుద్రాక్షమాలలు వేలాడుతున్నాయి. నుదుటిన రూపాయి కాసంత కుంకుమ బొట్టు వుంది. బవిరిగడ్డం, జడలు బారిన జుత్తు... చూపరులకు భయంగొలుపుతోందతని ఆకారం.

అలికిడి విని కళ్ళు తెరిచి చూశాడు సాహుపండా!

"డింభకులారా! ఎవరు మీరు!?" అని అడిగాడు.

వాళ్ళిద్దరూ భక్తిగా నమస్కరించి నిలబడ్డారు.

హాని ఏమిటి? వాడివల్ల మీకేమైనా నష్టం జరిగితేనే నేను చేతబడి చేస్తాను లేకపోతే చెయ్యను'' అన్నాడు సాహుపండా.

శివరామ్ క్లుప్తంగా తాము వచ్చిన పని చెప్పాడు.

అంతే!

''ఆ'' అంటూ సాహుపండా మూర్ఛపోయాడు.

వెంటనే అప్పారావు, శివరామ్ కలిసి పక్కనే వున్న కమండలంలోంచి నీళ్ళు ముఖం మీద చల్లి సాహుపండాకి శైత్యోపచారాలు చేశారు.

కొంచెంసేపటికి కళ్ళుతెరిచాడు సాహుపండా.

''ఏమిటి స్వామీ... ఏమయింది మీకు?'' అప్పారావు, శివరామ్ ఆతృతగా అడిగారు.

''ఏమీ లేదు. ఆ దారుణ రచయిత గురించి ఆలకించగానే షాక్ తిని మూర్ఛపోయానంతే'' అని చెప్పాడు సాహుపండా.

శివరామ్ ఆయన వంక అనుమానంగా చూశాడు. లోగడ రాంబాబుగాడి గురించి చెప్పినప్పుడు భూతనాథ్ కూడా ఇలాగే మూర్ఛపోయాడు. ఒకవేళ ఈ సాహుపండా కూడా ఆ రాంబాబుగాడిని ఏమీ చేయలేడేమో!

'ఇదెక్కడి ఖర్మరాబాబూ!' అంటూ మనసులోనే మథనపడసాగాడు శివరామ్.

అయితే అనుమానాన్ని పటాపంచలుచేస్తూ—

''రాంబాబుగాడిని తప్పకుండా హతమారుస్తాను. మీ సంపాదకలోకానికి పట్టినపీడని వదిలిస్తాను'' దృఢంగా అన్నాడు సాహుపండా.

ఆ మాటలకు శివరామ్ ఎగిరి గంతేసినంత పనిచేశాడు.

అప్పారావైతే సరేసరి!

''స్వామీ... అయితే మీ కార్యక్రమాన్ని ప్రారంభించండి'' అన్నాడు శివరామ్.

''ఈరోజు అర్ధరాత్రి పన్నెండు గంటలకు శ్మశానానికి వెళదాం. అక్కడ నా మంత్రబలంతో భూతాలని పిలిచి వాడిమీదికి వుసిగొలిపి వాడి పనిపడతాను. మీరు రాత్రి పన్నెండు కొట్టగానే నా గుడిసెకు రండి'' అన్నాడు సాహుపండా.

''అలాగే స్వామీ... తప్పకుండా వస్తాము'' అని సాహుపండాకి నమస్కరించి శివరామ్, అప్పారావులు వెనుదిరిగారు.

★ ★ ★

అర్ధరాత్రి పన్నెండు గంటలకు శివరామ్, అప్పారావులు సాహుపండా గుడిసెకు చేరుకున్నారు.

''స్వామీ... స్వామీ'' అని పిలిచారు బయట నుంచి.

వాళ్ళ గురించే ఎదురుచూస్తున్న సాహుపండా గుడిసెలోంచి బయటకు వచ్చాడు.

అతని చేతిలో ఓ సంచి వుంది.

పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ సమీపంలో వున్న శ్మశానానిని బయలుదేరాడతను.

శివరామ్, అప్పారావు అతనిని అనుసరించారు.

ముగ్గురూ శ్మశానానికి చేరుకున్నారు.

అక్కడక్కడ కాలుతున్న శవాల చితి మంటలు... ఎముకలు, పుర్రెలు చిందరవందరగా పడివున్నాయి. ఆ శ్మశానంలో వున్న మర్రిచెట్టు జీమూతంలా విరబోసుకుని వుంది. దాని ఆకులుగాలికి జివ్వుమని శబ్దంచేస్తున్నాయి.

సాహుపండా తిన్నగా ఆ మర్రిచెట్టు కిందికి నడిచాడు.

సంచిలోంచి చిన్న చిన్న పుల్లలు తీసి నేలమీద పేర్చాడు. అగ్గిపుల్ల వెలిగించాడు.

మంటరాజుకుని పుల్లలు భగాభగా మండుతున్నాయి.

వాటి ఎదురుగా పెద్ద ముగ్గువేసి, దానిమధ్య ఓ పుర్రె, రెండు ఎముకలు వుంచాడు.

చేతిలో మరో ఎముక పట్టుకుని—

''ఇప్పుడు చెప్పండి... ఆ రాంబాబుగాడిని రోజులలో చంపేదా? గంటలలో చంపేదా? రోజులైతే ఎని రోజుల్లో చంపమంటారు? గంటలైతే ఎన్నిగంటల్లో చంపమంటారు?'' అని అడిగాడు.

''రోజులు వద్దుస్వామీ! గంటల్లోనే చంపండి. అదీ ఓ గంటలోనే చంపేయండి.




వాడెంత తొందరగా చస్తే అంత తొందరగా పీడవిరగడ అవుతుంది" చెప్పాడు శివరామ్.

"సరే... అలాగే! వాడిని ఓ గంటలోనే చంపేస్తాను" అన్నాడు సాహుపంతా.

ఆ తరువాత—

"ఓం హ్రీం... హ్రాం!" అంటూ మంత్రాలు చదవటం మొదలెట్టాడు.

వెంటనే—

"శంబా!"

"జంబా"

"డింబా!"

—అంటూ పెద్దగా కేకపెట్టాడు.

మరుక్షణంలోనే అతని ముందు మూడు భూతాలు ప్రత్యక్షమయ్యాయి ఆ మంటల్లోంచి.

ఆ భూతాల ఆకారాలు తెల్లగా పొగలావున్నాయి. చాలా పొడవుగా ఎత్తుగా వున్నాయి. చేతుల స్థానంలో చేతులు వున్నాయి కాని, కాళ్ళ స్థానంలో మాత్రం వాటికి పొడవాటి తోకలు వున్నాయి.

ఓ భూతం బీడీ కాలుస్తోంది.

మరో భూతం చుట్టపీక పీలుస్తోంది.

ఇంకో భూతం చేతిలో సారాసీసా వుంది.

వాటిని భయంతోను, ఆశ్చర్యంతోను నోరుతెరచుకుని చూడసాగారు శివరామ్, అప్పారావులు.

"భయపడకండి... నా భూతాలు మిమ్మల్ని ఏం చెయ్యవు- ఇవీ మనుషుల్లాంటివే! వీటికీ మనుషుల్లాగే రకరకాల అలవాట్లుంటాయి" అని చెప్పాడు సాహుపంతా.

"శంబా! జంబా! డింబా! నేను మీకెన్నిసార్లు చెప్పాను. నేను పిలిచేటప్పుడు నా ఎదురుగా అలా చుట్టలు, బీడీలు, సారాతాగొద్దని!" అంటూ హూంకరించాడు.

ఆ మూడు భూతాలు చుట్ట, బీడీ, సారాసీసా అవతలపారేశాయి.

"ఇప్పుడు చెప్పండి గురువా... ఏమిటి మీ ఆజ్ఞ?" అని అడిగాయి.

"విశాఖపట్నంలో రాంబాబు అనే ఓ రచయిత వున్నాడు. వాడిని వెంటనే పట్టిపీడించి ఓ గంటలో చంపేయండి" అంటూ ఉత్తరువులిచ్చాడు సాహుపంతా.

అంతే—

వెంటనే అగ్నిమనుంచి ఆ మూడు భూతాలు మాయమైపోయాయి "చిత్తం గురువా!" అంటూ.

శివరామ్ అప్పారావుల ఆనందానికి మేరలేదు.

అంతలోనే శివరామ్‌కి ఓ అనుమానం వచ్చింది.

"స్వామీ... ఒకవేళ రాంబాబుగాడు చచ్చిపోయి భూతమై మళ్ళీ మా సంపాదకలోకాన్ని పట్టిపీడిస్తాడేమో!" అని అన్నాడు.

ఆ మాటలకు సాహుపంతా పెద్దగా నవ్వాడు.

"మీకా భయం అక్కరలేదు. నాదగ్గర వున్న మూడుభూతాలు అతి శక్తివంతమైనవి. మరణించిన వాడి ఆత్మ తిరిగి నిద్రలేవకుండా చేస్తాయి. కాబట్టి మీకా భయం అక్కరలేదు" భరోసా ఇచ్చాడు సాహుపంతా.

★ ★ ★

గదిలో దీపం వెలుగుతోంది.

పంకా తిరుగుతోంది.

ఖరీదైన బల్ల. బల్లచెంత రివాల్వింగ్ చెయిర్. బల్లమీద రెండురకాల జలపోస్లు! రివాల్వింగ్ చెయిర్‌లో సూటు, బూటు వున్న శాల్తీ ఒకటి కూర్చుని పనిచేసుకుంటోంది.

ఆ శాల్తీపేరు రాంబాబు. పక్కనే మరో కుర్చీలో మోహిని వుంది. రెండురోజుల క్రితమే ఆమె అతడి అర్ధాంగి అయింది.

అతడు చేసే పని ఎడిటింగ్!

స్ప్రింగ్‌డోర్లు తెరుచుకున్నాయి.

మూడు శాల్తీలు గాలిలో ఎగురుతూ లోపలికి వచ్చాయి.

రాంబాబు వాటివంక చూశాడు.

అవి గాలిలో తేలుతూ బల్లవద్దకు వచ్చాయి.

"ఎవరు మీరు? కథా రచయితలా? సీరియల్ రచయితలా? అదృశ్యరచయితలా?" అడిగాడు రాంబాబు.

ఆ మూడు శాల్తీలు మొహాలు చూసుకు

న్నాయి.

"మేం రచయితలం కాము... నిన్ను చంపాలని వచ్చిన భూతాలం" అన్నాయి.

రాంబాబు తొణకలేదు, బెణకలేదు.

"మిమ్మల్ని శివరామ్ పంపాడా?" అడిగాడు.

"కాదు... మా గురువుగారు"

"ఏం పేరు?"

"పేరు చెప్పకూడదు"

"అదేమిటి?"

"పతివ్రతలైన హిందూ స్త్రీలు తమ భర్తల పేర్లు చెబుతారా?"

"ఓహో...! మీరు ఉంపుడు గత్తెలన్న మాట!

భూతాలకు కావలసింది అదే! రాంబాబు మీద విరుచుకుపడటానికి, అతడి అంతం చూడటానికి వాటికి తగినంత కారం, వగరు కావలసివచ్చాయి. అందుకే అవి రాంబాబుని రెచ్చగొట్టాయి అతడిచేత రెచ్చగొట్టబడ్డాయి కూడా.

ఆ భూతాలు మూడూ గాలిలోకి లేచి రాంబాబు మీద విరుచుకుపడబోయాయి.

రాంబాబుకి వాటి వుద్దేశం అర్థమయింది.

తొణక్కుండా వాటిని ఆగమని సైగచేశాడు.

అవిగాల్లోనే ఆగిపోయాయి.

"మీరు నన్ను చంపాలని కదా వచ్చారు?" అడిగాడు రాంబాబు.

అవి తలలూపాయి.

"అయితే చచ్చిపోబోయేముందు నేనో చిన్న కోరిక కోరతాను. ఆ కోరిక తీర్చాలి" అన్నాడు రాంబాబు.

వాటికి కూడా అతని కోరిక న్యాయమైనదేననిపించింది.

అవి సంతోషంగా ఒప్పుకున్నాయి.

"ఏమిటా కోరిక?" అని అడిగాయి.

"ఏమీలేదు. ఇదో కథ అంటే పత్రికకు వచ్చిన కథ. చదివి వినిపిస్తాను" అన్నాడు రాంబాబు.

మూడు భూతాలు మొహాలు చూసుకుని ముసిముసి నవ్వులు నవ్వుకున్నాయి. చదువు అన్నట్టు చూశాయి.

రాంబాబు కథ చదవడం మొదలుపెట్టాడు- మోహిని వింతగా చూస్తూ కూర్చుంది.

★ ★ ★

ఆ కథపేరు "బియ్యం తిరగబడ్డాయి"

ఓ ఇంటి ఇల్లాలు బియ్యాన్ని ప్రతిరోజూ కుక్కర్‌లో పెట్టి గేస్‌స్టవ్వు మీద వండుతూ వుంటుంది. ఆ వేడికి బియ్యం కుతకుతమని వుడికిపోతూవుంటాయి. అవి అలాగే గేస్‌స్టవ్ వేడికి వుడికిపోతూంటే ఆ బియ్యం ప్రాణాలు బాధతో జిలార్చుకుపోతూంటాయి. అవి బాధతో ఆక్రందనలు చేస్తాయి. తమని అలా వుడికించి చంపవద్దని ఆ ఇల్లాలు కాళ్ళు పట్టుకుని వేడుకుంటాయి. కాని మనసులేని ఆ ఇల్లాలు వాటి అభ్యర్థనని లక్ష్యపెట్టదు. దాంతో బియ్యానికి కోపం వస్తుంది. అవి ఆ ఇల్లాలిమీద స్ట్రైక్ ప్రకటిస్తాయి. అవి కుప్పతిప్పలుగా ఆమె కళ్ళలోనూ, ముక్కులోనూ, చెవుల్లోను దూరిపోయి ఆమెకు వూపిరాడకుండా చేస్తాయి. దాంతో ఆ ఇల్లాలు ఏడుస్తూ ఆ బియ్యంతో కాళ్ళ బేరానికి వస్తుంది. ఇకనుంచి తను ఆ బియ్యాన్ని బాధించనని, వాటిని గేస్‌స్టవ్‌మీద వుడికించనని పశ్చాత్తాపపడి క్షమాపణ కోరుకుంటుంది. అప్పుడు బియ్యమన్నీ సరదాగా కలిసి పండగ చేసుకుంటాయి.

—ఇదీ కథ థీమ్.

భూతాలు ఇప్పుడు ముసిముసి నవ్వులు—నవ్వుకోలేదు తారెత్తిపోయాయి.

పొగమంచు విడిపోయినట్టు వాటి ఆకారాల్లో కదలిక ప్రారంభమయింది. కాలిన ఇనుము మీద నీళ్ళుపడితే పొగలురేగినట్టు వాటి ఆకారాల మీద దట్టమైన పొగలు రేగాయి.

భూతాలు ఇక అక్కడ ఆగలేదు.

వచ్చినదారినే రివ్వుమంటూ బయటికి పారిపోయాయి.

అవి తమ గురువు వద్దకే పరిగెడతాయని, తమని ప్రయోగించినవాడిమీదే పడతాయనీ రాంబాబుకు తెలుసు. అతడు భూతాలకి వినిపించిన తాజా కథ అతడు రాసిందే.




బ్రతుకుబాటల్లో
ఫోటో ఫీచర్
వ్యాఖ్యలు: జ్యోతిరాణి
బండరాళ్ళను తొలిచేందుకు
కండలు కరిగిస్తాం!
బడాబాబుల భవంతులకోసం
మా నెత్తురు మరిగిస్తాం!!
ఫోటో: డి.సుధీర్‌బాబ్జీ



చేతికందిన శ్రమ ఫలాల్ని
అమ్ముదామని అంగడికొస్తే
కొనేవారు రాకముందే
నిద్దరేలనో ఆవహించె

ఫొటో: డి. దండపాణి

చెట్టుకింద కాపురమైనా
చిర్నవ్వులు పంచుకుంటాం!
పొలం గట్టున విశ్రమించినా
మమతలనే పెంచుకుంటాం!

ఫోటో: కె.వి.శ్రీహరి




ఫోటో: వి.ముత్తురామన్

మీరు తాగే కాఫీలకోసం
తోటల్ని పెంచేము గింజలేరేము
అయినా మీ కాఫీ రుచే ఎరుగము మేము
శిరోవేదన రాదులెండి మాకు

ఫోటో: జగదీష్ ఆగర్వాల్


విరిసె ముత్యాల హరివిల్లు!
కురిసె రత్నాల నవ్వులజల్లు!!
అది ప్రవహించే నది!
ఇది పరవశించే మది!
ఫొటో: వి.ముత్తురామన్

రైతన్నల కృషి ఫలించిన వేళ!
పంట నూర్పిళ్ళ పండుగవేళ!!
రేపటి ఆశల సరికొత్త భాష్యం!
ఎద ఎదలో ఆనంద లాస్యం!!

ఫోటో: [illegible]



గంగా యమునలు
పొంగారిన నేల
గొంతు తడుపుకు
లేమాయె నేడు!!

ఫోటో: ఫణికుమార్

కొండ సన్నిధిలో ఒరిసిపారేను!
బడుగువారికి జీవింప దారిచూపేను!!
దప్పితీర్చే ఈ శీతల తోయములే
పచ్చని పైరుకి ప్రాణమిచ్చేను!!

ఫొటో: వి.ముతురామన్



మా ఇంటిదాక రాదీ రాజనాల
దున్నేవాడికి మట్టే మిగిలింది
నిండారచేలు దండిగా పండినా
మాలోళ్లకే మెతుకు కరువాయె

ఫోటో: కె.వి.శ్రీహరి



పూటకూళ్ళమ్మి వంటలు!
ఆర్పేను ఆకలిమంటలు!!
చూసేవారికి పచ్చడి మెతుకులు!
మాకైతే ఇవే మృష్టాన్నభోజనాలు!!

ఫోటో: వి.ముత్తురా



ఎండలు మండినా
వెన్నెల్లు కురిసినా
శ్రమించే జీవితాలు మావి!
బాధామయ బ్రతుకులు మావి

ఫోటో: యస్.కె. ఆర్గల్





ఊర్ధ్వపుండ్రములు నొసటనే దిద్దినా
వేద పురాణాలెన్ని కాచి వడబోసినా
వేళయ్యేసరికి రాకమానదీ ఆకలి!
యుగయుగాలుగా ఉన్న బాధ ఇది!!

ఫోటో: యస్.కె.ఆర్గల్



మూపున బరువులు మోసే శ్రమజీవులం!
మూర్ఖులకు మా పేరుపెడితే సహించలేం!!

ఫొటో: వి.ముత్తురామన్


బీళ్ళనోళ్ళకి నీళ్ళకోసం!
దండిగా పండేటి పంటలకోసం!!
ఫొటో: యస్. జి. శేషగిరి


గానుగచుట్టూ తిరిగేవు నీవు
కామందుల చుట్టూ తిరిగేను నేను
ఆకారాలలో తేడాలున్నా
చాకిరీలలో భేదంలేదన్నా
ఫోటో: వి.ముత్తురామన్

# 'అడవి' నవలపై సమీక్షలు



'చతుర' నవలల పోటీలో ద్వితీయబహుమతి పొంది ఫిబ్రవరి సంచికలో ప్రచురితమైన వసంతరావుదేశ్‌పాండే రచన 'అడవి'పై మాకు అందిన 'చతుర' సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.

## నవల కాదు... జీవితం

*(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)*

**భూ**మికోసం, భుక్తికోసం గోండులు చేస్తున్న పోరాటం; వీరిని వ్యాపారులు, పటేల్- పట్వారీలు, తాసీల్ సిబ్బంది, జంగ్లాత్‌వాళ్లు, అబ్కారీ వాళ్లు, పోలీసులు ఒక రూలు, ఒక ఖానూన్ లేకుండా ఎంత దారుణంగా దోచుకున్నదీ, అణచివేసిందీ వాస్తవంగానూ, సమగ్రంగానూ చూపించే నవల 'అడవి'.

1918కి ముందునాటి పరిస్థితినీ, ఆ తర్వాత నిజాంకాలంలో గోండ్లకు జరిగిన అన్యాయాన్నీ కొమరం భీము ప్రతిఘటననూ, ప్రస్తుతం గోండ్ల కడగండ్లనూ వర్ణించటంలో రచయిత ప్రతిభ బహుముఖంగా వెల్లడయింది.

వైవిధ్యంగల కథ, పరుగులెత్తించే కథనం, సజీవమైన భాష అడవి నవలను గొప్పదిగా నిలబెట్టాయి. ఇంతకుముందు 'చతుర' అందించిన నవలల్లో స్వేచ్ఛ, జైలు, బతుకు మొదలైనవి వస్తువైవిధ్యంగల మంచినవలల్లో కొన్ని. చారిత్రక సత్యాన్ని హృదయానికి హత్తుకునేలా చెప్పడంలో 'అడవి' నవల మరో ముందడుగు.

కథలోని గొప్పతనం నేటివిటీ, వర్ణనలు. అడవిని గురించిన సమగ్రమైన అవగాహన లేనిదే సాధ్యంకాని పని ఇది. ''తుకారాంకు వానాకాలం చదువుతో నాలుగు అక్షరం ముక్కలు బురదలా అంటాయి'', ''దారి చూపేవాళ్లు లేక వాళ్ళ బతుకులు చెదలుపట్టిన ఈతచాపల్లా చిల్లులు పడిపోయాయి'' అనటంలోనూ సేరేదార్‌కు శ్యామకొలాం పెండ్లాం నల్లగా చీకి పారేసిన మామిడికాయటెంకలా, పదేళ్ళు తొక్కిపడేసిన చెప్పులా, వాని కూతురు మోతి అడవిలో పూసిన దిరిశెన పువ్వులా, తేనెలో ముంచిన ఇప్పపువ్వులా కనబడతారు. దేవుబాయి తమలపాకులు తేనెకలిపి చేసినట్లుంటుంది, జంగు తనను పట్టుకున్నప్పుడు మొదట ఎలుగుబంటనుకుంటుంది. ఎవ్వరో తెలిసిం తర్వాత కుందేలులాగా ఒదిగిపోతుంది మెత్తగా - అతని చేతుల్లో... ఇలాంటివి నవలనిండా కొల్లలు.

చెప్పే విషయాన్ని సంక్షిప్తంగానే కాకుండా సింబాలిక్‌గా చెప్పటం ఇందులోని మరో గొప్ప లక్షణం. ''సత్యమేవ జయతే దుమ్ము కొట్టుకొని పోయింది'', ''ఇంటరాగేషన్ పేరుతో అడగాల్సింది అడిగారు, జరగాల్సింది జరిగింది'', ''పటేల్ పాన్‌లోకి సున్నం, కాసు సరిగ్గా సరిపోయింది - పటేలు నోరు ఎర్రగా పండింది'', ''పటేల్ దివాన్‌ఖానాను భూమి పోగొట్టుకున్న వాళ్ళ కన్నీళ్లతోనే కడిగేస్తారు'',''మధ్యాహ్నంవరకు ఆడదిక్కులేని సంసారంలా ఉన్న పోలీస్ స్టేషన్ ఎస్పీగారు వస్తున్నారనేసరికి సాయంత్రానికల్లా సినిమా సెట్టింగ్‌గా మారిపోతుంది.''

మోతీకి జరిగిన అన్యాయాన్నిగూర్చి చెప్తూ- చూస్తుండగానే తెల్లారిపోయింది అటు, ఈ ముత్యం నల్లబడిపోయింది ఇటు - అన్నమాటల్లో గురజాడ పూర్ణమ్మ చివరి గేయంలోని విషాదం ప్రతిబింబిస్తుంది.

అడవిని, అడవిజీవితాన్ని ఆటవికుల

పోరాటాన్నీ వాస్తవంగానేకాక, సమర్థవంతంగా చూపిన రచయిత ప్రతిభ అమోఘం. ప్రతి ఛాప్టర్‌కూ మొదట్లో వేసిన ఫొటోలు, అట్టమీద వేసిన ఫొటో సందర్భోచితంగా వుండి నవలకు సమగ్రతను కలిగించేవిగా వున్నాయి. రచయిత ప్రతిభ, నవలను ముద్రించినతీరు కలిసి పాఠకుడికి సినిమాస్కోప్ కలర్‌సినిమా చూసిన అనుభూతిని కలిగిస్తాయి.

ఏ ప్రయోజనమూ, ఆశయమూలేని కాలక్షేపపు నవలలు పాతిక రూపాయలకు అమ్ముడు పోతున్న ఈరోజుల్లో కేవలం రెండున్నర రూపాయలకే గొప్ప ప్రయోజనాత్మక నవలలను అందిస్తున్న 'చతుర'కు అభినందనలు... కృతజ్ఞతలు.

—టి.వి.ప్రసాద్, [illegible]

## 'అడవి' ఊరవ్వలేదు

(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)

'ఇంద్రవెల్లి సభ'నాటి ఓపెన్ ట్రాజెడీని వస్తువుగా స్వీకరించి, దాని పూర్వాపరాలను, క్రమానుగతంగా 'అడవి' తిరగబడుతోంది [illegible] చెప్పదల్చుకొని... [illegible] 'అడవి'లోకి వెళ్ళిన రచయిత - బహుశా 1940 నాటి జోడెన్‌ఘాట్‌వద్దే వుండిపోయాడు. అడవి-ఊరు అవుతోన్న క్రమాన్నిగానీ, నాగేటిచాళ్లో మొలకెత్తుతోన్న దాని విత్తుల్నిగానీ పోల్చుకోలేక 'అడవి'లోనే దారితప్పి తిరిగాడు. గొండు జీవితచిత్రణే - ఇంద్రవెల్లి రక్తంలో ప్రతిఫలించిన 'నేటి'లేందిగాకుండా - నాటి జోడెన్‌ఘాట్ దగ్గరకుపోయి కాలాన్నీ 'పెజిల్నీ' దుబారా చేసారు రచయిత. దాదాపుగా మూడు వంతుల పేజీలు గతంతోనేనింపి - అక్కడ్నించి గెంతువేసి 'తంబాకు' అన్నదగ్గరనూ, ఇంద్రవెల్లి సభకూ వచ్చారు. అంచేత - 'కొమురం భీం' తర్వాత, నలభయ్యేళ్లకు గొండులు తిరుగబడ్డతీరు, గొండుల క్రమానుగత చైతన్యం, ఆ వాతావరణం, ఆ శక్తుల ప్రసక్తి ఎక్కడా కనబడదు. గతం అనవసరం అనికాదు గానీ, అందులో 'నేడు' కనబడాలి; 'రేపు' ఆవిష్కరింపబడాలి. చరిత్రఅయినా కల్పన అయినా అది చదివినవారిని ప్రభావితం చేయాలి.

నిజానికి ఆనాటి 'కొమురం భీం' నేడు 'తంబాకు' అన్నో పాఠకుల సారో - అయినాడు. నాటి 'చంద్రవంక' నేడు అరుణపతాక అయింది. బాబేఝరి, జోడెన్‌ఘాట్ పోరుదారి, నేడు మహాప్రస్థానంజేస్తోంది. 'అడవి' - రాజ్యాధికార రహస్యం తెలుసుకున్నది. కనుకనే 'ఓపెన్ ట్రాజెడీ' అని ఎన్టీఆర్‌కూడా నొప్పుకున్న అంతటి ఘటన తర్వాతకూడా అలనాటి జోడెన్‌ఘాట్‌లో స్తబ్దమైపోలేదు 'అడవి'. నవలలో రాసినట్లు పదమూడు మృతదేహాలకోసం ఎవరూ అప్పుడు రాలేకపోవచ్చుగానీ తర్వాత వెలిసిన స్థూపమూ, నిర్బంధాలనధిగమించి జరిపిన స్మారకసభలూ, స్థూపాన్ని కూల్చినవారే - తిరిగి స్థూపాన్ని నిర్మించి యివ్వవలసిన పరిస్థితీ... ఏం తెలియజేస్తోంది? [illegible] తిరిగి లేచి, ఊరూ వాడాతో కలిసి లాంగ్ మార్చ్ చేస్తోందనేకదా! ఇవేమీ గమనంలోకి తీసుకోకపోతే - 'జోడెన్‌ఘాట్'కీ - 'ఇంద్రవెల్లి'కీ మధ్య ఎదిగిన చైతన్యాన్ని గుర్తించడమూ కష్టం; అందులోంచి 'రేపు'ను ఆవిష్కరించడమూ కష్టం. 'అడవి' రచయిత ఈ [illegible] నుంచి ఈ [illegible] గతంలోకి వెళ్ళి వుండే [illegible] పాఠకుడికి ఉత్తేజం కలిగేది.

—అపూర్వ కొమర్తి, శ్రీకాకుళంజిల్లా.

## సామాజిక స్పృహ కల నవల

(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)

'తెలుగు' నవలలుకూడా అంతర్జాతీయస్థాయికి ఎదగవచ్చునని నిరూపించింది ఫిబ్రవరి నెల 'చతుర' నవల "అడవి". సామాజిక స్పృహ అనేపదాన్ని ఒక జోక్‌లాగా తయారుచేసిన ఈనాటి రచయితలు తప్పకుండా చదవవలసిన నవల ఇది. "ఏ దేశ చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం? పరపీడన పరాయణత్వం" అని రుజువుచేస్తూ నిరంకుశంగా, నిర్దయగా తమ స్వార్థం, తమ సుఖంతప్ప ప్రజల కష్టనష్టాలు ఆలోచించని రాజులూ, అన్యాయంగా దౌర్జన్యంగా కుటిలనీతితో ఆక్రమించుకుని మనల్ని బానిసలుగా పరిపాలించిన ఆంగ్లేయులకంటే, నైజాం నవాబులకంటే నేటి "ప్రజా" ప్రభుత్వమే మన ప్రజల్ని ఎక్కువ





కష్టాలపాలు చేస్తోందనడానికి నిదర్శనం ఈ 'అడవి' "బ్రిటిష్‌వాళ్లు పాలించినప్పుడు వాళ్లు పరాయివారైపోయారు. ఇప్పుడు ఏదైనా అడగాలంటే మనవాళ్లే అయిపోయారు. అంచేత సగటుమనిషి జీవితం అలాగే వుండి పోయింది" అనేమాట ఎంత వచ్చి నిజం.

ఈ నవలలో గిరిజనుల్నీ, వాళ్ల బతుకుల్నీ చదువుతుంటే కళ్లలో నీళ్లొస్తాయి. అడవులను నమ్ముకుని జీవించేవారికి ఉపాధికలిగించవల సిన అధికారులే వాళ్లను అనర్థాలకు గురిచేస్తు న్నారు. వాళ్లు బానిసత్వపు అంచులలోనే బతు కుతున్నారు. గోండులు అనుభవిస్తున్న కష్టా లు, సమస్యలు కళ్లకు కట్టినట్లు రాశారు. వాళ్లు రక్తం ధారపోసి పండించే పంటలు, ప్రాణా లకు తెగించి క్రూరమృగాలనెదిరించి తెచ్చు కునే ఫలసాయాలు ఏమౌతున్నాయి? దళారీల పాలౌతున్నాయి; అధికారుల దాహానికి నీరౌతు న్నాయి. పునరావాసం పేరుతో అధికారులు దోచుకుంటూ, అభివృద్ధి పేరుతో బానిస బతుకు రుచిచూపిస్తున్నారు. దళారీకి, మోసా నికీ, దోపిడీకి రాఘవులు ఒక నమూనా మాత్రమే. ఒకడు లక్షాధికారి కావాలంటే ఎంత మంది భిక్షాధికారులు కావాలి?

పుట్టుకతో 'అడవి'మీద ఆధారపడ్డ గిరిజను లు ఈరోజు అడవినుండి ఏది తెచ్చుకోవాల న్నా ప్రభుత్వం పర్మిషన్ ఇవ్వాలి. ఆ పర్మిషన్‌కి ఎంత కష్టపడాలో, ఎన్ని లంచాలు ఇచ్చుకో వాలో అందరికీ తెలిసిందే. గిరిజన సహకార సంస్థలు పట్నాల్లో వుంటాయి. అంతదూరం వెళ్ళి అమ్ముకోలేని అమాయకులు ఈ దళా రీల పాలపడతారు. రూపాయి రావలసినచోట పదిపైసలే వస్తాయి.

— పి.శ్రీలక్ష్మి ,తణుకు.

## గోండుల గోడుకు అద్దం

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**తె**ల్లవాళ్ళ పాలనపోయి భారతీయుల పాలన వచ్చింది. అదే "స్వాతంత్ర్యం" అయితే అది కేవలం రాజకీయనాయకుల పదవీదాహం తీర్చడం కోసం వచ్చిన స్వాతంత్ర్యమే తప్ప చీకటిలో వున్న "అడవి" జాతుల బతుకులలో వెలుగుకోసం మాత్రం కాదు. ఈ సత్యాన్నే కళ్ళకు కట్టినట్టు చూపిస్తూ గోండుల జీవితా లకు అద్దంపట్టిన నవల "అడవి." ఈ నవల అతిశయోక్తిగాని, కల్పితంగాని కాదు అన్పించింది. నవల చదువుతుంటే అది ఓ రచయిత రాసిన నవలలా కాక ఒక యదార్థగా థలా, కళ్ళ ముందు జరుగుతున్న వాస్తవ సంఘటనల్లా అన్పించింది. మనతోటి మను షుల్లో కొందరి జీవితాలను అర్థంచేసుకోవాలను కునేవారికి గైడ్ ఈ "అడవి."

మా పక్క జిల్లాయే ఆదిలాబాదు జిల్లా. అయినా "గోండులు" అనే మాట వినటమే కాని వాళ్ళ ఆచారవ్యవహారాలు, వస్త్రధారణ, ఆహారపు అలవాట్లు ఏమిటి?- అనే విషయా లు ఈ నవల ద్వారానే తెలిశాయి. చదువు తుంటే ఈనాటి అడవి జాతుల బ్రతుకుల కంటే స్వాతంత్ర్యం రాకముందున్న వారి బతు కే నయమేమో అన్పించింది. ఎందుకంటే ఆనాడు కనీసం కట్టవలసిన పన్నులూ అవీ సరిగా కడితే ఎలాగోలా బతికేవారేమో! కానీ ఈనాడు దినదిన గండం నూరేళ్ళాయుష్షు అన్నట్టు అయిపోయాయి వారి బతుకులు. పోలీసులు ఏరోజు వచ్చి ఎవరిని తీసుకుపోతా రో, వారు తిరిగి వస్తారో లేదో నమ్మకంలేదు. నాడు వెట్టిచాకిరీకి వ్యతిరేకంగా ప్రాథమిక హక్కులు కాపాడుకోవడం కోసం బతుకులు బలయిపోతూనే ఉన్నాయని తెలియజెప్పింది నవల.

అడవి జాతులవారిని చాలా సులభంగా దోచుకోవచ్చుననీ, అటవీ సంపదను వారి ద్వారా కారుచవకగా పోగుజేసుకోవచ్చుననీ "రాఘవులు" పాత్రద్వారా కళ్ళకు కట్టినట్టు చూపించారు రచయిత. వ్యాపారం చేసి లాభా లు సంపాదించుకోవటానికని రాఘవులు వస్తే- తమ మేలుకోసం, తమ బాధలు చూడలేక వచ్చాడు అనుకునే బహు అమాయకులు గోండులు- అని రచయిత చాలా చక్కగా చూపించారు.

దేవు, జంగు పాత్రల ద్వారా ప్రేమాభిమానా లనేవి ఏవిధంగా ఉంటాయో కూడా రచయిత తెలియజెప్పారు. పదిమంది వ్యక్తులను ఒక చౌకీదారు చావబాదే సంఘటన ద్వారా "మనం పదిమందిమి, ఆ చౌకీదారు ఒక్కడూ ఏమీచేయలేడనే" ఆలోచనకూడా కలగని

అమాయకులీ అడవిజాతులవారు అని తెలుస్తుంది.

వాళ్ళ పండుగలు ఏవిధంగా ఉంటాయి? ఎప్పుడు ఉంటాయి? ఏరీతిలో జరుగుతాయి?- లాంటివన్నీ రచయిత స్వయంగా చూస్తూ రాశారా అన్పించేట్టుగా ఉన్నాయి వర్ణనలు. ఈ నవల నాయకులుకానీ, అధికారులుగానీ చదివితే సిగ్గుతో తలవంచుకోక తప్పదు.

—వంకా.వి.వి. సత్యనారాయణ వర్మ

## చరిత్రకెక్కని సత్యాలు

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

సెక్స్, క్రైమ్, ప్రేమ, హారర్‌లతో ఒకేమాదిరిగా వుంటూన్న నేటి నవలా సాహిత్యానికి అతీతంగా సభ్యసమాజంలో అట్టడుగు జాతులకు జరిగిన, జరుగుతున్న అన్యాయాల్ని, దారుణాల్ని చాటిచెప్పడానికి ప్రయత్నించిన పరిశోధనాత్మక నవల; చరిత్రలో బయటపడని అంశాల్ని బయటకు తెచ్చిన నవల ''అడవి.'' నిజానికి ఇది చదువుతున్నప్పుడు నవల చదువుతున్నాం అనే ధ్యాసేవుండదు. నవలలోని సంఘటనలు, పాత్రలు కళ్ళముందు లీలగా అవుపిస్తున్నట్లుగానే వుంటుంది.

నైజాం పాలనలో అనేకమంది దారుణంగా కష్టాలుపడ్డసంగతి చాలా మందికి తెలిసిందే. ఆ గిరిజనులు అనుభవించిన కష్టాలు అంతగా వెలుగులోకి రాలేదు. దోపిడి వున్నచోట చైతన్యంరాక తప్పదని, విప్లవం అనివార్యం అని రచయిత మరోసారి ఆ చారిత్రక సత్యాన్ని గుర్తుచేశారు. ''అడవి ఆత్మాహుతితో పునీతమైన ఈ నేలతల్లి కడుపులోంచి, కొత్త వ్యవస్థ మొలకెత్తుతుంది; కొత్తజీవితం విచ్చుకుంటుంది. కొత్త మనిషి జీవించనారంభిస్తాడు'' అంటూ ముగింపులో రచయిత నూతన వ్యవస్థ వస్తుందనే ఆశాభావం వ్యక్తపర్చారు.

ఫికర్, ఖానూన్, చౌబినా, పడేల్, జంగ్లాత్‌వాళ్ళు వంటి పదాలను నవలలో సందర్భానుసారం పాఠకులు అర్థం చేసుకున్నప్పటికీ- పూర్తి అర్థం తెలియలేదు. వాటి అర్థాలను బ్రాకెట్లోగాని, చివర్నగాని సూచించి వుంటే బావుండేది.

పాపులారిటీ కోసం ప్రాకులాడుతూ ఏదో ఒకటిరాసి పేరుతెచ్చుకోవాలనే రచయితలే ఎక్కువగా వున్న ఈరోజుల్లో సమాజంలో అట్టడుగున వుండి, దోపిడికి గురవుతున్న గోండు జాతివారి కన్నీటి బతుకులను పాఠకుని మనస్సుకు హత్తుకునేలా చిత్రించారు. సమాజం గురించి, అందులోని హెచ్చుతగ్గులను గురించి కనీసం కొంతసేపైనా పాఠకుడు ఆలోచించేవిధంగా 'చరిత్రను' నవలగా అందజేసిన వసంతరావ్‌దేశ్‌పాండేగారికి కృతజ్ఞతలు. తొలి నవల్లోనే తన ప్రతిభను కనబర్చిన రచయిత మున్ముందు మంచి రచయితగా స్థిరపడగలరు. ఎప్పటిలాగే తన ప్రత్యేకతను నిలుపుకుని జన్మదిన కానుకగా ఈ నవలను అందించినందులకు ''చతుర''కు అభినందనలు.

ఒక్కమాటలో చెప్పాలంటే - చరిత్రకెక్కని అనేక అంశాల్ని సభ్య సమాజానికి అందించిన గొప్ప చారిత్రక నవల ''అడవి''. అధికారులు నొక్కి పెట్టినంత మాత్రాన జరిగిన సంఘటనలు బయటకు రాకపోవని ఈ నవల రుజువు చేసింది.

—ఐ.యల్.యస్.చంద్రశేఖర్, తిరుపతి.

## లోపాలు

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

అమాయక గోండులను దోచుకుని తింటున్న ప్రభుత్వాధికార్లు, వ్యాపారస్తులు గ్రామదేవతలను గురించి శ్రీ వసంతరావు దేశ్‌పాండే చక్కగా చిత్రీకరించారు.

నవల చదివాక ఆదిలాబాద్ గురించి తెలిసినవాడిగా నాకు కలిగిన కొన్ని సందేహాలు.

గిరిజనుల్లో గోండులు చాలా వెనుకబడినవారు. వీరిని కేవలం గిరిజనేతరులే దోపిడీచేయడంలేదు. గిరిజనుల్లో అభివృద్ధిచెందిన లంబాడాలు కూడా ఈ విషయంలో ముందున్నారని చెప్పకతప్పదు. ప్రభుత్వపరంగా లభిస్తున్న ఎన్నో సౌకర్యాలు, రిజర్వేషన్లు, చదువుసంధ్యల్లో ఆర్థికంగా ఎదిగిన లంబాడాలు కొట్టేస్తున్నారు. 1981 ఏప్రిల్ కాల్పులకు దారితీసినవి కూడా లంబాడా-గోండుల వైషమ్యాలే. మహారాష్ట్రనుండి ఎడతెగకుండా వలసవస్తున్న లంబాడాలకు గిరిజనులకున్న అన్ని సౌకర్యాలు అందడం, స్థానిక గోండుల పొట్టకొట్టడమే.




రాజకీయపార్టీలు కూడా ఈ లంబాడాలకిస్తున్న రాజకీయ పదవులు గోండులకు ఇవ్వడంలేదు. ముఖ్యమైన ఈ గోండు-లంబాడా సమస్యను రచయిత ఎక్కడా ప్రస్తావించలేదు

గిరిజనులకు సారా అతిముఖ్యమైన పానీయం. స్వంత అవసరాలకు వారు సారా తయారుచేసుకోవచ్చు. అయితే సారాబట్టీలు పెట్టి, వారు అమ్ముకుంటున్నారన్న నెపంతో సారా కాంట్రాక్టర్లు, అబ్కారి అధికారుల సహాయంతో గిరిజన గ్రామాలపై దాడులుచేయడం, స్త్రీ- పురుషులపై దౌర్జన్యాలు జరపడం తరచుగా జరుగుతుంది. ఆదిలాబాద్ రాజకీయాల్లో కూడా సారా కాంట్రాక్టర్లదే ముఖ్య పాత్ర. 'అడవి' నవలలో చిన్నదైనా ఒక సారా కాంట్రాక్టరు పాత్ర ప్రవేశపెట్టి వుంటే నవలకు నిండుదనం వచ్చేది.

కొమురంభీము నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధపోరాటం జరిపిన స్వాతంత్ర్య యోధుడు. ఆయన వ్యక్తిత్వాన్ని రచయిత చాలా కుదించివేశాడు. భీము నవలలో చూపినంత సులభంగా నిజాం ప్రభుత్వం చేతిలో ఓడలేదు. కొమురం భీము గురించి, ఆయన తిరుగుబాటు గురించి రచయిత మరికొంత స్టడీ చేస్తే బాగుండేది. హెమన్‌డార్ఫ్ రిపోర్టుపై నిజాం ప్రభుత్వం కొన్ని సంక్షేమచర్యలు తీసుకుంది- ఏమీ చేయలేదనడం సరిగాదు. అదే విధంగా పోలీస్ చర్య తర్వాత, ప్రజాప్రభుత్వాలు వచ్చాక కూడా గోండుల జీవితాల్లో ఏ మార్పు రాలేదనడం న్యాయంకాదు. గిరిజన కార్పొరేషన్, సమీకృత గిరిజనాభివృద్ధి సంస్థ వంటివి చేస్తున్న కృషిని పూర్తిగా కొట్టేయడానికి వీలులేదు. నవల చదివాక ప్రభుత్వోద్యోగులంతా దోపిడీ దొర్లేనని భావన కలుగుతుంది. పోలీసు, అటవీ, అబ్కారి మరియు రెవిన్యూ అధికార్లే ఇందులో కనబడతారు. చిత్తశుద్ధితో గోండుల అభివృద్ధికై కృషిచేస్తున్న కొందరు అధికార్లకు ఇది నిరాశ కలిగిస్తుంది. ఈ నవలలో నాయకుడిగా రచయిత ఎవర్నీ నిలబెట్టలేకపోయాడు. జంగుకు ఆ లక్షణాలు కొన్ని వచ్చాయి. నవల ప్రారంభంలో ఎత్తుకున్న సిద్ధార్థ పాత్రను రచయిత మరిచేపోయాడు.

—వేముల ప్రభాకరగౌడ్, హైదరాబాద్.

---

# ఏరిన ముత్యాలు

★ మనస్సు తుచ్ఛమైన వాంఛలనుండి విముక్తి చెందుటకు గొప్పసాధనం కళ. కావ్యం, చిత్రం, సంగీతం మొదలయినవి ఇంద్రియాలను అశక్తపరచి ఆధ్యాత్మిక ప్రపంచంవైపు లాగుతాయి.

—సంపూర్ణానంద

★ మనకు రెండురకాల చదువులున్నాయి. ఒక చదువు బ్రతకటం ఎలాగో నేర్పుతుంది. మరొక చదువు బతుకంటే ఏమిటో చెబుతుంది.

—ఆడమ్స్

★ సుఖానికి అవసరమైన మూడు అంశాలు. చేసేందుకు ఏదో ఒక పని, ప్రేమించేందుకు ఎవరో ఒకరు, ఆశగా ఎదురుచూసేందుకు ఏదో ఒకటి ఉండటం.

— అలెగ్జాండర్ చామర్స్

★ మంచి స్వభావం అందంలేని లోపాన్ని పూరిస్తుంది. కాని అందం స్వభావలోపాన్ని పూరించలేదు.

— ఎడిసన్

★ విశాల దృక్పథమే జీవితం, సంకుచిత తత్వమే మృత్యువు; స్వార్థపరత్వమే సర్వనాశనం, ప్రేమే జీవితం- ఇదే జీవిత సత్యం.

— వివేకానంద

★ జీవితానుభవంలో నేను తెలుసుకున్నదేమిటంటే ఒక్క దుర్గుణం కూడా లేనివానిలో ఒక్క సద్గుణం కూడా ఉండదు.

— లింకన్

★ వివేకంగల శత్రువుకంటే వివేకశూన్యుడైన స్నేహితుడే ఎక్కువ ప్రమాదకరం.

— షేక్స్పియర్

★ ఇతరులపైన పితూరీలుచేసి ఫిర్యాదులుచేసేవారిలోనే ఎక్కువ లోపాలు, తప్పులు ఉంటాయి.

—ఎమ్. హైన్రీ

★ సాహిత్యం ద్వారా సంస్కారానికి పూనుకొనే రచయిత మొదట తన్నుతాను పరీక్షించుకొని తన నిజాయితీ, శీలం, వ్యక్తిత్వం పట్ల నమ్మకం కలిగిన తరువాతే అందుకు ప్రయత్నించాలి.

—గోపీచంద్

★ ఓ అమ్మాయి, అబ్బాయి పెళ్లిచేసుకున్న తరువాత వారి ప్రేమ తపీమని ఆగిపోయి వారి చరిత్ర ప్రారంభమవుతుంది.

— రోషెబ్రూన్

★ తండ్రి కావటానికి పెద్ద తెలివితేటలు అవసరంలేదు కానీ, తండ్రీగా ఉండటానికి ఎంతో వివేకం కావాలి.

— బింగ్‌చే

★ మనమీద మనకున్న నమ్మకమే ఇతరులలో మనకు నమ్మకాన్ని కలిగిస్తుంది.

— లారోచేఫీకాల్డ్

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ



ప్రచురించే ప్రతి నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'.



# రచయితలకు సూచనలు

★ "చతుర"లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగానీ, తగ్గించటంగానీ ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువగాకుండా ఉండాలి. వ్రాతప్రతిలో వారి వారి దస్తూరినిబట్టి,ఒక పేజీకి ఎన్ని పదాలు వస్తున్నాయనేదానినిబట్టి మొత్తం నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికగాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగుపోస్టేజీని జతపరచాలి. వ్రాత ప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్

## చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

# మే నెల చతురలో




నారాయణ 'స్వామీజీ'ని పొడిచేశాడట! తెల్లవారేసరికి ఊరంతా గుప్పుమందీవార్త. కబురు తెలిసిన ప్రతివారూ పరుగు పరుగున ఆశ్రమం చేరుకుంటున్నారు.

అందరి మనసుల్లో ఒకే ప్రశ్న!

పండు ముసలి. దివ్యత్వం, దయ తొణికిసలాడే కళ్ళతో, మూర్తీభవించిన పవిత్రతలా ఉండే స్వామీజీని; ఎవరే కష్టం చెప్పుకొన్నా తన చల్లని మాటతో సేదదీర్చే స్వామీజీని హత్యచేయడానికి మనసెలా వొప్పింది?

"లేదు... లేదు... ఎక్కడో పొరబాటు జరిగింది. స్వామీజీ ఆశీర్వాదబలంతో మృత్యుముఖం నుండి తప్పించుకొన్న నాభర్త ఇటువంటి ఘోరాన్ని ఎన్నటికీ చేయడు... చేయలేడు" అంటూ ఆక్రోశించింది నారాయణ భార్య.

**సృష్టిలోకెల్లా అతి చిత్రమైన మనిషి అంతరంగాన్ని, అతని అనూహ్య ప్రవర్తనను విశ్లేషిస్తూ, సమీక్షిస్తూ సాగిన డాక్టర్ అల్లూరి రాజకుమారి రచన 'అంతర్మథనం'**

# చతుర

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/HD /4